# SANDHI

## A Historical treatment of Telugu Sandhi.

ప్రథమ ముద్రణ 1935
ద్వితీయ ముద్రణ 1948
తృతీయ ముద్రణ 1956

అవంతీ ప్రెస్, – రాజమండ్రి.

ప్రతులు 1000 వెల రు 3/-

# PREFACE.



## (To the First Edition)

This treatise on Sandhi proposes to deal with the principles of Euphonic Combination in Telugu from a historical point of view. Most of the grammars of the Telugu Language now in the field written either by Indian grammarians or by foreign scholars are merely of a descriptive nature. The Telugu grammarians, and for the matter of that, all Indian grammarians, have in the analysis of their vernaculars followed the principles which the grammarian Panini has adopted in his analysis of the Sanskrit Language. Though Panini did not intend to write a historical grammar, he took care at least to point out the differences, due to the growth of the Language, between the old Vedic and later Sanskrit by drawing a distinction between them as Chandas and Bhasha. But the Telugu grammarians were generally very conservative in recognising the changes due to the growth of Language. Moreover, since, as descriptive grammarians, they merely set themselves to the task of analysing the language of the standard literary works and frame rules for the guidance of those who study that language, they were naturally obliged to cut up expressions in the language, according to the form of the existing words, to suit their general classificatory purpose, rather than try to find explanation in the previous history of the language, for what they consider peculiarities in the grammar. This kind of mal-analysis of the forms of language which is also a result of their having had to follow the model of Panini's analysis of Sanskrit, has only served to screne from our view the stages of natural growth of the language, rather than exhibit the true lines of its development. That is why we meet with a number of meaningless **agamas** and **adesas** in these grammars which, when considered from a historical point of view, explain themselves away

in a more consistent and rationalistic manner. Such a study of the facts of grammar of a language requires an inter-comparison of the grammatical facts of closely allied languages, which not only explains many unexplained features in their grammars, but even throws light on the earlier history of the language and the general characteristics of the common mother-tongue from which those languages have been derived. Hence is this first attempt made in this language to introduce the historical method into the field of Telugu grammatical studies. It is hoped that this will prove to be a stepping-stone for tracing further the history and development of the Telugu Language.

I take this opportunity to thank the Junior Lecturer Mr. S. Lakshmipati Sastry for helping me in going through the proofs of this work, and the University authorities for sanctioning the publication of the same.

ORIENTAL RESEARCH INSTITUTE,
LIMBDI GARDENS,
*Royapettah, Madras. 1–12–1935.*

**K. R.**

## (Second Edition)

This work was first published as a bulletin - Madras University Telugu Series No. 5 - in the year 1936 by the University of Madras. I am very grateful to the authorities of the University for having granted me permission to print and publish the second edition of this work now at my own cost.

University Buildings,
Madras, 1-11-48.

K. RAMAKRISHNAIYA.

# తొలిపలుకులు



ఇంతవఱకు నీ దేశీయభాషలలో వెలువడిన ప్రాచీన వ్యాకరణము లన్నియు, ప్రాయికముగా నాయా భాషల తాత్కాలికావస్థను దెలుపునవే గాని వాని పూర్వోత్తర చరిత్రమునుగాని, సన్నిహిత భాషలతో వానికిఁ గల సంబంధమునుగాని సూచించునవిగా లేవు. గీర్వాణభాషను వ్యాకరించి దానికి లక్షణ మేర్పరచుటలో పాణిని యవలంబించిన పద్ధతియే వీని కన్నిటికిని మార్గదర్శకం బయ్యెను. పాణిని "ఛందసి, భాషాయాం" అని గీర్వాణ భాషకుఁ గాలక్రమమునఁ గలిగిన మార్పులను సూచింపనైన సూచించినాఁడు. కాని యాంధ్ర వైయాకరణు లట్టి మార్పులను గమనింపరైరి. పైఁగా మఱికొందఱు శబ్దశాసనవరేణ్యుఁడు భారతమునఁ బ్రయోగించిన భాషకంటె భిన్నమగు భాషనే ప్రయోగింపఁగూడదని శాసింప సిద్ధపడినారు. వ్యాకరణవిషయమున నాదర్శముగా గ్రహింపఁబడిన సంస్కృతభాష కిది జన్యభాష లేదా వికృతి యను భావముకూడఁ బ్రబలఁజొచ్చినది. కాని యిటీవల నాంగ్ల భాషాసంబంధము, పాశ్చాత్య శబ్దశాస్త్రజ్ఞుల భాషాతత్త్వ పరిశీలనా పద్ధతులతోడి పరిచయము, ఇతర సన్నిహిత భాషాజ్ఞానము, తత్సంబంధాన్వేషణ పరత్వమును, కొంత ప్రబలిన కాలమున నీ దేశీయ భాషల కార్యానార్యభాషలతోఁ గల సంబంధ విశేషమును గనిపెట్టవలయు నను కౌతూహలము కొందఱు పాశ్చాత్య పండితులకును దేశీయ ప్రముఖులకును గూడఁ గలిగినది. దక్షిణ హిందూదేశ భాషల విషయమున నీ యుద్యమమును దొలుతఁబట్టి సాగించినవాఁడు రెవరెండు కాల్డ్వెల్ పండితుఁడు. దక్షిణదేశ భాషలగు నాంధ్ర తమిళ కన్నడ మళయాళాదులకు శబ్దజాలముననుభాషాలక్షణవిశేషములందును గల సామ్యమును నిరూపించి, వీని సాజాత్యమును స్థాపింప యత్నించినవాఁడగుటచే నందలి వ్యాకరణవిశేష

ముల చరితమును దెలిసికొనుటకును దన్మూలమున నాయా భాషల ప్రత్యేక చరితము నన్వేషించుటకును అనువగు మార్గమును ప్రతిష్ఠించినవాఁడైనాఁడు.

ఆ మార్గము ననుసరించి యాంధ్రభాషా లక్షణ విశేషములను చారిత్రక పద్ధతిని పరిశీలించి, సజాతీయములగు నితరభాషాలక్షణములతో సాధ్యమైనంతవఱకు సమన్వయింపవలయునను కౌతూహలమే యీ గ్రంథ రచనకుఁ గారణమైనది. ఒక భాషయందలి తాత్కాలిక వ్యాకరణ విశేషములను సమన్వయ దృష్టితో పరిశీలించి వాని తత్త్వమును దెలిసికొన నిదే యా భాషాచరిత్రమును దెలిసికొన సాధ్యము కాదుగదా. ఆంధ్ర భాషా చరిత్ర కిట్టి చారిత్రక వ్యాకరణము పునాదివంటి దగును. కావున నీ భాషలోని శబ్దముల సహజస్వరూప నిరూపణమునకుఁ దోడ్పడు సంధి నియమములను చారిత్రక పద్ధతి ననుసరించి యితర సన్నిహిత భాషాలక్షణ ములతో సరిపోల్చి యందలి విశేషములను సకారణముగ సమన్వయించుట కిందు నాచేతనైన యత్నము చేయఁబడినది. ఆంధ్రవ్యాకరణ తత్త్వ పరి శోధన విషయమున చారిత్రకపద్ధతి నవలంబింపజేయుట కీ రచనము కొంత వఱకైన దోడ్పడఁగలదని నమ్ముచున్నాను.

ఈ గ్రంథ ముద్రణ సందర్భమున నాకెంతయుఁ దోడ్పడిన జూని యర్ లెక్చరర్ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారికిని దీనిఁ బ్రకటింప నంగీక రించిన విశ్వవిద్యాలయాధి కారులకును నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ప్రాచ్యపరిశోధనాలయము,
లిఝ్మి గార్డెన్స్, రాయపేట,
మద్రాసు, 1-12-1935

కో. రా.

# విషయసూచిక



శ్రీరస్తు

# సంధి

## భాషాలక్షణము - వ్యాకరణములు

భాషల స్వరూపలక్షణముల నేర్పరించుట కందలి పదముల చారిత్రముకంటెను, వాని నిష్పత్తిక్రమము, అందలి వాక్యసంఘటనారీతులు, వ్యాకరణ విశేషములు మొదలగు వాని యథార్థజ్ఞానమే యెక్కుడు సాహాయ్యకారి కాఁగలదని శబ్దశాస్త్రవేత్తల మతమైయున్నది. కావునఁ దెనుఁగు, తమిళము, కన్నడము మొదలగు దక్షిణహిందూదేశ భాషల స్వరూప విశేషములను, ఇతరభాషలతోఁగల సంబంధము, వాని పరిణామక్రమమును నిర్ణయించుటకుఁ బూర్వము తద్భాషాలక్షణమును, అందలి వ్యాకరణవిశేషముల తత్త్వమును పరిశీలింపవలసిన యావశ్యకమెంతేనియుఁ గలదు.

సామాన్యముగాఁ బూర్వకాలమం దేభాషలోనైనను ప్రసిద్ధలక్ష్యగ్రంథములు బయలుదేఱిన పిదపఁగాని యా భాషకు లక్షణ మేర్పడినట్లగపడదు. ఒక భాషకు లక్షణ మేర్పఱచుట యద్దానిని వ్యాకరించుట (analysis) చే సాధింపఁదగియుండును. భాషను వ్యాకరించుట యనగా సంపూర్ణ

భావమును వ్యక్తీకరించెడి యఖండవాక్యములను గొన్నిటిని గ్రహించి వానిలో నొకదానితో మఱియొకదానిని బోల్చి యా వాక్యములలో నేయే వాక్యముల కెంతెంత యర్థము గలదో, ఏ భాగమెట్టి యుపయోగముగలదో, ఒక భాగముతో మఱియొకభాగమునకుఁ గల సంబంధమెట్టిదో, యను విషయములను బరిశీలించి, యా యఖండ వాక్యమును భేదించి, దానిలో నీ యీ భాగము దాని పూర్ణభావములో నీ యీ ఖండభావమును సూచించుచున్న దని నిర్ధారణ చేయుటయే యైయున్నది. సంపూర్ణార్థబోధక మగు నఖండవాక్యమే భాషకు మూల మనియు, కర్త, కర్మ, ప్రకృతి, ప్రత్యయము మున్నగు విభాగము లన్నియుఁ గాల్పనికములే గాని వాస్తవికములు గావనియుఁ బ్రాచీన హైందవశబ్ద శాస్త్రజ్ఞుల మతమై యున్నది. కావుననే వారు వాక్యస్ఫోట కిచ్చిన ప్రాధాన్యము బదస్ఫోట వర్ణస్ఫోట మొదలగువాని కిచ్చియుండలేదు. శతపథ బ్రాహ్మణములోని యీ క్రింది వాక్యముగూడ భాష యొకప్పు డఖండమై అవ్యాకృతమైయుండె ననియు నది కాల క్రమమున వ్యాకృతమైనదనియు సూచించుచున్నది. 'వాగ్వై పరాచీ అవ్యాకృతా అవదత్తే, తే దేవా ఇంద్ర మబ్రువన్, ఇమాం నో వాచం వ్యాకురు. తాం ఇంద్రః మధ్యతో ఉప క్రమ్య వ్యాకరోత్, తస్మాదియం వ్యాకృతా వాగుద్యతా॥'

దీనికి శాయనభాష్యము: "అగ్నిమీళే ఇత్యాది వాక్ పూర్వస్మిన్ కాలే, పరాచీ, సముద్రాదిధ్వనివ దేకాత్మికాసతీ,

అవ్యాకృతా-ప్రకృతిః, ప్రత్యయః, పదం, వాక్యం ఇత్యాది విభాగరహితా ఆసీత్, తాం వాచం ఇంద్రః మధ్యేఽవక్రమ్య, ప్రకృత్యాదిరూపేణ విభజ్య వ్యాకరోత్, ఇతి. ఏవంచ అసత్యారుంధతీ దర్శనేన సత్యారుంధతీదర్శనవత్ పంచకోశాది వ్యుత్పాదనన్యాయేన మిథ్యావస్తుపరిహారేణ అఖండసచ్చిదానంద ప్రతిబోధనవచ్చ, అసత్యభూతప్రకృతి ప్రత్యయార్థ నిరూపణేన సత్యభూతాఽఖండవాక్యార్థబోధనం వ్యాకరణాదినా క్రియతే ఇతి బోధ్యం."

దీనినిబట్టి యొకకాలమున నఖండమై యవ్యాకృతమై యున్న గీర్వాణవాక్కు నొక్కకాలమున దేవతల ప్రార్థన నంగీకరించి యింద్రుడు వ్యాకరించెనని తెలియవచ్చుచున్నది. "వ్యాక్రియంతే వివిచ్య ప్రదర్శ్యంతే అనేన శబ్దాః ఇతి వ్యాకరణమ్." దీనిచేత భాషలోని శబ్దములు విడఁగొట్టబడి వాని రూపనిష్పత్తిక్రమము చూపఁబడుచున్నది. కావున నిది వ్యాకరణమని చెప్పబడుచున్నది. అని వ్యాకరణ శబ్దమును భాష్యకారుఁడు నిర్వచించి యున్నాఁడు. ఇట్లాయా భాషల యందలి వాక్యముల యవయవములను విడఁదీసి యాం దేయవయవ మెట్లేర్పడి, యెట్టిభావముకలదై యితరావయవములతో నెట్టి సంబంధముకలదగుటచేఁ దత్తద్భావబోధకంబగుట తటస్థించినదో వ్యక్తముచేయుచుఁ దత్తద్భాషాతత్త్వజ్ఞులాయా భాషా సంప్రదాయములను గనిపట్టినచో వానిని సరిపోల్చి చూచినవారి కందలి సామ్యమునుబట్టి వానికిఁగల సంబంధ స్వరూపమును నిర్ణయింప సుకరంబగుచుండును.

లోకమున వ్యవహరింపఁబడుచున్న భాషలన్నియుఁ గూడఁ బుట్టుకలో సంకేతరూపములు, ధ్వన్యాత్మకములునై అనుకరణము, సుఖదుఃఖాది భావావిష్కరణము మొదలగు కారణములచే బయలుదేఱినవే యగుటచేతను, మానవ ప్రకృతి లోకమంతట నొక్కరీతిగలదై యుండుటచేతను, నతి దూరస్థములగు జనసంఘముల భాషలలోఁగూడఁ గొన్ని సామాన్య లక్షణములు, సమానార్థక శబ్దములు క్వాచిత్క ముగాఁ గనఁబడినఁ గనఁబడవచ్చును గాని యంతమాత్ర ముచే నా భాషలకు సన్నిహితసంబంధము కలదని నిర్ణయింప వీలులేదు. ఇఁక నేమనఁగా నాయా జనసంఘములు కేవల సంజ్ఞాత్మక భాషను (Gesture Language) వదలి ధ్వన్యా త్మకభాష నవలంబించి నప్పటినుండి క్రమక్రమముగా వృద్ధి నొందుచుండిన తమ భావసంపదను వ్యక్తధ్వనిరూప భా షలో (Articulate speech) చెప్పుటకుఁగా నవలంబించిన పద్ధతులయందలి సాదృశ్యాసాదృశ్యములను బట్టియే ముఖ్య ముగా నాయా భాషలకుఁగల సాజాత్య వైజాత్యములు నిర్ణ యింపఁబడుచున్నవి. అనఁగా నొక సంపూర్ణభావమునందలి భాగములను సంపూర్ణవాక్యము నందలి యవయవము లెట్లు వ్యక్తము చేయుచున్నవో, అట్లు వ్యక్తముచేయుట కవి యా వాక్యమునం దెట్లమరియున్నవో, భావభేదములను సూచించు టకు నా వాక్యావయవములగు శబ్దము లెట్టి మార్పులనొందు చున్నవో యను విషయములనుబట్టి నిర్ణయింపఁబడు ననుట. దీనికొక యుదాహరణము గ్రహింతము.

సెమిటిక్ భాషలలోని ధాతువులు సామాన్యముగా మూఁడేసి హల్లులతోఁ గూడియుండును. ఈ హల్లుల నడుమను జేర్పఁబడు స్వరములలోఁ గల్గు మార్పే యా ధాత్వర్థమునందుఁ గాలాది భేదమును సూచించుచున్నది. 'క్ ట్ ల్' (Ktl) అనునదొక ధాతువు. దీనికి "చంపు" అని సామాన్యార్థము. "చంపుట" అను భావార్థమును సూచించుటకు "కాటల్" (Katal); చంపుటకు "క్టోల్" (Ktol); చంపబడెను, కాటూల్ (Katul); ఇట్లర్థభేదములు హల్లుల మధ్యను జేర్పఁబడు వివిధములగు స్వరములమూలముగా వ్యక్తముచేయఁబడుచున్నవి. ఆర్యభాషలలో నీ యర్థసంబంధమును ప్రత్యయములు సూచించుచున్నవి. కాని ద్రావిడ భాషలలో భావభేదము లొక మూలధాతువుపైఁ జేర్పఁబడు భిన్నశబ్దముల (లేదా ధాతువుల) సాహాయ్యముచే వ్యక్తము చేయఁబడుచున్నవనవచ్చును. ఇందు కుదాహరణము:—ఈ, తే, పో, కొళ్, కన్, చేయ్, మొదలగునవి ధాతువులు. ఇవి సాధారణముగా నేకాచ్ ధాతువులుగనే కనఁబడుచున్నవి. సామాన్యముగా భావభేదమును సూచించుట కొకదానిపై మఱియొకదానిని చేర్చి వ్యవహరించుటగలదు.

ఈ—ఇచ్చు+కొను=ఇయ్యకొను.

కన్+కొళ్ >కొను=కన్గొను.

ఏ (గు)+తెంచు—తేర్=(ఏతేరు)—ఏతెంచు.

వా (యి)+పో (వు)=వాపోవు.

కన్గొను + (ఉ) చు + ఉన్న + వాఁడు = కన్గొనుచున్న వాఁడు, కన్గొనుచున్నాఁడు.

కొనిపోవు + ఇతు + (ఏ) ను = కొనిపోయితేను—కొనిపోయితిని.

కొనిపోవు + అన్ + కల + వాఁడు = కొనిపోవన్గల వాఁడు, కొనిపోవఁగలాఁడు, కొనిపోవఁగలఁడు.

ఇట్లే క్రియావిభక్తులు నామవిభక్తిరూపములుగూడ నీ భాషలలో నేర్పడుచున్నవి. ఇట్లొక ధాతువుపైఁ జేర్పఁబడుచువచ్చిన భిన్న ధాతువుల (లేదా శబ్దముల) మూలముగా నర్థభేదమును సూచించు భాషలను (ఆయాధాతువులయొక్కయు శబ్దములయొక్కయుఁ బ్రత్యేకత వ్యక్తమగుచున్నంతవరకు) సంశ్లిష్టపదరూప భాష (Agglutinative languages) లని చెప్పుదురు.

భాష యెల్లప్పుడు నొక్కరీతి నుండునది కాదు. సర్వజీవద్వస్తువులవలెనే యదియు ననవరతము మార్పులకు లోనగుచునే యుండును. లాటిన్, సంస్కృతము మొదలగు వానివలెఁ గేవలము గ్రంథస్థమై యుండుట గాక సామాన్యజనులచే నిత్యవ్యవహారమున వాడుకొనఁబడుచుండు భాషలను జీవద్భాష లందురు. సహజముగ సౌకర్యకాముఁడగు (Lover of ease) మానవుఁడు తన భాషను వ్యవహరించు సందర్భమున నల్పతర ప్రయాసముచేతనే యధికతరఫలమును సంపాదించుటకై చేయుచుండు యత్నమే యది యట్లు మాఱుటకుఁ

గల కారణములలో ముఖ్యమైనది. నిత్యవ్యవహారమున భాషారూపము లెట్లు సౌకర్యకాములగు జనుల నోళ్ళలోఁ బడి నలఁగుచు ననేకవిధముల వైరూప్యమును బొందుచుండుటచే నొక్క భాషయే యొకకాలమున నొకరూపముకలదై యున్నను మఱికొంతకాలమునకు మాఱురూపుచెందుట తటస్థించుచున్నది. ఒకకాలమునందా భాషాస్వరూప మెట్లుండెనో యట్లే గ్రహించి దానిని వ్యాకరించి లక్షణము చెప్పినచో నది యాకాలమందలి భాషకు తాత్కాలిక లక్షణమగును. మఱికొంతకాలమునకు మార్పు చెందిన యా భాషనే గ్రహించి, వ్యాకరించి లక్షణము చెప్పినచో నా భాషకే మఱియొక లక్షణమేర్పడును. ఇట్టి లక్షణము లా భాషకుఁ దాత్కాలికలక్షణములు లేదా వ్యాకరణములు (Descriptive Grammers) అగును. వీనికి (అనఁగా నా భాషయొక్క యీ రెండు రూపములకును) జనుల యుచ్చారణావశమునఁ గాని, యా యా కాలములందుఁ గల్గిన యన్యభాషల సంసర్గమువలనఁ గాని భాషారూపములలోఁ గొంతమార్పు గల్గినను, సహజములగు వ్యాకరణసంప్రదాయములలో మాత్ర మెట్టి భేదమునుఏర్పడు ననుట కవకాశము లేదు. కాలభేదమును బట్టి యొక్క భాషలోనే గలుగుచుండు మార్పులను సూచించుట కాయా కాలములం దా భాషకుఁ గ్రొత్తవ్యాకరణములు బయలు దేఱుచు నద్దాని తాత్కాలికావస్థను దెల్పుచుండును. మన లాక్షణికులకు నన్నయాదులయందును వారు రచించిన భార

తాది గ్రంథములయందును గల గౌరవాతిశయముచే వారా కాలమునఁ బ్రయోగించిన భాషయేగాని వేఱుభాష సత్కావ్యంబుల జెప్పరా దని శాసించుటం జేసి తత్ప్రయోగ ప్రామాణ్య మను గుదిగట్టును దగిలించుకొని మన భాషకు మార్పు లేదని కొందఱు తలంచుచున్నారేగాని యిప్పటి కాంధ్రమునకుఁ గాలభేదమునఁ గల్గిన మార్పులనుబట్టి కన్నడము ఇంగ్లీషు మొదలగు భాషలకుం బోలెఁ దాత్కాలిక భాషా విశేషములను సూచించు రెండుమూఁడు వ్యాకరణములైనను బయలుదేఱియుండవలసిన దను విషయమును గమనింపకున్నారు. ఇంక నాయా కాలములం దా భాష కేర్పడిన భిన్నములగు లక్షణములను సరిపోల్చి చూచి యా భాషారూపములలో నేవి యన్యకారణములచే మాఱినవో, వానికిఁ గల పరస్పర సంబంధం బెట్టిదో, యను విషయములను బరిశీలించుచు నాభాషయొక్క పరిణామక్రమమును మొదటినుండియు నిరూపించినచో నది తద్భాషా చారిత్రక వ్యాకరణము (Historical Grammer) అని చెప్పఁదగియుండును. ఒకభాషయొక్క సహజలక్షణముల నితర సన్నిహితభాషల లక్షణములతోఁ బోల్చి, వానికిఁ గల పరస్పరసంబంధమును నిరూపించినచో నది తద్భాషాతులనాత్మకవ్యాకరణము (Comparative Grammer) అని చెప్పఁదగి యుండును. సజాతీయములయ్యును భిన్నరూపములఁ జెంది ప్రత్యేకభాషలుగఁ బరిగణింపఁబడుచున్న భాషల యందలి వ్యాకరణ విశేషములను

సరిపోల్చి చూచినచో నా ప్రత్యేక భాషారూపముల యొక్క పూర్వ చరితము వెల్లడియగుటయే గాక, వీనికి సహజములు సమానములు నగు సంప్రదాయము లెట్టివో తెలియవచ్చుచుండును. ప్రస్తుతము దక్షిణహిందూదేశము నందలి ప్రధాన భాషలలో నొకటగు తెనుఁగునందలి సంధివిశేషముల తత్త్వమును గనుఁగొని, యవి సన్నిహితభాషాలక్షణవిశేషములతో నెంతవఱకు పొందిక గలిగియున్నవో పరిశీలింతము.

ప్రథమముననే సంధి యనఁగా నేమి యను ప్రశ్న కలుగకమానదు. సంధి యనఁగా వర్ణసంయోగము అనిసామాన్యార్థము. దీనినే సంహిత యందురు. భాషలో నుచ్చారణ సౌకర్యముకొఱకు నొక శబ్దము నంతమందుఁ గల వర్ణము దానికి సన్నిహితపర మగు మఱియొక శబ్దము నాదివర్ణముతోఁ గలియుటే సంధి. అనఁగాఁ జిరకాలముక్రిందటనే సంపూర్ణార్థబోధక మగు నఖండవాక్యము విడగొట్టఁబడఁగా నేర్పడినవియు, నామాఖ్యాతాది సంజ్ఞలచే వ్యవహరింపఁబడుచుండినవియు నగు నా యఖండవాక్యభాగములను మరల నాయాకాలములందలి జనులు సంపూర్ణార్థబోధకమగు వాక్యముగా సమకూర్చునపు డుచ్చారణసౌకర్యమునకై యొక పదాంత్యవర్ణమును బరమందున్న పదము నాదివర్ణముతోఁ జేర్చి పలుకు పద్ధతియే సంధివిధాన మగుచున్నదన్నమాట. అఖండవాక్యము విభాగింపఁబడి భాష కొకమారు లక్షణ మేర్పడిన పిదప, నా విభాగింపఁబడిన పదములు ప్రత్యేకప్రయో

గమును బొందుచుఁ గాలక్రమమున ననేకరీతుల మార్పు చెందుట తటస్థించును గావునఁ బ్రాచీనవాక్యమునకును దరువాతి కాలమందలి పదములతోఁ గూర్పఁబడిన వాక్యమునకును గొంత భేద మేర్పడనచ్చును. సంహితయం దొక తీరునఁగూడిన వర్ణములు సంధివశమున క్రొత్తరూపముల నొందవచ్చును; ధీర+ఆలు=ధీరురాలు. ఇట్టి భేదములకుఁ గల కారణములను దెలిసికొనుటకుఁ దగిన యాధారములా భాషలోనే మన కొకప్పుడు దొరకకపోవచ్చును. కాని సజాతీయభాషారూపముల నొండొంటితోఁ బోల్చి చూచినపు డీ వికారములకుఁ గల కారణములే గాక ప్రాచీనభాషా లక్షణములుకూడఁ గొన్ని బయలుపడుచుండును. ప్రాచీన భాషా ఖండ వాక్యములు కొన్ని జన్యభాషలలోనికి సంక్రమించియుండఁగాఁ దరువాతికాలమున నాయా భాషలను వ్యాకరించిన వైయాకరణులు తమ కాలమునఁ బ్రయోగమునఁగల శబ్దస్వరూపమునుబట్టి వాక్యములను, బదబంధములను విభాగించి, వికృతరూపములను వారివారికిఁ దోఁచిన రీతిని సమర్థించుచు నా భాషకు లక్షణము కల్పింప యత్నించుటు.

—— ఆర్యభాషారూపములు—చారిత్రక చిహ్నములు ——

సంస్కృతభాష తక్కిన ఇండోయూరపియన్ సజాతీయ భాషలనుండి విడిపోయిన తరువాత నతిచిరకాలమునకుఁ గాని యాస్కపాణిన్యాదు లీ భాషను వ్యాకరించుట గాన్ని

దీనికి లక్షణ మేర్పఱుచుటగాని తటస్థింపలేదు. పాణిన్యాదుల లక్షణమును బట్టి యీ భాషలో ద్వితీయా బహువచనమునం దచ్ఛబ్దము "తాన్" అను రూపముకలదై యున్నది. అప్పటి వ్యవహారము నందును ఇప్పుడుగూడ నది యట్లే యున్నది. కాని యొక వాక్యమునందు "తాన్" శబ్దమునకు మఱియొక "తాన్" శబ్దముగాని, "తారయతి" యను క్రియా పదము గాని పరమైనపుడు తాంస్తాన్, తాంస్తారయతి అను రూపము లేర్పడుచున్నవి. అనఁగా నకారము బిందువుకాఁగా నడుమ నొక సకారము చేరుచున్న దన్నమాట. "తాన్+తాన్" అను పదములకుఁ గలయిక (సంధి) కలిగినపు డవి "తాన్తాన్" అని పూర్వపరస్థానీయంబులగు హల్లులు రెండును గలిపి యుచ్చరింపఁబడుటగాని, లేదా, స్వరశాస్త్రపద్ధతిని బట్టి నాసవర్ణంబగు ననునాసికముతోఁ గలిగిన సంయోగముచే "త" కారము సరళత్వము జెందినచో "తాన్దాన్" అను రూప మేర్పడుట గాని కావలసి యుండఁగా నట్లుగాక యీ పదముల మధ్యనొక "స" కారము వచ్చి చేరుట విలక్షణముగాఁ గనఁబడక మానదు. అయినను ఆ వాక్యము వ్యవహారమున నట్లే గనఁబడుచున్నది. ఈ చిక్కును దొలఁగించుటకే పాణిని నకారాంత శబ్దములకు "చ, ఛ, ట, ఠ, త, థ వర్ణము లాదియందుఁగల శబ్దములతోఁ గలయిక కలిగినచో వాని మధ్య నొక సకారము వచ్చు"నని "నశ్ఛవ్యప్రశాన్" అను నొక సూత్రముచే నొక సకారమును విధించి వ్యవహారమునఁ

గల యీ రూపమును సాధింపవలసినవాఁడైనాఁడు. పాణిని వ్యవహారమునఁ గనఁబడుచున్న సకార మీ యీ సందర్భము లలో వచ్చునని చెప్పి, యున్నదానికి లక్షణము కల్పించి నాఁడేగాని నకార తకారములను గలిపి యుచ్చరించునపుడు సకారము మధ్యవచ్చుటకుఁ గల కారణమును దెలుపలేదు. అది యాతని పనియుఁగాదు. ఏలయనఁగాఁ బాణిని తన కాలమునఁ గల గీర్వాణభాషను వ్యాకరించి దానికి లక్షణ మేర్పఱచి యున్నవాఁడే గాని తద్భాషాస్వరూపవిమర్శ నమునకుఁ గడంగినవాఁడు కాఁడు. ఇట్లు "తాన్" శబ్దమున కా రూపముననే తాన్, తారయతి, అనుశబ్దముతోఁగలయిక గలిగినచో తాంస్తాన్, తాంస్తారయతి, అను రూపము లేర్ప డుట కవకాశములేదు గావున నివి ప్రాచీనభాషకుఁ జెందిన యఖండవాక్యస్వరూపమునే సూచించుచున్న వని మన మూహింపవచ్చును. ఇట్లు నూతనముగా వచ్చి చేరినవని తరువాతికాలపు వైయాకరణులచేఁ దలంపఁబడుచుండిన యీ సకారాగమాదులు వాస్తవముగాఁ బ్రాచీనభాషకుఁ జెందినవే. కావుననే శబ్దశాస్త్రజ్ఞు లిట్టివాని నా యా భాషల ప్రాచీనచరిత్రకు సంబంధించి, తదవస్థను సూచించుచు వీనిలో నింకను మిగిలియున్న చారిత్రక చిహ్నము (**Historical survivals**) లని చెప్పుచున్నారు.

ఈ సకారము సంధివశముననే వచ్చిన దనరాదా ? ఇది ప్రాచీనాఖండవాక్యమునకు సంబంధించినదే యని యెట్లు

చెప్పనగు నను ప్రశ్న కలుగవచ్చును. సంధిగతమే యన్నచో నుచ్చారణసౌకర్యము కొఱకుఁ జేయఁబడుచుండు సంధిలోఁ దదుద్దేశమును బ్రతిఘటించు నూతనధ్వని మరియొకటి వచ్చి చేరిన దనుటకుఁ దగినంత హేతువును జూపవలసియున్నది. అట్టి హేతువేమియు నగపడుట లేదు. కావున నిది సహజముగ నీ శబ్దములలో నొకదాని భాగమే యైయుండి కాలక్రమమున వ్యవహార వేగముచే జాఱిపోయియుండు నేమో యనియు నూహింపవచ్చును. కాని యీ భాషలో నిది యీ సంధి సందర్భముననే గాని మఱియొకచోఁ గనఁబడకుండుటచే నిది యీ భాషనుమాత్రము బట్టి తచ్ఛబ్దగత మని చెప్పుట కవకాశ మేమియు లేదు. కావున నీ విషయ మితర సజాతీయ భాషారూపములతో వీనినిఁ బోల్చి చూచినఁ దేటపడు నేమో పరిశీలింపవలసి యున్నది.

సంస్కృతముతో సజాతీయము లని తలంపఁబడుచుండిన గ్రీక్, లాటిన్ భాషలలోని తచ్ఛబ్ద ద్వితీయా బహువచన రూపము "తాన్స్" (tons) అని నకార సంయోగమంతమందుఁగలదై వ్యవహరింపఁబడుచున్నది. అయితే ఇచ్చట నిదియు సంధివశమున వచ్చినదే యేమోయనియు, "తాంస్తాన్, తాంస్తారయతి" మొదలగు రూపముల నాయా భాషల వ్యాకరించి లక్షణమేర్పఱచినవారు తాన్స్+తాన్, తాన్స్+తారయతి యని విభాగించుటచే "తాన్స్" (tons) అను సకారాంత శబ్ద మా భాషలలో నేర్పడి యుండుననియు

ననవచ్చును. మొత్తముపై ని tons+ton అన్న నేమి, తాఁ + తాఁ = తాఁ + స్ + తాఁ, అయినదన్న నేమి యెట్లై నను సకారము లాటిఁ సంస్కృత భాషలకు రెంటికిని మూలం బగు ప్రాచీనాఖండ వాక్యమునఁ గనఁబడుచుండె ననుటకు సందేహములేదుగదా? సంస్కృతమున సంయోగాంతశబ్ద ములు సామాన్యముగా లేవు. ప్రక్రియాసందర్భమునఁగూడఁ బదాంతమందు హల్సంయోగము వచ్చినచో "సంయోగాంతస్య లోపః" అను సూత్రముచేఁ దుది హల్లును, లేదా ఒకటి కంటె మిగిలిన హల్లుల నన్నిటిని లోపింపఁజేయుటయే వ్యాకరణ పద్ధతియైయున్నది. ద్వితీయాంత తచ్ఛబ్ద మొకప్పుడు ప్రాచీనభాషలో సంయోగాంతమే యైయుండఁ గాలక్రమమునఁ దుది సకారము వ్యవహారమున జాఱవిడువఁ బడుటచే సంస్కృతమున "తాన్" అనురూపమే నిలిచినది. కావున సంస్కృతభాషలో సకారము లోపించిన రూపమే తచ్ఛబ్ద ద్వితీయా బహువచనముగఁ గనఁబడుచుండ ప్రాచీన భాష నుండి సంక్రమించిన "తాంస్తాన్" అను నఖండరూపమున సకార మగపడుచుండుటచేఁ బై వాక్యములలో సకారము సంధివశమున వచ్చినదని తలంచి పాణిన్యాదు లద్దాని నా సందర్భమున విధించి 'తాంస్తాఁ' అను రూపమును సాధించిరని మనము నిశ్చయింపఁదగియున్నది.

## — ఆంధ్రమున నుగాగమ విధానము. —

ఇట్లే యాంధ్రమున ఉదంతతద్ధర్మార్థ విశేషణముల కచ్చు పరమగునపుడు నుగాగమ విధానము నాంధ్రవైయా

కరణులు చేసియున్నారు. "చేయు+అతడు" అని యుండఁగా వీనికి సంధికలిగినప్పుడు మధ్యనొక "న" కారమువచ్చి "చేయునతఁడు" అను రూపమగుచున్నది. ఈ నుగాగమముగూడ నాగంతుకముగ మధ్య వచ్చి చేరినది గాక ప్రాచీనభాష నుండి యిందు సంక్రమించినదే యని పరిశీలించినఁ దెలియఁగలదు. ఆంధ్రమున సామాన్యముగా విశేషణము లజంతములే యయి యుండుటచే "చేయును+అతఁడు" అను శబ్దముల కలయికచే నేర్పడిన "చేయునతఁడు" అను పదబంధమును "చేయు+న్+అతడు" అని విడఁదీసి యజంతమగు "చేయు" అనునదే తద్ధర్మార్థకవిశేషణ మనియు దానికచ్చు పరమైనపుడు "న్" ఆగమమగు ననియుఁ వైయాకరణులు దెలిపిరి. "చేయున్" అను నకారాంతరూప మొకటితక్క, చేయుచున్న, చేసిన, అను వర్తమానభూతకాలిక రూపములవలె 'చేయ' వంటి అకారాంతంబైన భావిక్రియా విశేషణ రూపము ప్రాచీనకాలమున భాషలో లేదు. కలుగు ధాతు సహాయమున నేర్పడిన "చేయఁగల" యనునది మిగుల నర్వాచీనరూపము. ప్రాచీనకాలమున "చేయును" అను తద్ధర్మార్థకరూపమే భావిక్రియారూపముగను, అది యొక నామవాచక శబ్దమునకుఁ బూర్వస్థాన మాక్రమించినపుడు విశేషణముగను వ్యవహరింపఁబడుచు వచ్చినది. భాషలో నిది యతిప్రాచీనం బగు రూపం బగుటచే నా కాలమున స్థానమునుబట్టి క్రియారూపముగను, క్రియాజన్య విశేషణ

రూపముగనుగూడ వాడుకలో నుండియుండును. దీని కజాది శబ్దము పరమైనపుడు "చేయున్+అతడు" తుది నకారము తరువాతి యచ్చుతోఁగలసి "చేయునతఁడు" అని యగుటయు, హలాదిశబ్దము పరమైనపుడు (ఈ భాషలో సామాన్యముగా భిన్న హల్సంయోగము వారింపఁబడుచుండుట స్వాభావికమై యుండుటచేతనో, లేదా విశేషణత్వ ద్యోతనార్థమో) నకారము జారవిడువఁబడుటయుఁ దటస్థించి యుండును. తమిళమునఁగూడ సంపూర్ణక్రియారూపంబగు "శెయ్యుం" అను నదే "పెయక్ అచ్చం" అనగాఁ గ్రియాజన్యవిశేషణముగాఁ గూడ వ్యవహరింపఁబడుచుండుటయే యీ పై వాదమునకు సాధకమగుచున్నది. "అదు శెయ్యుం" "అదిచేయును" అనునప్పుడు సంపూర్ణక్రియగాను, "శెయ్యుం మనిదన్" "చేయు మనుష్యుఁడు" అన్నపుడు క్రియాజన్య విశేషణముగాను "శెయ్యుం" అను ననునాసికాంతశబ్దమే వ్యవహరింపఁ బడుచున్నది. ఈ శెయ్యుం అను ప్రాచీనశబ్దమే యందలి తుది మకారము నకారముగా మాఱుటచే "చేయున్" అనియుఁ దుదినొక ఉకారము నూతఁగాఁ జేర్చుకొనుటచే "చేయును" అనియు రెండు రూపములఁ దెనుఁగునఁ గానవచ్చుచున్నది. సహజముగ శబ్దగతముకాక, ప్రత్యేకార్థము నేమియు బోధింపక, హలంతశబ్దములపైఁ గేవల మూఁతగా వచ్చిచేరిన యీ ఉకార మచ్చుపరమైనపుడు నిత్యముగా లోపించుచుండును. కావుననే యీ భాషలో నుత్తునకచ్చుపరమైనపుడు సంధి నిత్యముగానగుట తటస్థించినది.

ఇట్లు "చేయును + అతఁడు" అనునది సంధిలో "చేయు నతఁడు" అని కాఁగాఁ దరువాతికాలపు వైయాకరణులు "చేయు+న్+అతఁడు" అని విభాగించి తద్ధర్మార్థకోకారము పై నుగాగమమును విధించిరి. దీనినిబట్టి యొక కాలమందలి భాషను వ్యాకరించి లక్షణమును రచించిన వైయాకరణులచే విశేషకార్యములుగఁ బరిగణింపఁబడియున్న యనేకవిషయము లా భాషయొక్క ప్రాచీనచరిత్ర నన్వేషించి యితర సన్నిహిత భాషారూపములతోఁగూడఁ బోల్చి చూచిన గాని సహేతుకంబులై సుబోధంబులు కావని తెలియవచ్చుచున్నది.

ఇఁకఁ బ్రాచీనకాలమున వ్యవహారమందుండిన యఖండ వాక్యమును వైయాకరణులు భిన్నపదములుగా విభజించి లక్షణము చేయునప్పుడు సంభవించిన యవిచారమూలక విభాగమువలన (incorrect breaking) గాని, లేదా భాష మారుటచే ప్రాచీనశబ్ద స్వరూపమును గుర్తింపలేని తరువాతి కాలపు జనసంఘమేఁ చేసిన యట్టి విభాగమువలనఁ గాని భాషలోఁ గాలక్రమమునఁ గ్రొత్తశబ్దము లేర్పడుచుండె ననుటకు మఱియొక నిదర్శనము చూపెదను.

— బహువచనరూపనిష్పత్తి : కుక్ విధానము —

ఈ భాషలో ఎలుక, చిలుక, ఊఁక, ఎముక, ఈఁగ, ఏనుఁగ (గు), గోడుగు, నక్క, ముక్క, కోలఁకు, కలఁకు, త్రూంకు, కొఱఁకు, గవఁకు, నెఱఁకు, గోఁగు, రేఁగు మొదలగు క, గ, కు, గు వర్ణము లంతమందుఁ గల శబ్దములు కొన్ని యేర్పడి వ్యవహారమున నున్నవి. వీనిలోఁ గొన్నిటిని,

అనఁగా గోఁగు, కొలఁకు మొదలగు వానిని మాత్రమే యాంధ్రవ్యాకరణకర్తలెట్లో సాధించుచు రూపనిష్పత్తి క్రమమును దెలిపిరి. ఆచ్ఛికపదముల బహువచనరూప నిష్పత్తి క్రమమును దెలుపు సందర్భమున, "కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు-బహువచనంబు పరం బగునపుడు నిత్యముగాఁ నగు. అట్లు రేను గోను శబ్దంబుల నువర్ణంబు గుజ్జగు" (బాలవ్యా. ఆచ్ఛిక. సూ 18–19.) అను సూత్రములచే నువర్ణాంతములగు కలన్వాదులకు, రేను గోను శబ్దంబులకు, కుజ్ గుజ్ విధానము చేసి, వీని బహువచనరూపములు నువర్ణాంతైకవచన రూపములకు "లు" ప్రత్యయమాత్రమును జేర్చుటచే నేర్పడవనియు, కు, గు అను ప్రత్యయములనుగూడ నిత్యముగాఁ జేర్పవలసియుండు ననియు జెప్పిరి. ఈ కుజ్, గుజ్ ప్రత్యయము లేకవచనమునఁగూడ వికల్పముగా వచ్చుననుటచేఁ గొలఁకు, రేఁను మొదలగు నేకవచనరూపములనుగూడ వ్యాకరణకర్తలు సాధించినవారైనారు. దీనినిబట్టి భాషలో నువర్ణాంతమే స్వతస్సిద్ధమైన రూప మనియు, కువర్ణాంతము దీనికి రూపాంతరమనియుఁ దెలియవచ్చుచుండుటచేతను, బహువచనమున 'కులు' 'గులు' అంతమందుఁ గల దొక్కటే రూపమగుటచేతను నీ బహువచనరూపమునుండి "లు" అను బహువచన ప్రత్యయమును విడఁదీయుటచేతనే "కొఁలకు" మొదలగు కువర్ణాంతశబ్దము లేర్పడిన వని తలంపవలసియున్నది. కొలఁకు, మ్రాఁకు శబ్దములే స్వతస్సిద్ధములనియు వీనికి "లు" ప్రత్యయమును చేర్చుటవలన బహువచన

రూపము లేర్పడినవనియు, నేకవచనమున నువర్ణాంతములే రూపాంతరములు కాఁగూడదా యని యడుగవచ్చును. కాని 'కోలను'కు 'కు' ప్రత్యయము చేర్చుటచే నందలి నకారము బిందువై కోలంకు శబ్దమేర్పడిన దనుట యుక్తియుక్తముగాని కోలంకు శబ్దములోని కువర్ణములోపించుటచే "కోలను" శబ్దమేర్పడిన దనుట యుక్తిసహముకాదు. నువర్ణాంతమునకు గువర్ణమును విధించుటచే దానిని మరల దెచ్చిపెట్టుటకు వ్యాకరణకర్త 'కు' వర్ణమును జిత్తుగాఁ జేయవలసినవాఁడై నాడు. ఇంతేగాక తక్కిన సన్నిహితభాషలలో నీ శబ్దములు కువర్ణాంతములుగాక 'కుళం, మరం' అని యనునాసికాంతము లగుటయే యీ భాషలలోఁగూడ నివి కోలను, మ్రాను అను నువర్ణాంతములేగాని స్వతస్సిద్ధముగ కువర్ణాంతములు కావను టకుఁ దార్కాణమగుచున్నది. ఈ భాషలో మఱియే యితర శబ్దముల బహువచనరూపనిష్పత్తి సందర్భమునను గూడ నీ కుజ్ విధాన మగపడక "లు" వర్ణముమాత్రమే యన్ని చోటు లను బహువచనప్రత్యయముగా గ్రహింపఁబడుచుండ నీ పై బహువచనరూపసాధన ప్రక్రియా సందర్భమున మాత్రమే "కుజ్" ప్రత్యయవిధాన మెట్లావశ్యకమయ్యెనో తెలిసికొనవలె నన్నచో నీ భాషాలక్షణమును బట్టి యాధారమేమియు నగపడదు. పై నుదహరింపఁబడిన గవర్ణ కవర్ణాంతశబ్దముల బహువచనరూపములు "లు" వర్ణమును మాత్రము చేర్చుటచే నేర్పడినవైనను, కోలన్వాదుల బహువచన రూపము లతోఁ గొంతవఱకు సామాన్యముగలవగుటచే నవియు వీని

వలెనే బహువచన రూపముల నుండి "లు" వర్ణమును మాత్రము విడఁదీయుటచేతనే యేర్పడియుండు నని యూహించుట కవకాశము కలుగుచున్నది. అట్లయినచో ఎలుకలు, చిలుకలు మొదలగు రూపములను "కుళ్"కు బదులుగా "క" వచ్చినదని చెప్పవలసియుండును. కాని "కొలంకు" అను దానికి కొలను వలె "ఎలుక" అనుదానికి 'క' వర్ణవిరహితమగు రూపాంతరము తెలుఁగులో గానవచ్చుటలేదు. మఱియు నీ కవర్ణము బిందుపూర్వకమును గాదు. దీనికిఁగూడ నట్టి రూపాంతరములున్నచో కొలన్వాదుల "కు" వర్ణము వలెనే దీని "క" వర్ణముగూడ బహువచనప్రత్యయమునఁ బొఁజెందినదే యని మనము నిశ్చయింపఁగల్గెడివారము. ఈ భాషలో దీని కట్టి రూపాంతరములు లేవు గాని దీని నితర సన్నిహితభాషారూపములతోఁ బోల్చిచూచినచో నివి యేకవచనమున కవర్ణ విరహితములగుటయు, బహువచనమున కవర్ణ కువర్ణములతోఁ గూడియుండుటయు మనము గనిపట్టగల్గుదుము. అందులకుఁగల కారణమును దేటపడవచ్చును. కావున వీనిని తమిళ కన్నడ భాషారూపములతోఁ బోల్చి చూతము. కవర్ణ కువర్ణాంతము లగు నేకవచనరూపములా భాషలో లేకుండుటేగాక, బహువచనమునం దాంధ్రమున "లు" వర్ణము చేర్పఁబడుచున్నట్లే, యా భాషలో కళ్ (గళ్) ప్రత్యయము చేర్పఁబడుటచే బహువచనరూపమేర్పడుచున్నదనియు, నా కారణముచే నాంధ్రశబ్దములకుఁ దమిళకన్నడ రూపములతో సామ్యము గలుగుచున్న దనియుఁగూడ నీ క్రింది పట్టికనుబట్టి మనకు వ్యక్తముకాఁగలదు.

| తమిళము, కన్నడము ఏకవచనము | తమిళము, కన్నడము బహువచనము | తెనుఁగు బహువచనము | తెనుఁగు ఏకవచనము |
|---|---|---|---|
| త. ఈ | ఈ+కళ్<br>ఈకళు, ఈగళు | ఈఁగలు | ఈఁగ |
| త. ఎలి<br>క, తు. ఇలి | ఎలి+కళ్=ఎలికళ్ | ఎలికలు, ఎలుకలు | ఎలిక, ఎలుక |
| త. కిళి, క. గిళి, గిణి | కిళి+కళ్=కిళిగళు | * చిలుకలు | చిలుక |
| త. క. మ. ఉమి<br>క. ఉమ్మి | ఉమికళ్<br>ఉమికళు | ఉమికలు<br>ఉముకలు | ఉముక<br>ఊఁక |
| త. ఎలుమ్పు, ఎన్బు<br>క. ఎల్, ఎలు,<br>ఎలువు, ఎలుబు. | ఎలుమ్బుగళ్ | ఎమ్ముకలు<br>ఎముకలు | ఎముక-ఎమ్ము |
| త. యానై<br>క. ఆనె | యానై+గళ్<br>ఆనెగళు (బహువచ) | ఏనుఁగలు<br>ఏనుఁగులు | ఏనుఁగ<br>ఏనుఁగు - ఏనిక |
| క. త. మూక్కు | మూక్కుగళ్ | ముక్కులు | ముక్కు |
| క. త. నరి | నరిగళ్ | నక్కలు | నక్క |

* ఇప్పుడు తాలవ్యోకారా [illegible] కకారము [illegible].

| తమిళము, కన్నడము ఏకవచనము | తమిళము, కన్నడము బహువచనము | తెనుఁగు బహువచనము | తెనుఁగు ఏకవచనము |
|---|---|---|---|
| త. పిణై | పిణైగళ్ | పీనుగలు | పీనుఁగ |
| త. కుళమ్ | కుళంగళ్ | కొళంకులు | కొళంకు |
| క. తు. కొళ | | కొలంకులు | కొలఁకు |
| త. తుణి | తుణిగళ్ | తునకలు | తునక |
| త. మరమ్ | మరంగళ్ | మ్రాంకులు | మ్రాఁకు |
| క. మ. మర | మరాకళు | మ్రాఁకులు | |
| హళగన్న. మరవు | | | |
| క. కెల | కెలంగళ్ | కెలంకులు | కెలఁకు |
| | | కెలఁకులు | |
| త. నెఱి. క. నెఱి | నెఱింగళ్ | నెఱంకులు | నెఱఁకు |
| | | నెఱఁకులు | |
| త. గోన్ | గోంగళ్ | గోంగులు | గోఁగు |
| | | గోఁగులు | |
| త. కుడై క. కొడె | కుడైగళ్ | గొడుగులు | గొడుగు |

ఇట్లు కోలను, మ్రాను, గోను శబ్దములకువలెనే తక్కిన శబ్దములకు తమిళ కన్నడములలో ఎలి, గిళి, నరి, ముఱి, తుణి మొదలగు కకార విరహిత రూపములు గాన వచ్చుచున్నను ఏకవచనముల కోలఁకు, మ్రాకువంటి కువర్ణ సహిత రూపాంతరములు లేకుండుటచేతను, నీ భాషలన్నిటి లోను నభిన్నములై గనఁబడుచున్న యీ కువర్ణసహిత బహువచన రూపములు తమిళ కన్నడ మళయాళములలోఁ జిరకాలమునుండి బహువచనప్రత్యయముగాఁ దలంపఁబడు చుండిన 'గళ్' అను దానిని జేర్చుటచే నేర్పడియుండుట చేతను, తెలుఁగునందలి కోలఁకులు, ఎలికలు, మ్రాఁకులు మొదలగు బహువచనరూపములుగూడ ప్రాచీనభాషలోనే అనఁగా తమిళకన్నడాదులు తెలుఁగుతో విడిపోని కాలము ననే యేర్పడి, యప్పటినుండియు నట్లే వ్యవహారమున నున్న వనియు, నీ భాషలు విడిపోయి కాలక్రమమున నా ప్రాచీన రూపము లుచ్చారణవేగమునఁ గొంత మార్పుఁ జెందిన పిదప తెలుఁగువారు 'లు' అను దానినిమాత్రము బహువచన ప్రత్యయముగాఁ దలంచి, దాని నీ బహువచనరూపముల నుండి విడదీయుటచే కోలఁకు, మ్రాకు శబ్దము లేకవచ నమున కోలను, మ్రాను శబ్దములకు రూపాంతరములుగా నీ భాషలో నేర్పడుట తటస్థించినదనియు స్పష్టమగుచున్నది. ఎలిక, చిలుక, నక్క శబ్దముల ప్రాచీనరూపములగు ఎలి, చిలి, నరి మొదలగునవి యీభాషలో నంతరించిపోవుటచే కవర్ణాంత

రూపములే స్థిరపడినవి. తెలుఁగుభాషలో 'ఎలిక' శబ్ద మిచట్ల మధ్యముగా వ్యవహారమునఁ గలదు. కాని శబ్ద రత్నాకరాదులు దీనిని ప్రామాణికరూపముగా గ్రహింప లేదు. సామాన్యముగా నిది ఇకార మధ్యమా ? ఉకార మధ్యమా ? యను సందేహము కలుగుచుండుట యుఁ గలదు. భాషా చారిత్రకదృష్టితోఁ జూచినచో "ఎలి" ప్రాచీనరూపము గావున ఎలిక, ఎలికలు అను ఇకారమధ్యరూపములే సాధువు లనఁదగును. కాలక్రమమున తుది ఉకార సాహచర్యమువలన 'ఎలి' లోని ఇకారముకూడా నుకారముగా మారుటచేఁ 'ఎలుకలు' అనియు "ఏనిగలు-ఏనుగులు" అనియు రూపము లేర్పడినవి. వీనిలోని మొదటిరూపము లీ భాషలో ప్రసిద్ధకవు లుత్తమగ్రంథములను రచించుకాలమునకే మాఱిపోయి వారి గ్రంథములలోని కెక్కకపోవుటచేతనో, కొందఱు ప్రయో గించినను విశేషప్రచారములోనికి వచ్చిన రెండవరూపమున కనుగుణముగా తరువాతికాలపు వైయాకరణులచే నవి దిద్ది వేయంబడుటచేతనో, ఉకార మధ్యరూపములే ప్రామాణిక రూపములుగాఁ బరిగణింపఁబడుట తటస్థించినది. కాని 'ఏనిక' శబ్దముమాత్రము ప్రామాణికత్వమును బొందినది. "ఏనికగములో యనంగఁ దరుణీమణు లుల్లములుల్లసిల్లగన్" అని రుక్మిణీపరిణయమునుండి ప్రయోగము నిచ్చి శబ్దరత్నా కరకారుఁడు దీని నంగీకరించినాఁడు. కాని యిది వైకృత మని మాత్రము చెప్పినాడు. దీనినిబట్టి 'ఏనిక' శబ్దమువంటి

'చిలుక' 'ఎలుక' మొదలగు శబ్దములుకూడ వైకృతములే గావచ్చుననియు, వీని తుది కకారము 'బాలక' శబ్దమునందు వలెనే స్వార్థ కప్రత్యయము గావచ్చుననియు, 'లు' వర్ణము మాత్రమే యీ భాష లన్నిటిలోఁగూడ బహువచనప్రత్యయమైయుండగాఁ బాలక శబ్దమువంటి శబ్దములోని కప్రత్యయముతోఁ గలిసి యేర్పడిన బాలకలు అను దాని యవిచార మూలకవిభాగముచేతనే 'కలు' అనునది తమిళ కన్నడాదులలో బహువచనప్రత్యయముగా నేర్పడి యుండవచ్చుననియు కొందఱు వాదించినను వాదించవచ్చును. కాని యీ 'కలు' ప్రత్యయము విశేషముగా దేశ్యశబ్దములపైని గనఁబడుచుండుటచేతను, నీ భాషలలోఁ బ్రాచీనకాలమున "గళ్" అనునది యమహత్తులపైని మాత్రమే చేర్చఁబడుచుండుటచేతను, తెలుఁగుగాక తక్కిన దక్షిణదేశభాషలు పెక్కింటిలో తెలుఁగున వ్యాకరణములు బయలుదేఱుటకు పూర్వము చిరకాలమునుండియు "గళ్" అనునదే బహువచన ప్రత్యయముగా గ్రహింపఁబడుచుండుట చేతను, వైకృతము లని చెప్పుట కవకాశము లేని దేశ్యపదము లనేకము లేకవచనమున కవర్ణవిరహితములై యుండి, బహువచనమున మాత్రమే "గళ్"ను గ్రహించుచుండుటచేతను, నీ శబ్దము లన్నియు ప్రాచీనభాషలో కవర్ణసహితములే యనియు, తెలుఁగులోని "లు" వర్ణమమాత్రమే ప్రాచీన బహువచన ప్రత్యయమనియుఁ దలంచుట కవకాశ మాగపడదు. ఆనై, ఆనె అను

తక్కిన ద్రావిడభాషలలోని రూపములను బరికించిన ఏనిక శబ్దము తద్భవమనుటగూడ సమంజసముగాదు. ఇఁక నీ "లు" వర్ణ ముత్తరహిందూస్థానభాషలు కొన్నిటిలో బహువచనార్థమున నిటీవలి కాలమునఁ జేర్పబడుచున్న సంస్కృత "లోక" శబ్దరూపాంతరమగు "లోగ్" అను దానినుండి యేర్పడిన దనుటయు నెంతమాత్రము యుక్తముకాదు. ఇది యీ భాషలలోఁగాని ప్రాచీనకాలమునఁ గానఁబడక మిక్కిలి యర్వాచీన కాలమున వ్యవహారములోనికి వచ్చిన దగుటచేతను, దక్షిణదేశభాషలలో "గళ్" అనునది క్రీస్తుశకారంభ కాలమునందున్న తొల్కాప్పియనార్ అనునాతఁడఱవభాషలో "తొల్కాప్పియం" అను వ్యాకరణమును రచించునాటికే అమహద్బహువచన ప్రత్యయముగా నేర్పడియుండుటచేతను, తెలుఁగులోని "లు" గాని, తక్కిన దక్షిణదేశ భాషలలోని 'గళ్' గాని యర్వాచీనమగు 'లోగ్' శబ్దభవమనుట యేమాత్రము యుక్తిసహము కాదు.

దీనినిబట్టి తేలిన దేమనఁగా నొక మూలభాషకుఁ జెందిన ప్రాచీనరూపముల నిష్పత్తిక్రమము జన్యభాషలలోఁ గాలక్రమమున మఱచిపోఁబడుట తటస్థించినప్పుడు, ఆయా రూపములను దరువాతి వైయాకరణులు తమకుఁదోఁచిన రీతిని విభాగించుటచే నా భాషలోఁ గ్రొత్తరూపములు బయలుదేఱుచుండుననియు, కొన్ని పదబంధములలో నా ప్రాచీన

రూపములు నిలిచియుండుట తటస్థించినపుడు వైయాకరణులు భాషలో నిలిచియున్న యీ ప్రాచీన రూపములను సమర్థించుటకై యీ సందర్భముల నాగమాదులను విధింపవలసి వచ్చుచుండుననియు, నిట్టి విశేషములే యీ భాషల ప్రాచీన చరిత్రను సూచించుచుండుననియు దెలియవచ్చుచున్న దనుటయే. ఇట్లు "చేయునాతఁడు" అనుదానిలోని నకారము కొఱకుఁ జేయబడిన నగాగమ విధానమువలెనే "కొలఁకులు" మొదలగు శబ్దముల నిష్పత్తికై చేయఁబడిన "కుక్" విధానముకూడ నాంధ్రభాషా ప్రాచీన చారిత్రక చిహ్న మని (Historic Survival) మనము నిశ్చయింపవలసియున్నది.

ఇట్లొకకాలమందలి యొక భాషయొక్క లక్షణమును మాత్రమే పరిశీలించినచో సహేతుకములుగాఁ గనఁబడని భాషావిశేషము లనేకము లితర సజాతీయ భాషారూపములతోఁ బోల్చి పరిశీలించినపుడు సహేతుకములై కనఁబడుటయేగాక, తత్తద్భాషారూప నిష్పాదన సందర్భమున వైయాకరణులు విధించు నాయా యాగమాదుల నిజస్వరూపము గూడ బయలుపడుచుండును. కావున నిప్పటి వ్యాకరణములలోఁ జెప్పఁబడియుండిన యాగమాదేశాది సంధి కార్యములు వాస్తవముగా సంధికార్యములుగాఁ బరిగణింపఁదగినవా? లేక ప్రాచీనాఖండవాక్యమును తరువాతి వైయాకరణులు వ్యాకరించి భాషాప్రక్రియను గల్పించు సందర్భ

మున బయలుదేరిన చారిత్రకచిహ్నము లనఁదగిన యతుకు ముక్కలా ? యను విషయము నాంధ్రసంధినిగూర్చి మనము పరిశీలించు సందర్భమున విచారించవలసియుండు నని తెలుపుటకే యీ విషయమింతగా నిచట వివరింపఁ బ్రసక్తమైనది కావున సంధి యనఁగా నేమో యీ యాగమాదుల స్వరూపమెట్టిదో పరిశీలించి తెలిసికొన యత్నింతముగాక.



# సంధి : స్వరూపలక్షణములు

సంధి స్వరూప లక్షణములను తెలుపుటలోఁ బ్రాచీనాంధ్రవైయాకరణులకును, అర్వాచీనులకును గొంత భేదమగపడుచున్నది. ప్రాచీనులగు కేతన పెద్దనార్యులు చెప్పిన లక్షణము ఇతర ద్రావిడ భాషాలక్షణ కర్తల లక్షణముతో సరిపోవుచున్నది. కాని యర్వాచీనుఁడగు బాలవ్యాకరణకర్త చెప్పిన లక్షణ మాతని వ్యాకరణమునందలి తక్కిన విషయము లన్నిటివలెనే సంస్కృతవ్యాకరణ ఫక్కి ననుసరించి సంస్కృతముననే రచింపఁబడిన యథర్వణకారికాదుల ననుసరించి చెప్పినట్లగపడుచున్నది. సామాన్యముగా నీ దక్షిణ హిందూదేశ భాషావ్యాకరణము లన్నియు సంస్కృత వ్యాకరణ సంప్రదాయము ననుసరించినవేయైనను నాంధ్రమున నా వ్యాకరణ సంకేతపద్ధతినిగూడ విశేషముగ నవలంబించిన యర్వాచీనులలో బాలవ్యాకరణకర్త ప్రధానుఁడని చెప్పవలసియున్నది. సంధిలక్షణమునుగూర్చిన యీ మతభేదములను పరిశీలించుటకుఁ బూర్వ మితర సన్నిహిత భాషాలక్షణ కర్తల యభిప్రాయములను దెలిసికొందము.

ఈ భాషలలోఁ బ్రాచీనతమం బని చెప్పఁదగిన తమిళ భాషావ్యాకరణంబగు "తొల్కాప్పియము" న సంధి స్వరూప మిట్లు చెప్పఁబడియున్నది.

పూర్వపదాంత్య భాగమునకును పరపదాది భాగమునకును సంధి యగును. ఇది అచ్చునకచ్చు పరమగునప్పుడును, హల్లునకచ్చు పరమగునప్పుడును, అచ్చునకు హల్లు పరమగునప్పుడును, హల్లునకు హల్లు పరమగునప్పుడును, నాల్గువిధములుగా నగును. ఈ పదములు నామములుగాని క్రియాపదములుగాని కావచ్చును. సంధి కార్యములును నాల్గు విధములు. అందు మూడు మార్పుతోఁగూడినవియు, నొక్కటి మార్పు లేనిదియునై యున్నవి. ఈ మార్పు మూడు విధములుగ నుండును; * వర్ణసమీకరణము, (లేదా ఆదేశము) ఆగమము, లోపము,అని.

1. వర్ణసమీకరణము—ఉదా: మణ్+కుడం=మట్కుడం (cf- తె. మన్ను+కుండ=మట్టికుండ)

2. ఆగమము—ఉదా: ఆనై+కోడు=ఆనైక్కోడు, ఆయిరమ్+ఒన్ఱు=ఆయిరత్తొన్ఱు.

3. లోపము—ఉదా:-మరమ్+వేర్=మరవేర్.

సంధికార్యములు జరుగు సందర్భములు రెండు విధములుగా నున్నవి. ప్రాతిపదికకు విభక్తిప్రత్యయము పరమైనప్పుడు సంధి జరుగవచ్చును. లేదా విభక్తిసంబంధము లేని రెండు పదములకు సంధి జరుగవచ్చును. అప్పుడొక వర్ణముగాని యొపవిభక్తిక ప్రత్యయముగాని యాగమం బగును.

---

* అవైతాం మెయ్ పిరితాకల్ మికుతల్ కున్ఱల్ ఎన్ఱివ్వెన మొఴిప తిరియు మాఱే (తొల్కా, ఎఴ్_110.)

కన్నడ వైయాకరణుల లక్షణము దీనిని బోలియే యున్నది. రెండు గాని యంత కెక్కువ గాని యగు వర్ణముల కూడిక సంధి యనఁబడును. ఆ సంహితలో స్వరరహితమైన వ్యంజనము ముందటి స్వరముతోఁ గూడుకొనును. ఉదా: కూర్తు+ఈవం = కూర్తీవం, ఎన్న+అరసం = ఎన్నరసం; మున్నె+ఇఱివం = మున్నిఱివం.

ఎరడుం పలవుం వర్ణం
పరస్పరం కూడువంద మదు సంధి వలం,
స్వరరహితవ్యంజన మవు
పరవర్ణమనైదుతిర్పు వా సంహితెయోళ్.

(శబ్దమణిదర్పణము. 49)

ఇది పద మధ్య సంధి, పదాంత సంధి యని రెండు విధములు.

పదమధ్యం పదదంత్యం
విదగ్ధరిం సంధివిషయ మెరడక్కుమిళా,
విదిత ప్రకృతి ప్రత్యయ
మొదవిద పదయుగద బెరకె బేడిర్దుదఱిం.

(శబ్దమణిదర్పణము. 50)

ఉదా:—నామవిభక్తి—మాతు+అం=మాతం,

ధాతువిభక్తి—నుడిద+అం=నుడిదం, నుడిద+ఇర్ =నుడిదిర్.

పదాంత్యసంధి—అవన + ఆ_శ్రనం = అవనా_శ్రనం, బెసపిదెవు+ఒళ్పం=బెసపిదెవొళ్పం.

సంధికార్యములు—లోపము, ఉచితాక్షరాగమము, అంత్యాక్షరద్విత్వము, అని మూడువిధములుగా నగును.

స్వరము పరమైనప్పుడు విభక్తిస్వరమునకును, ప్రకృతి స్వరమునకును, (అ, ఇ, ఉ, ఎ లకు) నానారూపి చెపని పక్షమున లోప మగును.

ఉదా:—లోపము : క్రమదె+ఆయ్తు=క్రమదాయ్తు.
చలద+ఆణ్మం=చలదాణ్మం.
అరస+ఆళ్=అరసాళ్.

ఆగమము—ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఐ, ఓ, వర్ణముల కచ్చు పరమైనప్పుడును, అవధారణార్థక "ఎ" కారము పర మందుగల షష్ఠీ విభక్త్యంత "అ" కారమునకును, మధ్య "య" కారము వచ్చును.

ఉదా :—ఆ+ఇర్ద=ఆయిర్ద.
కవి+ఆర్=కవియార్.
పసె+ఇర్దం=పసెయిర్దం.
జో+ఎందు=జోయెందు పాడిదర్.
ఆతన+ఎ=ఆతనయె.

ఉ, ఊ, ఋ, ౠ, ఓ, ఔ, ల తరువాత "వ" కారము వచ్చును.

ఉదా: —మనువిన, పూవిన, కర్తృవాదం, గోవిన.

ద్విత్వము — ఉదా:— కణ్+అం=కణ్ణం, పణ్+ఒన్దు =పన్నొండు.

ఆంధ్రమునఁ బ్రాచీనవైయాకరణు లగు కేతనాదులు చెప్పిన సంధిలక్షణము పైని దెలుపఁబడిన తమిళ కన్నడ వైయాకరణుల లక్షణమునే పోలియున్నది.

"మొదలి పదము తుదివర్ణము
వదలక పై పదము మొదలివర్ణముతోడన్
గదియఁగ సంధులు నాఁదగు."

అని కేతన "యాంధ్రభాషాభూషణ" మందును,

"ఆది శబ్దాంతవర్ణంబు నంత్యశబ్ద
పూర్వవర్ణంబుతోఁ గూడఁ బొత్తుచేత సంధియగు"

నని విన్నకోట పెద్దన 'కావ్యాలంకార చూడామణి' యందును సంధి లక్షణమును జెప్పియున్నారు. అర్వాచీనుఁడగు బాలవ్యాకరణకర్త "పూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశంబగుట సంధినాఁబడు" అని స్వరసంధిని, అందును బరస్వరైకాదేశరూపంబగు దానిని మాత్రమే సంధిగా గ్రహించినట్లు చెప్పినాఁడు. ఆదిశబ్దాంతవర్ణముతో అనంతర శబ్దాదివర్ణము ఇతరావ్యవహితమై చేరుటయే సంధి యని కేతనాదుల లక్షణము. కావున కేతనాదుల లక్షణము బాలవ్యాకరణకారుని సంధి లక్షణముకంటె అధికవ్యాప్తి గలిగి యున్న దనుటకు సందియము లేదు. ప్రాయికముగా నాంధ్ర భాష యజంతభాష యగుటచే బాలవ్యాకరణకర్త స్వరము

లకు సంబంధించిన మార్పులకే ప్రాధాన్య మొసంగఁ దలఁచి, పరస్వరైకాదేశరూప కార్యమే సంధి యని చెప్పిన ట్లగపడుచున్నది.* అట్లయినచో లోపాదేశాగమాది కార్యములు సంధికార్యములు కాకపోవలసివచ్చును. అయినను వీనిని సంధి ప్రకరణములోమాత్ర మాతఁడు చేర్పకయుండలేదు. కాఁగా నీ యాగమాదులన్నియు సంహితాదశయందు గలుగు మార్పులే గావున నవియు నీ ప్రకరణమునఁ జేర్పఁబడినవని తలంపనగును. వెల+ఆలు, చేయు+ఆతఁడు, కఱకు+అమ్ము, ధీరు+ఆలు—ఈ మొదలగు సందర్భములలోఁ బూర్వమునను బరమునను గూడ స్వరములే నిలిచియుండినను, అచట సంధి జరుగక, వానినడుమ నొక హల్లువచ్చి చేరుటయు, నా హల్లు పరమందలి యచ్చుతో నెనయుటయు సంభవించుటను బట్టి యది పూర్వపరస్వరంబు లొక్కచో నిలచినప్పుడు జరిగిన కార్యము గావున సంధిగార్యమే యని సరిపెట్టుకొన్నను, సరళాదేశాది కార్యములు స్వరములకు సంబంధించినవి కాకుండుటచే సంధికార్యములే కావనవలసి వచ్చును. కాని ఇవియు సంహితాదశలోఁ గలిగిన మార్పులే గావున నీ ప్రకరణమునఁ జేర్పఁబడిన వనవలసియున్నది. చారిత్రక దృష్టితోఁ జూచినచో వాస్తవముగా నీ యాగమములలోఁ బెక్కు

* "పూర్వస్య పరరూపత్వ మత్రైవ నియతం భవేత్" (అథర్వణ కారికలు) ఇత్యాది ప్రాచీన వైయాకరణ మతానుసరణమున బాలవ్యాకరణ కర్త పరరూపసంధియే సంధి యని గ్రహించియుండును.

ముఖ్యముగా నుగాగమ టుగాగమ రుగాగమములు నుచ్చా రణ సౌకర్యము కారణముగాఁ జేరినవి గాక, సహజముగా నా యా శబ్దములకుఁ జెందినవో, లేదా యట్టి కొన్ని ప్రాచీన శబ్దముల సామ్యముచేఁ గాలక్రమమున భాషలో నేర్పడినవో యగుటచే, సంధికార్యములుగఁ బరిగణింపఁదగినవియే కావని చెప్పవలసియుండును.

ఈ భాషలోని శబ్దములు ప్రాయికముగా నజంతములు. వీనిని కళలనియు, నజంతములు గాని శబ్దములు తరచుగా నకారాంతములై యుండుటచే, వానిని ద్రుతాంతములు— ద్రుతప్రకృతికము లనియుఁ జెప్పుచున్నారు. ద్రుతాంతములు గాక హలంతము లైన శబ్దము లీ భాషలో విశేషముగా లేవు. వస్తున్, వారల్ మొదలగునవి కొన్ని యున్నను నివి "వస్తును" "వారలు" అనువాని రూపాంతరములుగ నైయా కరణులచే గ్రహింపఁబడుచుండుటయే గాక, కావ్యములందు ఛందస్సౌకర్యమునకై యేర్పడినవై యుండును గావున ద్రుతాంతములు తప్ప హలంతములు లేవనియే చెప్పవల యును. ఈ కారణముచే నీ భాషలో నొక్క ద్రుతకార్యములు దక్క, తక్కిన భాషలలోవలె హలంతపద సంధివిశేషములు లేకుండుట తటస్థించినది. తుది హల్లునుగూర్చి చెప్పఁబడిన సంధికార్యములు రెండును (బాల వ్యా. సం. 52-53 సూ.) సంస్కృత వాక్యములు, అనుకరణమునం దాంధ్రమున వచ్చి చేరునపుడు గలుగు వికారములనుగూర్చి చెప్పునవై యున్నవి.

"కింతత్" "దాసోహం" అను సంస్కృతవాక్యములు తెలుఁగున ననుకరింపఁబడు నపుడు వీని తుదిహల్లు ద్విత్వమును బొందునని యీ సూత్రము చెప్పుచున్నది. వాస్తవముగా సంస్కృత హలంతశబ్దము లన్నియు, సంస్కృత శబ్దములే యననేల-ప్రాచీనద్రావిడభాషలలోనివిగాని, ఇంగ్లీషు మొదలగు భాషలలోనివి గాని యగు హలంతశబ్దములుగూడ, నీ భాషలోఁ జేరునపుడు, వాని తుదిహల్లు ద్విత్వమును బొందుచునే యున్నది. వాక్-వాక్కు; మరుత్-మరుత్తు, ముళ్-ముళ్ళు, కణ్-కన్ను, రోడ్-రోడ్డు, ఇత్యాదులు. కావున తత్సమశబ్దము లన్నియు నిట్లేర్పడుచున్నపుడు ఈ విషయమునే ప్రత్యేకసంధికార్యముగా గ్రహింప నావశ్యకతయే కనఁబడదు. కాని కేవల సంస్కృతవాక్యముల కీ భాషలో ననుకరణంబునం దప్పఁ బ్రయోగము లేదు గావున నా సందర్భమునఁ గలుగు విశేషమగుటచే నీ కార్యము సంధికార్యముగా గ్రహింపఁబడియుండును. మొత్తముపై నీరెండు సందర్భములయందును జరిగిన పని యొక్కటే యను విషయము మాత్రము గ్రహింపఁదగియున్నది.

కన్నడభాషగూడ, - ముఖ్యముగా హొసగన్నడము చాలవఱ కజంతభాషగా మాఱినను హలంతపదము లింకను విశేషముగా లేకపోలేదు. తమిళమునందుఁగూడ హలంత శబ్దముల నజంతములుగ మార్చు సంప్రదాయ మిటీవలి కాలమున వ్యాప్తిలోనికి వచ్చినను, హలంతపదములే యూ

భాషలో విశేషముగా నున్న వని చెప్పవలసియున్నది. తెలుఁగులో నిలిచియున్న హలంత శబ్దములు నకారాంత ములు మాత్రమే. ఇవియుఁ దుదిని ఉకారమును గ్రహించి "ను" వర్ణాంతము లగుటయు కలదు. కావుననే ద్రుతస్వరూ పమునుగూర్చి పండితులలో నభిప్రాయ భేద మేర్పడుట తటస్థించినది. ఉచ్చారణ సౌకర్యమునకై యర్ధస్ఫురణమునకు భంగములేని స్థలములం దెల్లను, నకారము లోపించుచునే యుండుటచే, నా లోపించిన స్థలములం గెల్ల స్వరసంధియే గలుగుట తటస్థించుచున్నది. నకార మర్థస్ఫురణమునకై నిలిచియుండు స్థలములలో నిది పై యచ్చుతో నెనయుచుం డును. గావున నిచ్చట విశేషముగా సంధికార్య మేమియు లేదు. కావుననే "ద్రుతాంతములకు సంధి లేదు" అను సూత్రమును బాలవ్యాకరణకారుఁడు కల్పించియున్నాఁడు. భాషలోని శబ్దముల తుదిని యీ "న" కారముండుట, పోవుట యనునది యర్థస్ఫురణమును బట్టి యుండును. పదాంతమున నిది తఱ చుగా లోపించుట తటస్థించుచుండును. గావుననే ద్రుతమని వైయాకరణులు దీనికి పేరిడిరి. అర్థస్ఫురణమే దీని లోపా లోపములను నిర్ణయించునది. సంధి విషయమునఁగూడ నిదియె నిర్ణాయకము. కావుననే కన్నడవైయాకరణులు "స్వరే స్వరస్య లోపః" అని లోపమును విధించి వెంటనే "న నామభాగ ప్రధ్వంసే" (కర్ణాటభాషాభూషణము) అని నామరూపము చెడునట్టి సందర్భమున లోపసంధి జరుగఁగూడ

దని చెప్పినారు.* కావున వర్ణస్ఫురణమునకు బాధకము గాని రీతిని పదాంత్యవర్ణమునకును, పరపదాదివర్ణమునకును నుచ్చారణ సౌకర్యము కలుగునట్లుగా పొందిక గల్పించి, చేర్చి పలుకుటయే సంధి యని సామాన్యాభిప్రాయ మగుచున్నది. ఇట్టి యుచ్చారణ సౌకర్యము లోపాగమాదేశములవలనఁ గలుగుచున్న దని వైయాకరణులందఱును జెప్పుచున్నారు. వీరు సంధికార్యము లని చెప్పిన యాగమాదులన్నియు నుచ్చారణ సౌకర్యము (euphony) నకై వచ్చి చేరినవేనా యను విషయముమాత్రము భాషాచారిత్రక దృష్టితోఁ బరిశీలింపవలసియున్నది.

## — సంధిలోని యాగమాదుల స్వరూపము —

ఉచ్చారణ సౌకర్యమే సంధికి ముఖ్య ప్రయోజనమై యున్నప్పుడు ఈ యాగమాదు లన్నియు నా ప్రయోజనమునే సార్థకపఱచుచున్న వని చెప్పుట కవకాశము కనఁబడదు. ఏల యనఁగా సౌకర్యాపేక్షకలవాఁడు, నలసుఁడు నగు మానవుఁడు తాను చెప్పఁదలఁచిన భావమును సాధ్యమైనంతవఱకు తక్కువ ధ్వనులతోనే చెప్పఁ జూచుచుఁ దాను చెప్పఁ

---

* "స్వరమిది రొళిరె విభక్తిస్వరకం ప్రకృతిస్వరక్కమక్కుం లోపం వర సంస్కృతకర్ణాటక సొగసభాషాళం నాయురూఢి యలియదపక్షం"

(శబ్దమణి దర్పణ. సంధి. 52.)

సంజ్ఞా: లుక్ స్వరేఽస్వరస్య: లుబనామ హానౌ (స్వరే పరే స్వరస్య లుక్ భవతి, నచేల్లోపే నామహానిః)

(కర్ణాట శబ్దానుశాసనం-ప్రథమపాద, 84, 85, 86.)

దలంచిన వాక్యము సంకోచపఱచుచునే యుండును గాని శ్రోతృధ్వనుల నందుఁ జేర్చి విస్తృతి నొందింప నిచ్చగింపఁడు. మఱియు నొక విషయము మనము ముఖ్యముగా గమనింపవలసి యున్నది. ప్రాచీనకాలమందు మానవుఁడు తన భావములను సంపూర్ణవాక్యముల మూలముగనే వ్యక్తము చేసెను గాని, కేవల పదముల మూలముగాఁ గాదు. ఇప్పుడు మనము ప్రత్యేకముగా వ్యవహరించుచుండు పదము లనునవి యీ భాషాచరిత్రలో నొకకాలమం దొక లాక్షణికుఁ డీ భాషలు వ్యాకరించి, యఖండవాక్యమును ఛేదించి, లక్షణ మేర్పఱచు సందర్భమున బయలుదేరినవై యుండు నని యిదివఱకే సూచింపఁబడినదిగదా, ఆ లాక్షణికుఁడైనను తన కాలమున నా భాషలో వ్యవహరింపఁబడుచు సంపూర్ణార్థ బోధకములైన వాక్యములను గ్రహించి వాని నితరవాక్యములతోఁ బోల్చి యా వాక్యములో నీ యీ భాగ మీ యర్థమును బోధించుచు, నితర భాగములతో నిట్టిసంబంధము కలిగియున్న దని వ్యక్తముచేయుచు, నందున్న ధ్వనులను విడగొట్టి చూపెనేగాని, యా వాక్యములో లేని శ్రోతృధ్వనులను ఆగమము లనుపేర స్వయముగాఁ దెచ్చిపెట్టియుండఁడు. కావున నిప్పటి వ్యాకరణములలో నాగమములుగా గ్రహింపఁబడుచున్న విశేషధ్వను లన్నియు నొక కాలమున సహజముగ నఖండవాక్యగతములే యైయుండె నని తలంపవలసి యున్నది. అట్లయినచోఁ దరువాత వైయాకరణులు

మాత్రము వీనిని ప్రత్యేకము నార్థములుగా గ్రహింపనేల యను ప్రశ్న కలుగవచ్చును. అట్లగుటకుఁ గారణమేమనగా— భాష యనవరతము మార్పుల నొందుచుండుటచే, నొకకాలమున వ్యవహారములోనున్న శబ్దముల స్వరూపము మఱికొంత కాలమునకు మాఱిపోవుట తటస్థించును గాని, వ్యవహారమున సంప్రాప్తవాక్యములు, పదబంధములు చిరకాలమునుండియు వచ్చుచున్నను, వానికి ప్రత్యేకశబ్దములవలె నంతసులభముగా మార్పుకలుగదు. అట్టిస్థితిలో కాలక్రమమున మార్పు జెంది సంకోచరూపమును బడసిన యొక ప్రత్యేకశబ్దముయొక్క రూపమునకును, వాక్యగతంబై చిరకాలమునుండి వ్యవహారమున మార్పులేక వచ్చుచున్న యా శబ్దముయొక్క ప్రాచీన రూపమునకును గొంత భేద మేర్పడును. ఒక కాలమున ప్రత్యేకముగా వ్యవహరింపఁబడుచున్న యొక శబ్దముయొక్క రూపమునే తరువాతి కాలపు లాక్షణికుఁడు, దానికి సహజము ప్రామాణికము నగు రూపముగా గ్రహించినప్పుడు, ప్రాచీనవాక్యగతం బగు నద్దాని రూపమునకును దీనికిని కొంత భేద మగపడుచుండును. వాక్యగతంబయిన యా శబ్దమున కా రూపాంతర మే యర్థమున నెట్టి సందర్భమునఁ గలుగుచున్నదో కనిపట్టి, తన కాలమున వ్యవహారములో నున్న యా శబ్దమున కొక ప్రత్యేకార్థమున, లేదా మఱియొక శబ్దములో నొక యర్థమున సంయోగము గలిగినపుడు, ఈ యాగమము కలుగు నని లక్షణ మేర్పఱచును. ఈ యాగమ మను

నది వాస్తవముగ, నీ శబ్దమునకు సహజముగా సంబంధించినదే యైనను, నా రూప మీ లాక్షణికుని కాలమున వ్యవహారమున లేమిం జేసి యాతఁడా ప్రాచీనవాక్యమును వ్యాకరించుటలో నా శబ్దము తన కాలమున నెట్టి రూపముగలదై యున్నదో నట్టి రూపము కలదానినిగనె విడఁగొట్టి, యా వాక్యమునఁ దరువాతి శబ్దమునకును దీనికిని నడుమ మిగిలి యున్న యతుకుముక్క నాగమముగా గ్రహించి, యీ యర్థమున నీ శబ్దమున కీ శబ్దము పరమైనచో నీ యాగమము వచ్చునని లక్షణ మొనరించును. ఒక మాఱు భాష కట్టి లక్షణ మేర్పడినతోడనే, తరువాతవా రందఱుఁగూడ నా మార్గమునే యవలంబించి, యొక కాలమందా భాషయొక్క స్థితినిబట్టి, దానిని వ్యాకరించి లక్షణము చెప్పిన నైయాకరణుఁడు గ్రహించిన శబ్దస్వరూపమునే పరమప్రమాణముగా నెంచి తత్తదాగమాదు లాయా పదసంయోగ సందర్భమున నెల్లో పైగా వచ్చి చేరుచుండునని తలంచుచుండుట సంభవించును.✓ వీని సాదృశ్యముచే (analogy) నింక ననేక సందర్భముల నీ యాగమాదులు విధింపఁబడి, తొలిపద మొక యాకృతి గణమునకు మూలం బగుటగూడఁ దటస్థించును. భాషలో నిట్టి పోలికచే నేర్పడిన రూపములు (analogical forms) పెరిగినకొలఁది మూలరూప మేదో, అనఁగా దేని సాదృశ్యమునుబట్టి యట్టి రూపములు భాషలో నేర్పడినవో తెలిసికొనుటయుఁ గష్టతరంబగును. అప్పు డా భాషయొక్క

ప్రాచీనస్వరూపమును గనిపట్టి వెదకుటయో, లేదా యా రూపముల నితర సన్నిహిత భాషారూపములతోఁ బోల్చి చూచుటయో సంభవించినఁ గాని, దాని మూల రూపమును దెలిసికొనుట కడు దుర్లభంబే యగును.

దీనికొక చిన్న యుదాహరణమును గ్రహింతము. తెలుఁగున "పొద" శబ్ద మొకటి కలదు. అది యిప్పుడు సామాన్యముగా అకారాంతశబ్దముగనే ప్రసిద్ధమైయున్నది. దీనికి "ఇల్లు" అను శబ్దము పరమునఁ జేర్పబడినపుడు పొద+ ఇల్లు=(కలిసి) "పొదరిల్లు" అని చెప్పబడుచున్నది. అనఁగా 'పొద' శబ్దము చివరనున్న అకారమున కచ్చుపరమగునపుడు రేఫాగమంబగుచున్న దన్నమాట. ఇదియు విశేషణసమాసమునందు మాత్రమే. పొద+ఉండెను అని యున్నచో, "పొదయుండెను" అనియే కాని "పొదరుండెను" అని యగుట లేదు. దీనినిబట్టి తక్కిన స్థలములందు "పొద" శబ్ద మకారాంతమైయే నిలుచుచున్నది. గావున, "పొద" అనునదే దాని సహజ రూపం బనియు, "ఇల్లు" శబ్దము పరమైనపుడు మాత్రమే రేఫాగమము కలుగుచుండుటచే నది కర్మధారయ సమాసములందు మాత్రము ప్రత్యేకముగా వచ్చు నాగమ మనియు, నీ భాషయొక్క ప్రస్తుతస్థితిని గ్రహించి వ్యాకరించి లక్షణము చెప్పిన లాక్షణికుఁడు (Descriptive Grammarian) ఒకవేళ చెప్పినఁ జెప్పవచ్చును. కాని యీ భాషలోని కొన్ని ప్రాచీనగ్రంథములను బరిశీలించినచో నీ "పొద" శబ్దమునకు

"పొదరు" అను రూపము ప్రాచీనకాలమున వ్యవహారములో నున్నట్లు నిదర్శనము లగపడును. తిక్కన భారతమున నీ శబ్దమును "పొదరు" అను రూపమునఁ బ్రయోగించియున్నాఁడు. తరువాతి కాలమున తుది రేఫము జాఱిపోయి యుండును. విరాటపర్వము తృతీయాశ్వాసమున వేగులవాండ్రు పాండవులను వెదకు సందర్భమున వారు, —

ఆ. పరఁగఁ బొదరు పొదరు పల్లంబు పల్లంబు
ప్రాను ప్రాను దుర్గమంపుఁ జోటు
దుర్గమంపుఁజోటు దోన దోన గుహ గుహ
యాదిగాఁగ నెందు నరసి యరసి.

(విరా. 3 ఆ. 82)

అనుచో వారు పొదరు, పొదరు నరసినట్లున్నది. ఈ "పొదరు" లోని తుదివర్ణ ముచ్చారణవేగమున లోపించుటచే "పొద" యయినది. దీనితోఁ గూడిన కర్మధారయసమాసములు భాషలోఁ బ్రాచీనములై దీని ప్రాచీనరూపంబగు "పొదరు" అనుదానితోఁ గూడి యేర్పడినవగుటచే "పొద యుండెను" అన్నచోఁ గానరాని రేఫాగమ మచ్చుటఁ బొడసూపుచున్నది. అనఁగా "పొద" శబ్దమున కీ భాషలోనే ప్రాచీనకాలమున "పొదరు" అనెడి రేఫాంతమగు రూపాంతర మొకటి యున్నదని మనము కనిపెట్టఁ గలిగినపుడు (తమిళభాషలోఁగూడ దీనికి "పుదర్" అను రూపము కలదు) రేఫమాగమ మని తలఁచుట కావశ్యకతయే లేకపోవునుగదా.

కొమరాలు అనునదికూడ కొమ + ర్ + ఆలు అని రేఫాగ మముతోఁగూడినదిగాక "క్రొమరు" శబ్దమునకు ఆలు చేర్చుటచే నేర్పడినదే. ఇఁక పేదాది శబ్దముల కాలు శబ్దము పరమైనపుడు గలుగుచున్న రుగాగము నిట్టిదేయై యుండుననుటకు సందేహములేదు, ఈ రుగాగమువంటివే తక్కిన టుగాగమాదులు నై యుండుననియుఁ దలంపవచ్చును.

ఇట్లాగమము లని చెప్పఁబడుచుండిన రేఫ టకారాదులు సహజముగ శబ్దగతములు గాని లేదా సామ్యముచే వచ్చి చేరినవి గాని యైయుండవచ్చు ననియుఁ, బ్రాచీన భాషలో వీని సంపూర్ణరూపము లగపడవచ్చు ననియుఁ దలంచినను, పరస్వరైకాదేశరూపసంధి లేనిచోట నెల్ల వచ్చు నని చెప్పఁబడిన యడాగమము సంగతి యేమి యని యడుగ వచ్చును. సంధిలేనియప్పుడు పూర్వపరస్వరములలో నేదేని తాలవ్యాచ్చులగు నికార, ఎకారంబులలో నొకటైయుండుట తటస్థించినచో వాని నడుమ తాలవ్యాంతస్థం బగు "య" కార మొక సంధ్యక్షరముగా (Glide) నాగమమై వచ్చిచేరుట సంభావ్యంబై యుండును గాని, తాలవ్యేతరంబు లగు నేయచ్చుల నడుమనైననుగూడ సంధిలేనిచో యడాగమం బగుట కొంత వికృతముగాఁ గనఁబడక మానదు. ఇప్పటి మన యలవాటునుబట్టి "వెల్లయావు" అన్నపుడు అకారము తరువాత "య" కార ముచ్చరించుట వికృతముగాఁ గనబడకున్నను, "తల్లి యిచ్చెను, పులి యఱచెను" అనువానిలో

వలె సంతస్వాభావికమై కనఁబడ దనుటకు సందేహములేదు. కాని నెల్లయూవు, చింతయూకు, అనురూపము లెచ్చటనో పద్యములందు ఛందస్సౌకర్యమునకై ప్రయోగింపఁబడి యుండుట తటస్థించినను వ్యవహారమున లేనేలేవు. సామాన్యముగా నెల్లావు, చింతాకు మొదలగు రూపములే శిష్టకవిత యందును శిష్టవ్యవహారమందునుగూడఁ గాంచనగును. కావున నే కొందఱు లాక్షణికులుగూడ ఆకు, అంత, అయ్య, అక్క మొదలగు శబ్దములు పరమైనపుడు అకారమునకు నిత్యసంధియే విధించియున్నారు.

ఆంధ్రమున అకారమున కచ్చు పరమైనపుడు సంధి జరుగనిచో యడాగమము మాత్రమే వచ్చుచుండఁ, దమిళ కన్నడములలో వడాగమముకూడ వచ్చుటకలదు. ఉదా:—

తమి.—అ+యాళ్ =అవ్ యాళ్
అ+వళై =అవ్ వళై
అ+ఆడై =అవ్ వాడై
అ+ఇలై =అవ్ విలై
మక+ఇన్+కై =మకవ్ ఇన్కై

కన్న.—మర+ఇల్ల=మరవిల్ల
ఆహావింద్రియద.

ఇట్లే అకారముపై తాలవ్యాచ్సంయోగము లేకున్నను నీ భాషలలో యడాగమ వడాగమములు రెండును

గూడ నచ్చుచుండుటచే వాస్తవముగా నివియు సంధివశమున ననఁగా నుచ్చారణసౌకర్యమునకై వచ్చినవా? లేక యివియు శబ్దగతములేనా? యని సందేహింపవలసి వచ్చుచున్నది. తక్కిన యాగమాదులవలె నివియు శబ్దగతములనుటకుఁ దగిన హేతువులు లేకపోలేదు. దానినిగూర్చి ముందు విచారింతము.

సామాన్యముగా మానవుఁ డల్పతరప్రయత్నముచే నధికఫలమును సంపాదింపఁ గోరుచుండును. గావున తన భావము వ్యక్తమగుచున్నచోఁ దాను ప్రయోగించు వాక్యము నెట్లు సంకుచితపఱచి త్వరితగతి నుచ్చరించి యెదుటివాని కెఱుకపఱుపఁ గలిగియుండునో అంతవఱకు సంకుచితపఱుప యత్నించుచునే యుండును. ఈ యత్నములోఁ దన భావ మెదుటివానికి బోధపడకుండ నుండునట్లు మాత్రము చేసికొనఁడు. అది సుబోధం బగుచుండుటను గూర్చి జాగరూకుఁడై యే యుండును. ఈ సందర్భమున స్వరము (accent), ఊనిక (stress), ఆ భాషతో నెదుటి వానికి గల పరిచయము మొదలగునవి యీతనికి సహాయకారు లగుచుండును. స్వరభేదమునుబట్టి భావచ్ఛాయలను, ఊతనుబట్టి వాని ప్రాధాన్యాప్రాధాన్యములను నుచ్చారణలోనే సూచింపఁ గలిగియుండును. ఎదుటివాఁడు భాషతో విశేష పరిచయము కలవాఁడు కానిచో నాపియాపి స్పష్టతనొచ్చారణముచేఁ జెప్పును. లేదా యా శబ్దములను, వాక్య

మును. సంకుచితపఱచును. "వేగము గాన్ రమ్ము" అను వాక్యము నతిత్వరితగతి నుచ్చరించి నపుడు "వేన్ రా" అను రూపమును పొందిన ఎమటిహాని కర్థ మగుచునే యున్నది. ఒక కాలమున కీ రెంకన వాక్యము కూడ శిష్టజనాదరణీయం బైన దని యంగీకరింపఁబడి గ్రంథస్థంబైనచో "వేగముగా" ననుదానికి "వేన్" అనునదిరూపాంతరము లేదా సంకుచిత రూపముగా గ్రహింపఁబడవలసి వచ్చును. చేయఁగలవాఁడు -చేయగలఁడు, కలవాఁడవు-కలవు; కైదనన్-కైదాన్ మొదలగు రూపము లన్నియు నిట్టి యుచ్చారణవేగము వలనఁ గలిగిన సంకుచితత్వమున నేర్పడినవే. కాని యర్థమునకు, రూఢికి మాత్రము భంగము కలుగలేదు. కలిగినచో వ్యవహార హానియే కలుగునుగదా.

కావుననే యొక వాక్యమున నొక పదమునకు పరమై మఱియొక పదము నిలిచినపుడు పూర్వపదాంత్యస్వరము లోపించి పరపదాదిస్వర మా స్థలము నాక్రమించుకొనుట తటస్థించుచున్నది. ఇచ్చట మన మొక్క విషయమును గమనింపవలసియున్నది. ఈ ద్రావిడభాషలలో ప్రతిపదమునకును తొలి యచ్చుమీఁద స్వర (accent) మూనుచుండును. స్వరముతోఁగూడిన యచ్చు ఊఁది పలుకఁబడుచుండును గావున నది ప్రధానమై యొప్పుచుండును. ఆ పదమందలి తక్కిన యచ్చులకట్టి ప్రాధాన్యముండదు. పదము చివరకు వచ్చిన కొలఁది యందలి యుచ్చారణవేగముచే సంకుచితములై

పోవుచుండును. కావున తుదియచ్చు మిక్కిలి నీరసమైనదై క్రమముగ జాఱవిడువఁబడఁదగిన స్థితి కలదగును. కాని యది ప్రత్యేకార్థబోధకంబగుట తటస్థించెనేని,-అనఁగా నది లోపించిన నా పదస్వరూపమునకే భంగము కలుగునేని యర్థహాని కలుగును గావున నా యచ్చు దన స్థానమున నిలిచియే యుండును. అప్పుడు సంధి జరుగదు. జరిగినపుడు అర్థభంగమును గలిగింపక స్వరహితమై యుండుతలేని పదాంతస్వరము లోపించి స్వరసహిత మగు పరపదాదిస్వరూప ముచ్చారణ సౌకర్యమునకై దాని స్థాన మాక్రమించుచున్నది.

స్వరము పరమైనపుడు స్వరమునకు లోపంబగును, కాని నామరూఢికి ధ్వంసము కలుగఁగూడదు అని కన్నడ వైయాకరణులును, "పూర్వపరస్వరంబులకు పరస్వరం బేకాదేశం బగు" నని తెలుఁగు వైయాకరణులును తెలిపియున్నారు. కన్నడ వైయాకరణులు పూర్వస్వరలోపమును విధింపఁగా, నాంధ్ర వైయాకరణులు పరస్వరైకాదేశమును విధించినారు. వీనివలనఁ గలుగు ఫలిత మొక్కటియేయైనను—అనఁగా పరముగానున్న యచ్చు పూర్వముగానున్న యచ్చు లోపించుటచే దాని వెనుక మిగిలిన హల్లుతో నెనయుచుండుటయే తటస్థించినను—కన్నడ వైయాకరణుల పద్ధతి తెలుఁగువారి దానివలె సంస్కృత ఫక్కి ననుసరింపక ద్రావిడభాషా సంప్రదాయమునే యవలంబించుచున్న దని చెప్పవలసియున్నది.

ఇట్లలసత్వాప్రవణుఁ డగు మానవుఁడొక వాక్యమును జెప్పునప్పు డందలి పదముల నొకదానితో నొకటిని జేర్చి కూర్చి పలుకుటయే స్వాభావికమై కనఁబడుటచే, సామాన్యముగా నచ్చులకు సంధి జరుగుటయె సహజస్థితి యని తలంపవలసి యున్నది. అట్లు జరుగని సందర్భముల కేదో ప్రత్యేక కారణ ముండవలయును. కాఁబట్టి సంహిత యందు పూర్వపరాచ్చుల నడుమ నాగమాదులు వచ్చిచేరు ననుట సహజస్థితి కాదనియు, నీ యాగమాదు లే కారణముచే నా యా సందర్భముల వచ్చినవో, లేదా వచ్చినట్లు తలంపఁబడుచున్నవో, ప్రాచీనాఖండ వాక్యస్వరూపమును గ్రహించి దానినిబట్టి పరిశీలించి తెలిసికొనవలసి యున్నదనియు నేర్పడుచున్నది. ఏల యనఁగా భాషకు వాక్యమే పరిమాణము. అది దాని కొక కొలతబద్ద వంటిది. ఈ వాక్య మా యా కాలములందు తత్తదర్థానుకూలముగా విడఁగొట్టఁబడుటచే పదములేర్పడినవి. ఈ విడఁగొట్టఁబడిన పదములా యఖండవాక్యమున నెట్లమరియున్నవో, యే రూపముతో నుండినవో, ఆ విడఁగొట్టినవారు వీని నెట్టి యర్థమును బోధించువానిగాఁ దలంచి విడఁగొట్టిరో, ఆ పదమున కా వాక్యమునందలి యితర పదములతో నెట్టి సంబంధము కలదో, యను విషయములను పరిశీలించినఁ గాని యా పదములలో నొకదానిపై మఱియొక దానిని జేర్చి యీ కాలమున మన ముచ్చరించునపు డాగమములుగా వచ్చునని చెప్పఁబడుచున్న ధ్వనుల

స్వరూపలక్షణము లిట్టి వని మనము నిశ్చయింపలేము. కావున భాషాలక్షణమును దెలిసికొనుటకై, వ్యాకరణ విషయములను మనము పరిశీలించునప్పుడు ఒక పదమున కొకపదము పరమైనచో నేమగుచున్నదని కాక, యొక వాక్యమునే ప్రమాణముగా (unit) గ్రహించి యా వాక్యమున నా యా పదములెట్టి స్థానముకలవై యెట్లుమరియున్న వను విషయము తెలిసికొనవలసియున్నది. ఈ పద్ధతియే యాధునిక శబ్దశాస్త్ర వేత్త లవలంబించు పద్ధతియైయున్నది. ఈ పద్ధతి కొక భాష యొక్క ప్రస్తుతస్థితిని పూర్వాపూర్వములగు భిన్నావస్థలతోఁ గాని, సన్నిహితములగు నితరభాషా సంప్రదాయములతోఁ గాని, సరిపోల్చి చూచు విధానము (comparative method) ప్రధానవిషయమైయున్నది. ఒక భాష నితర సన్నిహిత భాషల తోనో, ఆ భాషయొక్క పూర్వావస్థలతోనో సరిపోల్చి చూచినఁ గాని, తాత్కాలిక వ్యాకరణమందు విధిరూపము గాఁ దెలుపఁబడిన విశేషకార్యముల సార్థక్యముగాని, సంబంధముగాని బోధపడదు. భారతీయ భాషోద్ధారకసంఘు (Linguistic Society of India) మహాసభ కగ్రాసనాధిపత్యము వహించిన డాక్టరు తారిపోరివాల, B. A., PH. D., అను నాయన, దేశీయ వ్యాకరణములను గూర్చి తన యధ్యక్షోపన్యాసమునఁ జెప్పిన కొన్ని విషయము లిచ్చట స్మరించుట యుక్తము.

"The modern notions of grammar are based on a recognition of the fundamental idea in Linguistics

that **the sentence, (and not the word) is the unit of languqae.** Panini and Sanskrit grammarians had realised th's essential fact of language, and they made a clear distinction between **sabda** (word) and **pada** (a term in a sentence). It is from this fundamental idea of language that all grammar is to be built up... ......Panini's treatment of the language (Sanskrit) is not 'comparative' and consequently in many places he was prolix where he might have been concise. When we come to the vernacular period we find all our grammars are mere slavish imtations of the Sanskrit Grrmmar of Panini. If we wish them (our vernacular grammars) to be in a line with modern ideas of Linguistic Science, we must bear in mind the following point—We must take the sentence as the unit of language and the words and clauses composing it as parts functioning in it. In other words, the chief value of our new style of grammar should lie in the fact that it is a **grammar of function.**

ఈ కాలమున బయలుదేరు భాషాలక్షణములు, లేదా వ్యాకరణములు కేవల తాత్కాలిక భాషాస్వరూప లక్షణములు గాక, పూర్వాపూర్వ స్వరూప సన్నిహితభాషా సామ్య పరిశీలనముతోఁ గూడి యందలి వాక్యమునం దమరియున్న భిన్నభాగముల సంబంధరూప వృత్తి లక్షణమును దెలుపునవై యుండవలయు నని యీ పండితుని ముఖ్యాశయమై యున్నది.

— యడాగమ స్వరూపము —

ప్రస్తుతము పదసంధిలో నాగమములై వచ్చు వర్ణముల నిజస్వరూపమును దెలిసికొనుటలో నితర భాషావాక్యస్వరూపమేమైనం దోడ్పడు నేమో పరిశీలింతము. సామాన్యముగా

నచ్చున కచ్చు పరమైనపుడు వాక్యములో పూర్వాచ్చునకు లోపముగలిగి స్వరయుక్తమగు (accented) పరపదాద్యచ్చు వెనుకటి హల్లుతో నెనయవలసియుండగాఁ గొన్ని సందర్భముల ముఖ్యముగా "వెలయాలు" మొదలగు చోటుల యడాగమమే నిత్యముగా వచ్చుటయు, తమిళమున అ+యాళ్ = అన్ యాళ్ అను నప్పుడు వకారాగమమే నిత్యముగా వచ్చుటయుఁ జూడ దీనికి వేఱు కారణ ముండునా యను సందేహము కలుగకమానదు. వెల+ఆలు అనునపుడు సంధిగలిగి వెలాలు అని యున్నచో, వెల+అలు అనియా, వెల్+ఆలు అనియా యను సందేహము కలుగు ననియు, నామభాగప్రధ్వంసము [నామరూఢికి చ్యుతి] కలుగుచున్నది గాన సంధి జరుగ లేదనియుఁ జెప్పవచ్చును. గాని దీనిని తమిళభాషా రూపముతోఁ బోల్చినచో మఱియొక విశేషముగూడ గోచరించును. ఆ భాషలో నీ శబ్దముయొక్క ప్రాచీనస్వరూపము మన కగపడుచున్నది. సామాన్యముగా తెలుఁగున అకారాంతములై యున్న పెక్కు శబ్దములు అఱవమున "ఐ" కారాంతములై యున్నవి. తెలుఁగునందలి "వెల" శబ్ద మాభాషలో "విలై" అను రూపముగలదై యున్నది. ఇది ప్రాచీన భాషా రూప విభాగమువలన నందేర్పడి యుండవచ్చును. ఇందలి "ఐ" కార మా కాలమున "అఇ" అనియు "ఎఇ" అనియు గూడ నుచ్చరింపఁబడుచుండిన ట్లూహింపవచ్చును. ఏలయనఁగాఁ దమిళమున నైకారాంతములై యున్న వని చెప్పఁబడు

చున్న యిట్టి శబ్దములన్నియుఁ గన్నడభాషలో "ఎ"కారాంతములై యున్నవి. తెలుఁగులో అకారాంతములుగనే యున్నవి. తుది నొక ఇకారము చేరినపు డుచ్చారణమున అఇ-ఆయ్, అగుట సహజమే గావున విలఇ-విలయ్+ఆళ్= విలయాళ్=వెలయాలు, అను రూపము సిద్ధించును. తరువాతి కాలమున ప్రాచీన భాషలోని విలై శబ్దము తెలుఁగులో ప్రత్యేకముగా వెల యను రూపముననే నెలసియుండుటచే, ప్రాచీన సంప్రదాయానుసారముగా నీ భాషలో నిలిచియున్న వెలయాలు శబ్దము వెల, ఆలు అను రెండు పదములుగా విడఁగొట్టఁబడినపుడు, నడుమనున్న యకారము సంధివశమున వచ్చిన యడాగమముగా గ్రహింపఁబడిన ట్లగపడుచున్నది. కావున, అకారాంత శబ్దములపై నచ్చు నిలిచినపుడు సంధి కార్యముగా గ్రహింపఁబడుచున్న యడాగమము, ఎచ్చటి నుండియో హఠాత్తుగా వచ్చి చేరినది గాక ప్రాచీనభాషలో నామవాచకరూపములను గల్పించుటకు ధాతువులపై జేర్చ బడిన "ఇ" కార స్థానమున నిలిచి, తరువాతికాలమున నా శబ్దస్వరూపము వ్యవహారమున మాఱుటచేతనో, లేదా యను చిత విభాగమూలముననో ఆ పదబంధము నుండి విడదీయఁ బడి యొక యాగమముగా గ్రహింపఁబడిన దని నిశ్చయింపఁ దగియున్నది. ఇట్లు సంధికార్యముగాఁ దలంపఁబడుచున్న యీ యడాగమము ప్రాచీనభాషలోని కొన్ని సంధిగత శబ్దముల సహజస్వరూపమును నాంధ్రమునం దకారాంతములై యున్న

పెక్కు-శబ్దము లితర భాషలలో నెట్లు విభాగము నొందెనో మనకుఁ దెలుపుచున్నది. ప్రాయికముగా ప్రాచీనభాషలోను, తమిళమునను ఐకారాంతములై, కన్నడమున ఎకారాంతములుగను, తెలుఁగున అకారాంతములుగను, కాలక్రమమున మాఱిపోయిన కొన్ని శబ్దముల నిచ్చట నుదాహరించుచున్నాను.

| తమిళము. | కన్నడము. | తెలుఁగు. |
|---|---|---|
| తలై | తలె | తల |
| మలై | మలె | మల |
| వలై | వలె | వల |
| విలై | బెలె | వెల |
| పుగై | హొగె | పొగ |
| నగై | నగె | నగ |
| పగై | పగె | పగ |
| వగై | ... | వగ |
| తొగై | ... | తొగ |
| పిల్లై | పిల్లె | పిల్ల |
| అక్కై | అక్క | అక్క |
| నడై | నడె | నడ |

తమిళమున నైకారాంతములై యున్నంత మాత్రమునఁ బ్రాచీనభాషలోఁగూడ నైకారాంతములై యున్నవని తలంపఁ దగునా ? తెలుఁగునందలి అకారాంతపదమే

ప్రాచీనభాషలోనిదిగా గ్రహించి తమిళ కన్నడము లందలివి దీని రూపాంతరములని చెప్పఁగూడదా యను సందేహము గలుగక మానదు. కాని సావధానముగాఁ బరిశీలించినచో నది యంత సంభావ్యముగాఁ గనఁబడదు. ఏలయనఁగా, అకారము ఎకారముగ నొకభాషలోను, "ఐ" గా మఱియొక భాషలోను మాఱియుండు ననుటకుఁ దగిన ప్రబల ప్రమాణమేమియుఁ గనఁబడుటలేదు. స్వరోచ్చారణ సౌకర్యమును బట్టి ఐ, అఇ, అయిగా నుచ్చరింపఁబడుట సహజము. ఐ అనునది ఇప్పుడు కొంద ఱఱవవా రుచ్చరించుచున్నటుల 'ఎయ్' గాఁగూడ నుచ్చరింపఁబడఁ దగును. కన్నడమునను తరువాతికాలపు వైయాకరణులు తెలుఁగులోవలెనే ఎకారాంతమే శబ్ద మనుకొని దానిని విడదీసి నప్పుడు మిగిలిన "య" కారము సంధివశమున వచ్చిన దని తలంచుటచేతనే, వారును ఎకారాంత శబ్దములపై యడాగమమును విధించియుందురు. ఎకారము తాలవ్యమే యగుటచే ఎకారముపై నజాది శబ్దము నిలిచినపుడు తాలవ్యాంతస్థ ముచ్చారణ సౌకర్యమునకై వచ్చినదని చెప్పినచో నది యుక్తియుక్తముగనే కనఁబడును గావున దీనినిగూర్చి యెట్టి సందేహము గాని చర్చగాని పొడముట కవకాశములేదు. కాని అకారాంత శబ్దములపై యడాగమమంత సహజముగాఁ గనఁబడకపోవుటచే నీ యడాగమ స్వరూపనిరూపణావశ్యకత కలిగినది. మొత్తముమీఁద కంఠ్యవివృత మగు అకారము, తాలవ్యసంవృతమగు ఎకా

రముగాను ఐకారముగాను మాఱిన దనుటకంటెఁ గొన్ని ప్రాచీనభాషాశబ్దముల తుదినిగల ఐకార మొకప్పుడు "అఇ-అయ్ గాను మఱియొకప్పుడు ఎఇ-ఎయ్ గాను నుచ్చరింపఁ బడుటను బట్టి కాలక్రమమున నా మూలభాషనుండి విడిపోయిన కొన్ని భాషలలో "ఎయ్" గాను మఱికొన్నిటిలో అయ్ గను నిలిచినదని తలంచుటయే యుక్తముగాఁ గనఁబడుచున్నది.

మొత్తముమీఁద నే విధమగు సంధికార్యమునకైన నుచ్చారణసౌకర్యమే మూలకారణమై యుండు నని చెప్ప వలసియున్నను, ఆగమరూపసంధి యంతయు నుచ్చారణ సౌకర్యము కొఱకే యేర్పడిన దనుటకు వీలు కనఁబడదు ; కాని యెట్టి సంధిలోనైన నర్థస్ఫురణమునకు మాత్రము భంగము లేకుండ నుండుట యత్యావశ్యకము. కావుననే,-

మేన+అత్త=మేనత్త
చూడక+ఉండెను=చూడకుండెను
వచ్చిరి+అపుడు=వచ్చిరపుడు
వచ్చును+ఇపుడు=వచ్చునిపుడు

అనునిట్టి సందర్భములందు అకార ఇకార ఉకారముల పై నచ్చు నిలిచినపుడు సంధి జరిగినను,-

రాముఁడా+ఎక్కడ=రాముఁడెక్కడ
కొమ్మ+ఇందమనుచు=కొమ్మిందమనుచు
చేసి+ఏగెను=చేసేగెను

హరి+అతఁడు=హరతఁడు
రామున్+అడిగితిని=రామడిగితిని

అను నీ మొదలగు స్థలముల సంధి చేయఁబడుట లేదు. చేసినచో నర్థస్ఫురణ గలుగకుండుటయు పూర్వపదస్వరూపమునకు హాని కలుగుటయు సంభవించును. 'రాముఁడెక్కడ' అనునపుడు 'రాముఁడు' అను ప్రథమాంత శబ్దార్థస్ఫురణమే కలుగుచున్నది గావున రాముఁడు+ఎక్కడ అని విభాగింప వీలగుచున్నది గాని "రాముఁడా" అను సంబోధనాంత శబ్ద స్ఫురణము కలుగుట లేదు. కావున నట్లు విభాగించుట కవకాశము లేదు. అనఁగా "రాముఁడు" అను ప్రథమాంత శబ్దము లోని తుద్ది ఉకారమువలె 'రాముఁడా' యను సంబుధ్యంత మునందలి "ఆ" కారము, హరి యను శబ్దములోని తుది "ఇ" కారము "రామున్" అనునపుడు తుది "న" కారమును, ఆయా శబ్దములనుండి విడఁదీయఁబడుట కవకాశము లేని భాగములె గాని, విడఁదీసినను నర్థమునకు భంగము లేకుండునట్టి యూఁతకొఱకైన ధ్వనులవంటివి కావన్న మాట. కావున నచ్చుపరమగునపు డివి లోపింపవు. అప్పుడు రాముఁడా ఎక్కడ, హరి అతఁడు అని యొక యచ్చుపై మఱియొక యచ్చును పలుకుట వ్యవహార వేగమున కష్టముగాఁ గనఁబడినపుడు, నడుమనొక యకార ముచ్చారణ సౌకర్యమునకై యేర్పడుట తటస్థించినది. ఇదియే యుచ్చారణార్థమై వచ్చి చేరిన యకారము.

ఈ యకార మెట్లుచ్చారణకు సాహాయ్యకారి యగు చున్నది ? పై సందర్భము లన్నిటిలోనుగూడ అనఁగా "హరి యతఁడు" అను దానియందువలె, రాముఁడా యెక్కడ అను నప్పుఁడుగూడ యకారమే సాహాయ్యకారి యగుటకుఁ దగిన పరిస్థితులు కలవా ? యని విచారింపఁదగియున్నది. సామాన్య ముగా రెండు భిన్నములగు నచ్చుల నొకదానివెంబడి మఱి యొకదాని నుచ్చరింప వలసినపుడు, మొదటి దాని నొక విధ మగు ప్రయత్నము చేసి యుచ్చరించిన పిదప, రెండవదాని నుచ్చరించుటకుగా భిన్నప్రయత్నము చేయు సందర్భమున వాచికావయవముల సన్నివేశమును మార్చవలసియుండును. కంఠ్యము, వివృతము నగు అకారము నుచ్చరించిన పిదప, తాలవ్యము, సంవృతము నగు ఇకారము నుచ్చరింపవలసి వచ్చినపుడు అంతకు పూర్వము వివృతములై యున్న వాచి కావయవములు సంవృతత్వముఁజెంది తాలవ్యేకారోచ్చారణ కనుకూల మగు స్థితిలోనికి వచ్చునప్పటికి, మొదటి అకార ధ్వనిని పనిపట్టి యాపివేసి, మరల ఇకారము నుచ్చరించిన నేమోగాని, అకారము తరువాత నికారమును వేగముగా నుచ్చరించు సందర్భమున తాలవ్యాంతస్థంబగు యకారధ్వని సహజముగా బయలుదేఱుట తటస్థించును. ఇది లఘువగు నంతస్థమై అకార ఇకారముల నడుమ నొక సహాయాక్షర ముగా (glide) నేర్పడుచున్నది. దీనినే యశ్రుతి యని చెప్పు దురు. "యశ్రుతి మార్యా లఘు యం ప్రవదంతి ప్రాణతః

పరం ప్రాణం" అని యాంధ్రశబ్ద చింతామణికారుఁడు చెప్పి యున్నాఁడు. ఇట్లు పూర్వపరస్వరములలో నేదో యొకటి యైనను ఇకారము గాని, ఎకారము గాని యైనపుడు, తాలవ్యాంతస్థంబగు నీ "య" కార ముచ్చారణమునకు సహకారియై నడుమఁ జేరుట సహజంబేయగును గాని, మా+ఆవు, నా+ఉంగరము, మొదలగు సందర్భములలో, పూర్వపర స్వరములు రెండును కంఠ్యములో, లేదా కంఠ్యము నోష్ఠ్యమునో యైయున్నపుడుగూడ, వాని నడుమ తాలవ్య యకారమే వచ్చుట విచిత్రముగాఁ దోఁపకపోదు. తాలవ్యస్వర సంబంధ మున్నపుడే గాక యీ భాషలో నే యచ్చులనడుమ నైననుగూడ సంధి జరుగనియపు డెల్ల యకారమె విధింపఁ బడినది. ఓష్ఠ్యవర్ణసాహచర్య మున్నపుడు, వకారముసహాయ వర్ణ మగుట సహజమైనను గ్రాంథికభాషలో ముఖ్యముగా యడాగమమే విధింపబడుచుండుట తటస్థించినది. కాని సామాన్యవ్యవహారమున నుచ్చారణ సౌకర్యమున కనుకూల మగునట్లుగా వకారమే వినఁబడుచున్నది. నా వుంగరము, నా వూరు, సీతవున్నది, అను రూపములే సామాన్యవ్యవహార మున వినవచ్చుచున్నవి. ఇట్టి సంధిస్థలములందే గాక, ఎక్కడ, ఎవరు, ఊరు, ఉండెను, మున్నగు ప్రత్యేక పదముల యుచ్చారణమునందును పదాదిని యకార వకార శ్రుతి కలుగుచునే యున్నది. కాని భాషాలక్షణమున మాత్రము యడాగమమే సామాన్యవిధియగుట సంభవించినది. ఎకారో

కారములు పూర్వమందుగాని పరమందుగాని నిలిచినప్పుడు తత్ స్థానీయములగు తాలవ్యోష్ఠ్యాంతస్థవర్ణము లుచ్చారణమునకు సహాయవర్ణములుగా వచ్చి చేరుట సహజమే. కాని, పూర్వపరస్వరములు రెండును అకారములైనప్పుడును, తత్సమ శబ్దములపైని గూడ యకారము వచ్చుటకుఁగల కారణ ముచ్చారణసౌలభ్యమే యని చెప్పవలనుపడదు. అట్టి సందర్భములలోనెల్లఁ బైని దెలుపఁబడిన విలై మొదలగు ప్రాచీన భాషలోని ఐకారాంత శబ్దముల సంధిగతరూపముల సాదృశ్యముచేతనే యకారము గలిగిన దని తలంపవలసియున్నది. ఇట్లు 'వెలయూలు' మొదలగు వాని సామ్యముచే, 'మాయావు' 'సీతయడిగెను' మొదలగు రూపమున సంధి యేర్పడి యుండును.

ఇఁక నీ భాషలలోఁ బ్రాచీనకాలమున సంహితలోఁ గూడిన రెండకారములకు నడుమ నోష్ఠ్యాంతస్థమగు వకారము గూడ వచ్చుచుండినట్లు కొన్ని సందర్భములనుబట్టి యూహింపఁ దగియున్నది. తమిళ కన్నడములలోని ప్రథమ పురుష స్త్రీ పుం సర్వనామరూపములు, అవళ్, ఇవళ్, అవన్, ఇవన్, మొదలగునవి 'వ' కారమధ్యములై యున్నవి. ఇవి యీ భాషలన్నిటిలోఁగూడ మిగులఁ బ్రాచీనరూపములనుటకు సందేహములేదు. ఇవి నిర్దేశక వాచకములగు, అ, ఇ లకు, అళ్, అన్, ఆళ్ (ఆలు) ఆణ్ అను శబ్దముల సంశ్లిష్టరూపములను జేర్చుటచే నేర్పడినవి. అ+అన్ అని

యుండఁగా అకారముపై యకారమువచ్చి "అయన్" కాక, వకారాగమము వచ్చి "అవన్" అయినది. ఇట్లకారముపై నే కాక ఇకారముపై గూడ వకారమే వచ్చుట విశేషము. ఇ+అన్=ఇవన్, ఇ+అళ్=ఇవళ్, అయినవి. వీనినుండి చిరకాలము క్రిందటనే వాఁడు, (అవన్), వీఁడు, (ఇవన్) మొదలగు రూపములు వర్ణ ప్లుతి (Metathesis) కారణముగా తెలుగున వ్యవహారములోనికి వచ్చినవి. దీనినిబట్టి తెలుఁగున నిర్దేశవాచక మూలరూపములగు అ, ఇ లకుఁ ప్రాధాన్యము పోయి, నడుమ నుచ్చారణవశమున వచ్చిచేరిన వకారమునకుఁ ప్రాధాన్యము కలిగినదని చెప్పవలసియున్నది. కాని తమిళమునఁ గొన్ని సందర్భములలో అనఁగా అ+యాన్నై మొదలగుచోటుల "వ" కారం బాగమంబై అ+వ్+అన్నై=అవ్వాన్నై మొదలగు రూపము లగుచుండుటను బట్టి, అవన్, అవళ్, ఇవన్, ఇవళ్ మొదలగు రూపములలోని తొలిపదం బగు నిర్దేశవాచక మూలరూపము, అకారమాత్రమే కాక "అవ్, ఇవ్" అని వకారాంతమై యుండెనేమో యని సందేహము కలుగక మానదు. అట్లయినచో నీ రూపములలోని వకారం బాగమముగాక పూర్వశబ్దగతమైనదే యనఁదగును. ఈ సర్వనామరూపము లందేగాక యీ వకారాగమము కొన్ని అకారాంత శబ్దములపైగూడఁ గనఁబడుచుండుట పై రూపముల సామ్యముచేఁ గల్గినదని చెప్పవలసియున్నది.

ఉదా:—అల్ల + ఎన్టాన్ = అల్లనెన్టాన్ (కాదని చెప్పెను),
కల్లా+ఇనుడై యు=కల్లానినుడైయ (కుల్లాయియొక్క)
ఆ+ఇన్+ఐ=ఆవినై.

పూర్వపదము తుదిని ఇ, ఈ, ఎ, ఏ, ఐ లున్నచో యడాగమమే వచ్చును.

పులి+అం+తోళ్=పులియంతోళ్
మణి+అదు=మణియదు
తీ+ఆడిట్టు=తీయాడిట్టు
కై+ఇల్=కైయిల్

ఇట్లు అ, ఉ, ఓ లపైని "వ" కారమును, ఇ, ఏ, ఐ ల పైని యకారమును, తమిళమున సహాయాక్షరముగా వచ్చుచున్నవి. కాని అకారముపై వకార ముచ్చారణ సౌకర్యము కారణముగా వచ్చి చేరినదేనా యను విషయము నిశ్చయింప వలనుపడకున్నది.

ఇఁక కన్నడమున నీ సంధి తెలుఁగుసంధినే పోలియున్నదనవచ్చును. తెలుఁగున "సంధి లేనిచో యడాగమం బగు" నని విధించినట్లే కన్నడమునను "యక్ స్వరే స్వరస్య" అని యకారము సామాన్యముగా విధింపఁబడినది.

ఉదా:—జ్యా+ఒళ్=జ్యాయొళ్, ఆ+ఇరవు=ఆయిరవు,
సతి + ఇవళ్ = సతియివళ్, అమరాంగనెయర్,
జో+ఎందు=జోయెందు, పాడిదర్.

తెలుఁగున వలెనే పరమం దే యచ్చున్నను అన్నిటికి యడాగమమే వచ్చునని చెప్పఁబడినను, కన్నడమున పరమం దోష్ఠ్యస్వర మున్నచో వకారము వచ్చునని "ఆత ఓష్ఠ్యే, ఓష్ఠ్యేపరే ఆకారస్య వగ్ భవతి" అను నపవాదసూత్రముచే కర్ణాట శబ్దానుశాసనమున వకార విధానముకూడ చేయఁ బడినది.

ఉదా:—ఆ+ఉదకం=ఆ వుదకం, ఆ+ఊర్=ఆవూర్.

కాని యిది శబ్దమణిదర్పణకారుని మతము కాదు. ఆతని మతమునుబట్టి యడాగమమే తెలుఁగునవలె రావలసి యున్నది. దీనినిబట్టి వ్యవహారమందలి రూపములను శబ్దానుశాసనకారుఁ డంగీకరించిన ట్లగపడుచున్నది.

ఆంధ్రమున నిట్టి సంధి వ్యవహారమునఁ గనఁబడుచునే యున్నను, దాని సాధుత్వమును వైయాకరణు లంగీకరింప లేదు. కావున ఆ యూరు, ఆ యుదకము అనునవే యాంధ్రమున సాధువులైనవి గాని, "ఆ వూరు" మొదలగునవి ప్రయోగార్హములు కాలేదు. మఱియు "ఞావో ర్వక్" అను కర్ణాటక శబ్దానుశాసన సూత్రముచే "ఋవర్ణ ఌవర్ణ ఔకార ఉవర్ణానాం వగ్భవతి స్వరేపరే" అని ఋ, ౠ, ఌ, ౡ, ఔ ఉ, ఊ, వర్ణములకు స్వరము పరమైనపుడు "వ" కారాగమ మగుచున్నది.

కుడు+ఉదు=కుడువుదు కూర్తెయల్లి=ప్రీతితో నియ్య వలయును.

పూ+ఇన=పూవిన=పూవుయొక్క

మను + ఇన = మనువిన మార్గం = మనువుయొక్క మార్గము.

హోణ్ణ్రు వెయాన్ అధ్వరిమై భ్రాతృవెనీం.

మాతృ+ఇం=మాతృవిం=మాతచేత

గో+ఇందం=గోవిందం=గోవుచేత.

"మనువిన, పూవిన, గోవిందం" మొదలగు శబ్దములను తెలుఁగు సంప్రదాయ ప్రకారము విడదీయవలసివచ్చినచో, మనువు+ఇన, పూవు+ఇన, గోవు+ఇందం అని విడఁదీయ వలసియుండును. అనఁగా ప్రాచీన భాషలోని ఉకారాంత శబ్దము లన్నియు 'వు' గాగమముతోఁ లేదా వు వర్ణముతోఁ గూడియే తెలుఁగున ప్రాతిపదికములైన వన్నమాట. కావున సామాన్యముగా ఉకారాంత ఊకారాంత శబ్దములన్నియు, వు, వూవర్ణాంతములై అచ్చుపరమైనపుడు వీనియందలి తుది వర్ణము లోపించి వకారము మాత్రము పై యచ్చుతో నెనయుచుండుటచే, తెలుఁగునను పూవు+ఇన=పూవిన, గోవు+ఇంద=గోవింద, అని సంధిగతరూపములు కన్నడ రూపములతో సమానములే యగుచున్నవి. కన్నడ వైయాకరణు లాంధ్రవైయాకరణులవలె పూవు, గోవులను ప్రాతిపదికలుగా గ్రహించి, వీనికచ్చు పరమైనపుడు నడుమ వచ్చిచేరిన సహాయాక్షరమును సంధ్యక్షరముగా గ్రహించియున్నారు. సామాన్యముగా "ఉ" కార "ఊ" కారాంత

శబ్దములన్నిటిని 'వు' వర్ణాంతములుగ గ్రహించినందువలననే తెలుఁగుభాషలో సంధి గలిగినపుడు వకారాగమమున కావశ్యకము లేకపోయినది. సంస్కృతోకారాంత శబ్దములు తత్సమము లైనపుడు తుదిని వువర్ణమును గ్రహించునవిగాఁ దలంపఁబడుటచే నీ భాషలో నచ్చుపరమైనపుడు "వు" వర్ణముపైనున్న ఉకారము లోపించి, పరస్వరైకాదేశసంధి జరుగుట కవకాశ మేర్పడినది. కాని సంస్కృత శబ్దమునే, అనఁగా తత్సమముగాఁ జేయని శబ్దమునే, అనుకరణాదులందుఁ దెనుఁగునఁ జెప్పవలసి వచ్చినపుడు మాత్రము స్వతస్సిద్ధముగా సంస్కృతశబ్ద ముకారాంతమే యగుటచే నందలి యుకారము లోపించిన నామరూపమునకు నర్థమునకు భంగము కలుగును. గావున నది లోపించి సంధి జరుగుటలేదు. కాని "ఇయం ధేనుః+అనె" అనునది, విసర్గ లోపించిన పిదప "ఇయం ధేనుఅనె" యనికాక నడుమను వుగాగమంబు గలుగుటచే "ఇయం ధేనువనె" అనియే యగుచున్నది. ఇట్టి రూపమును సాధించుటకే బాలవ్యాకరణకారుఁడు "ఉదంతనామంబున కనుకరణంబున వుగాగమం బగు" నని యొక ప్రత్యేక సూత్రమును కల్పింపవలసినవాఁడైనాఁడు. వాస్తవముగా ధేనువు + అది = ధేనువది అన్నపుడును, "ఇయంధేనుః+అనియె=ఇయంధేనువనియె" అన్నపుడును జరిగిన సంధికార్యమొక్కటియే గాని, యా రూపములను సాధించు విషయమున మాత్రము భిన్నపద్ధతు లవలంబింపవలసి వచ్చినది. ధేను

శబ్దము తత్సమమైనపుడు ధేను+ఉ=ధేను+న్+ఉ=ధేనువు అని యగుటకు "ఇయం ధేను సనియె" అన్నపుడు గలిగిన వుగాగమమే కారణము. కాని యాంధ్ర శైయాకరణులు దీనిని గమనింపక 'వు' అనునది ప్రథమావిభక్తి ప్రత్యయ మనియు, దాని కచ్చుపరమైనపు డుకారలోపము గలుగు ననియు చెప్పినారు. దీనినిబట్టి ధేనువు అను తత్సమ శబ్దము లోని తుది ఉకారము 'ధేను' శబ్దములోని ఉకారమువలె సహజముగ శబ్దగతము కాదు గావున లోపించుచున్నదని తెలియుచున్నది.

ఈ వకారాగమము విషయమున మఱియొక విశేషము గమనింపనగును. ఇకార ఎకారములపై మాత్రమే రావలసిన యడాగమము, అకార ఓకారములపైఁగూడ వచ్చుచున్నదే యెట్లని మనము విచారించుచుండ, కన్నడమున కొన్ని సందర్భములలో ఇ, ఈలపై గూడ యడాగమమునకు బదులు వకారాగమమే కలుచున్నది.

"ఇ ఈ ఎంబక్కరంగళనను కరిసి తోరువల్లియుం నడువె వత్వం."

ఉదా:—ఈ విపుగ్రంథంగళ్. ఈ+ఇదు=ఈ విదు.

ఈ విదు గ్రంథం

ఇది నిర్దేశ వాచకముల పైనిమాత్రమే వచ్చుచున్న దగుటచే నీ నిర్దేశ వాచకములు "వ" కారాంతములే యను పక్షమున, నీ వకార మాగమముగాక శబ్దగతమే యగుట

తటస్థించును. మఱియు నీ కన్నడభాషలో అకారముపై యకారమే వచ్చుచున్నను, (cf. తారయిసు—పూరయిసు) కొన్ని ధాతువుల "ఆ" కారమునకు "ఇసు" పరమైనప్పు డర్వాచీనవ్యవహారమున వకారాగమము గలుగుటకూడఁ గలదు. ఉదా : ఓలవిసు, మేళవిసు, తారవిసు, పూరవిసు మొదలైనవి; రావించు, కావించు మొదలగునవి తెలుఁగునను గలవుగదా. "మేళవిసు" అను కన్నడ శబ్దము తెలుఁగున మేళవించు అను రూపముకలదై యున్నది. ఇది గ్రాంథికమే. దీనికి భాషలో మేళగించు, అని గవర్ణసహితరూపాంతర ముండుట విశేషము.

కన్నడమునందు వలెనే తమిళమునఁగూడ సంధిలో అకార ఇకారములపై వకారాగమము విధింపఁబడినది. ఇది నిర్దేశవాచకములపై మాత్రమే వచ్చుచున్నది.

* ఉ. అ+యానై=అవ్యానై
అ+వళై=అవ్వళై,
అ+ఆడై=అవ్వాడై,
ఇ+యానై=ఇవ్యానై,
ఇ+వళై=ఇవ్వళై,

---

* "యవమున్ వరివే వకర మొఱ్ఱుమ్"
"ఉయిల్ మున్ వరినుమ్ ఆయియల్ తిరియాదు"
"చుట్టిన్ ఇయల్కై ముట్ కిళిన్ త్తై."
(తొల్కాప్పియం, ఎళుత్తదిగారం, 206, 207, 239 సూ.)

అకార ఇకారములకు అచ్చు పరమైనపుడే గాక "య" కారము పరమైనపుడుగూడ "వ" కార మాగమం బగుటచే నా నిర్దేశవాచక మూలరూపములు కేవల అకార ఇకార మాత్రములుగాక "అవ్, ఇవ్" అని వకారాంతము లయి యుండునని నిశ్చయింపవలసి నట్లగపడుచున్నది. అట్లే యైనచో అకార ఇకారములపైఁగూడ వకార మాగమంబగుటలో గలుగు చిక్కు తొలఁగుటయేగాక, "అవన్, ఇవన్" మొదలగు సర్వనామ రూపములలో నాగమం బని తలఁపఁ బడుచున్న వకారముకూడ సుసాధితమగును.

ఇట్లే అకారాంత శబ్దములపై గల్గు యడాగమము కూడ నీ భాషలో కాలక్రమమున అకారాంతములుగ మాఱిన ప్రాచీనములగు ఐకారాంత శబ్దములకు సంబంధించిన "అయ్" అనుదానిలోని యకారమే గాని, అనఁగా సహజ ముగ శబ్దగతమేగాని, యుచ్చారణసౌకర్యమునకై చేర్పఁ బడిన యాగమము కాదనియే తలంపవలసియున్నది.

—: ద్రావిడభాషలలోని సంధి—సంస్కృతభాషలోని సంధి :—

ఇట్టి భాషలలో పూర్వపదాంత్యస్వరము పరపదాది స్వరమునకు సన్నిహితమై యుండఁగా నామరూతాధికి హానియు, నర్థమునకు భంగమును కలుగకుండినచో పూర్వస్వరము లోపించి పరస్వర మేకాదేశమగుటయో అనఁగా పరస్వరము పూర్వహల్లుతో నెనయుటయో, అట్టిది తటస్థించని యపుడా రెండు స్వరముల నడుమ నుచ్చారణసౌలభ్యమునకై యొక

సంధ్యక్షర మాగమ మగుట తటస్థించుటయో ప్రధాన మైన సంధికార్యముగాఁ గనఁబడుచున్నది. ఎట్లైనను, పూర్వస్వరము లోపించి వెనుకటి హల్లు ముందుస్వరముతోఁ గలిసినను క్రొత్త హల్లొకటి వచ్చి యది ముందు స్వరముతోఁ జేరినను, ఒక హల్లు తరువాతి యచ్చుతో నెనయుటయే యిచ్చట జరుగు సంధికార్య మనవలసి యున్నది. వర్ణసమీ కరణాది సంధికార్యములు మఱికొన్ని యుండుఁగాక. ఈ సంద ర్భమున సంస్కృతభాషలోని సంధికిని, తెలుఁగు సంధికిని గల భేదమునుగూర్చి యించుక పరిశీలింపవలసి యున్నది. సంస్కృ తమునందలి యేకాదేశసంధి యనఁగా పూర్వాపరస్వరములు రెండును లోపించి వానికి బదులుగా నా రెంటికంటెను భిన్నం బగు నేకాక్షరము వచ్చుట. "అవర్ణాదచిపరే పూర్వపరయో రేకో గుణాదేశః స్యాత్." గంగ+ఉదకం, అని అకారము నకు 'ఉ'కారము పరమైనపుడు "గంగుదకం" అని గాని, లేదా 'గంగయుదకం, గంగవుదకం' అని గాని కాక, పూర్వాపరస్థానీయములగు అకార ఉకారములు రెండును లోపించి వాని స్థానమున "ఓ" కారము వచ్చినది. అట్లే "గచ్ఛ+ఇతి=గచ్ఛేతి" అని అకార ఇకారముల స్థానమున ఏకారము వచ్చినది గాని గచ్ఛితి, గచ్ఛయితి, అని గాని కాలేదు. ఈ విషయమున అనఁగా నీ యేకాదేశసంధి విష యమున ద్రావిడభాషలలోని పద్ధతికి సంస్కృతభాషలోని పద్ధతికి నెట్టి సంబంధము కనఁబడదు. ఈ భాషలలో పూర్వ

స్వరములు లోపించి పరస్వర మేకాదేశం బగుట తటస్థించి నను, పూర్వపరస్వరములు రెండును లోపించి, యా రెంటికిని భిన్నమగు నచ్చు రెంటి స్థానము నాక్రమించుట వీనిలో గానరాదు. సంస్కృతములోని పరరూపసంధి తెలుఁగులో కనఁబడుచున్నను తక్కిన విషయములలో ననఁగా యడాగమ గుణసంధ్యాదులలో చాల వ్యత్యాసముకలదు. ఇది సంధిని గురించిన దగుటచే నల్పవిషయంబే యైనను, నిది యా యా భాష లీ సందర్భమున నవలంబించు పద్ధతులు భిన్నములై యుండుటను వ్యక్తము చేయుచున్నదనుటకు సందేహములేదు. ద్రావిడభాషలలోని పద్ధతి స్వాభావికంబై యుండుటచే నది వీని ప్రాచీనతనుగూడ సూచించుచున్న దానివలె నున్నది.

సంస్కృతమున అకారమున కకారమే పరమైనను ఇకార, ఉకారముల కవియే పరమైనను, ఆ రెంటి స్థానమునను నొక్క దీర్ఘస్వరమే యేకాదేశమగుచున్నది. ఇదియు ద్రావిడ భాషలోని సంప్రదాయమునకు భిన్నంబై యున్నది. ఈ భాషలలో అ ఇ ఉ ల కవియే పరమగునపుడు పూర్వస్వరము లోపించి పరస్వర మేకాదేశం బగుటయో, లేదా నడుమ నుచ్చారణమునకు సహాయకారియగు హల్లొక టాగమ మగుటయో సంభవించునేగాని, రెండు హ్రస్వాచ్చులును కలిసి దీర్ఘాచ్చుగా మాఱుట సంభవింపనేరదు. ఏ యచ్చున కే యచ్చు పరమైనను పరస్వరైకాదేశసంధి తప్ప మఱియొక

విధమగు సంధియే యీ భాషలలో లేదు. కాని సంస్కృత మున పూర్వపరస్వరముల భేదమునుబట్టి సంధిస్వరూపమును మాఱుచున్నది. అ, ఇ, ఉ ల కవియె పరమైనచో దీర్ఘైకాదేశ సంధి; అకారమునకు ఇ, ఉ లు పరమైనచో గుణ సంధి ; ఎ, ఐ లు పరమైనచో వృద్ధిసంధి; ఇ, ఉ లకు భిన్నాచ్చు పరమైనచో యణాదేశసంధి. ఇకారమునకు భిన్నాచ్చు పరమగు నప్పుడు గలుగు యణాదేశసంధికిని ద్రావిడభాషలలోని యడాగమమునకునుగూడ నెట్టి సామ్యము లేదు. ఏలయనఁగా సంస్కృతమున యకారము పూర్వస్వర మగు 'ఇ'కారమున కాదేశమై వచ్చినది. తెలుఁగునందన్ననో యకారమాగమమై వచ్చినది. కావున సుధీ + ఉపాస్యః = సుధ్యుపాస్యః, అని కాఁగా తెలుఁగున చేసి+ఉండెను = చేసియుండెను అని యగునే గాని 'ఇ' కారమునకు లోపము వచ్చి 'చేస్యుండెను' అని యగుట లేదు. ఇక ఉకారమునకు వకారాదేశము సంస్కృతమున వచ్చుచుండఁగా, తెనుఁగున నా వకారమాగమముగా నైనను రాక, పూర్వమందలి ఉకారము సర్వత్ర లోపించుచుండుటచే పరస్వరాదేశమే కలుగుచున్నది. కావుననే ఈ భాషలలో, ముఖ్యముగా తెలుఁగునందు, ఉకార సంధి నిత్యసంధి యగుచున్నది. మధు+అరిః=మధ్వరిః అయినట్లుగా రాముడు+అతఁడు = "రాముఁడ్వతఁడు" అని కాదు సరేగదా రాముఁడు యతఁడు అనియుగూడ కానేరదు. ఉకారాంత సంస్కృత శబ్దముల యను

కరణ సందర్భమునందైనను వకార మాగమముగా వచ్చు చున్నది గాని యాదేశముగా రాదు. "ఇయం ధేనువనె" యగునేకాని "ఇయం ధేన్వనె" యనికాదు. ఇంక ఏ, ఐ, ఓ, ఔ ల కచ్చుపరమగునప్పుడు కలుగు 'అయవాయావసంధి' గాని, పూర్వరూపసంధిగాని ద్రావిడభాషలలో లేదు. ఇచ్చట ఇకార ఉకారములకువలెనే ఏ ఐ లకును, ఓ ఔ లకును గూడ పరరూపసంధి జరుగుటయో లేక యకార వకారాగమము కలుగుటయో సంభవించును. సామాన్య ముగా నాంధ్రమున ఐ, ఓ, ఔ లు అంతమందుగల శబ్దములు విశేషముగా లేకుండుటచే, స్వరసంధియంతయు అ, ఇ, ఉ లకు సంబంధించిన దనియె చెప్పనగును. హలంత శబ్దములను ద్రుతప్రకృతికములును తప్ప, తక్కినవి విశేషముగా లేకుండు టచే, హల్సంధి విశేషములను వర్ణసమీకరణమునకు సంబం ధించినవి తక్క నితరములంతగా లేవనియే చెప్పవచ్చును. దీనినిబట్టి ద్రావిడభాషలలోని సంధివిధానమునకును, సం స్కృత భాషలోని సంధివిధానమునకును సంబంధ మేమాత్ర మును లేనట్లగపడుచుండుటేగాక, యివి భిన్నపద్ధతుల ననుస రించి బయలుదేరినట్లుకూడ తోచెడిని.



# లోపసంధి

## — పదాంత్యవర్ణలోపము —

సంహితలో నామరూపహానియు దానిమూలమున నర్థహానియుఁ గలుగకుండ నుచ్చారణ సౌకర్యమునకుఁ దోడ్పడుటయే సంధివిధానమువలనఁ గలుగు ప్రయోజన మగుటచే, నీ భాషలో పదాంతమున నిలుచు నచ్చులలోఁ బ్రధానములైన అకార, ఇకార, ఉకారము లెట్టి పరిస్థితులలో లోపించుట కటస్థించునో, లోపింపనియప్పు డేయే సందర్భములం దెట్టి యాగమాదు లుచ్చారణమున కెట్లు సహాయకారులై కలుగుచున్నవో యను విషయము నించుక పరిశీలింతము.

ఈ భాషలో ఏ, ఓ, వర్ణము లంతమందుగల శబ్దములు చాల తక్కువ యగుటచేతను, పదాంతమం దవి లోపింపకుండుటవలన, సంధిలేనిచో యడాగమంబు వచ్చు ననను నియమమును బట్టి వానిపై యడాగమము కలుగుచుండుటచేతను, వీనినిగూర్చి వైయాకరణులు విశేషముగా నెత్తుకొననేలేదు. ఇఁక అ, ఇ, ఉ ల విషయమున, అకారమునకు సంధి బహుళ మనియు, ఇకారమునకు వికల్ప మనియు, ఉకారమునకు నిత్యమనియు వైయాకరణులు చెప్పుచున్నారు. దీనినిబట్టి తెలియున దేమనఁగా నీ భాషలో నుకారాంతములైయున్న శబ్దములన్నిటిలోఁగూడ తుది యుకారము లోపించినను శబ్దరూఢికి గాని యర్థమునకుగాని భంగమే

మాత్రము కలుగఁబోదనియు, అకారేకారాంత శబ్దముల తుది యచ్చులు లోపించి సంధి జరిగినచో నొకప్పుడు అర్థమునకు భంగము కలుగుచున్న దనియు నై యున్నది. నెల+అలు, సీత+ఇచ్చుట, రాముడు+ఎక్కడ, హరి+ఉండెను, చేసి+ ఏగెను మొదలగు సందర్భముల తుది హల్లు లోపించి సంధి జరిగినచో నర్థస్ఫురణము విషయమునఁ గలుగు చిక్కును గూర్చి యింతకు పూర్వమే తెలిసికొని యున్నాము. అనఁగా నీ పదములలోని తుదిహల్లులు లోపించినచో నర్థప్రతీతికి భంగము కలుగుచున్న దన్నమాట. కావుననే ముఖ్యముగా "స్త్రీవాచక తత్సమ సంబోధనాంత శబ్దముల అకారమునకు సంధిలేదు," అనఁగా నది లోపింపదు, అని చెప్పఁబడినది. తెనుఁగులో అకారాంతములైన తత్సమ శబ్దములు గంగ, దూత మొదలగునవి సంస్కృతమందే అకారాంతములై యుండుటచే, వాని తుదియకార మచ్చట నిలిచినగాని శబ్దస్వ రూపము తెలియదు. అట్లే నెలత, కొమ్మ, మొదలగు స్త్రీ వాచక దేశ్య శబ్దములలోగూడ తుది అకార మీ భాషలో సహజముగ శబ్దగత మగుటచే నది లోపించినచో నర్థస్ఫురణ కలుగకున్నది. సంబోధనాంత శబ్దముల తుది యచ్చుకూడ, ప్రత్యేకార్థమున వచ్చినదే యగుటచే నది లోపించిన నా యర్థమునకే భంగము కలుగునుగదా.

ఇఁక మేన+అత్త అనునపుడు సంధివికల్పము. అనఁగా మేనలోని తుది "అ" కారము లోపించినను అర్థమునకు

భంగము లేదన్నమాట. దీనినిబట్టి మొదట లోపింపకుండిన రూపమే కలదనియు, కొంతకాలమున కకారము లోపించి సంధి కలిగినను అర్థభంగము కలుగకుండుటచే నీ రూపము గూడ సాధువైన దనియు నూహింపవచ్చును. ఈ శబ్దము హలంతమేయైనచో అకారము లోపించని రూపము భాషలోఁ గలుగుట కవకాశముండదు. మేను సంబంధము గలిగిన యత్త, మేనయత్త గావున (మేను+అ) మేనలోని "అ" కారము విశేషణార్థబోధక మగుటచే లోపింపదు. కాని యిప్పుడు మేనత్త అని సంధికలిగిన రూపమే మేనయత్త అనుదానికంటె వ్యవహారప్రాచుర్యముగలదై, భాషలో నొక విధముగ స్థిర పడినట్లగపడుటచే, నీ కాలమున నీ పదములకు సంధి జరుగునని చెప్పవలసి నక్లేర్పడు చున్నది. మఱికొన్ని సందర్భములలోఁ గొందఱు వైయాకరణు లిట్లు విధించియే యున్నారు. అకారంబునకు "ఆకు, అంత, అయ్య, అమ్మ, అప్ప, అక్క, అన్న, మున్నగు శబ్దములు పరమైనపుడు సంధి నిత్య మని కొందఱి మతము. అనఁగా చింతాకు, ఆవంత, సుబ్బయ్య, సుబ్బమ్మ, కామప్ప మొదలగు శబ్దములలో యడాగమమురాక సంధిగలిగిన రూపములకే ప్రాధాన్యమేర్పడిన దనుట. ఇవి సామాన్యముగా సంజ్ఞావాచకము లగుటచే వీనిలోని అయ్య, అన్న, అక్క మొదలగునవి స్వీయార్థమును గోలుపోయి ముందటి పదములతో గలిసి లింగ భేదమును మాత్రమే సూచించునవై భాషలో చిరకాలము

క్రిందటనే స్థిరపడిన వగుటవలన, సంధిజరుగక యడాగమము వచ్చిన రూపములు క్రమముగా నంతరించిపోయినవి. "మీ మేనయత్త వచ్చినదా" యని నిత్యవ్యవహారమున మన మిప్పు డెట్లనమో, యట్లే "చింతయాకు చెట్టునుండి రాలినది" అనియు నీ కాలమునం దనము. కాని యీరూపము లోక కాలమున వాడుకలో లేకపోలేదు. ప్రాచీన కవులు కొందఱు వాడియేయున్నారు. "పాటింతురెవ్వద్దలు తద్దనమ్మి నుయిదాటే వానికిం జింతయాకంతైనన్" (పాండు. మాహా.) ఇట్లె ఆవ యంత మొదలగు రూపములుకూడ నొక కాలమున వ్యవహారమున నున్నవేకాని యిచ్చట సంహితలో రెండు పదములును గలిసి కించిత్ పరిమాణముగల, చింతాకంత అను నొక ప్రత్యేకార్థమును బోధించునవై సంజ్ఞావాచకములుగా వ్యవహారబాహుళ్యముకలవైన పిదప ఆవ అంత (ఆవగింజయంత) చింత ఆకు (చింతచెట్టుయొక్క ఆకు) అని రెండు పదములను విడిగా సూచింపవలసిన యావశ్యకతయు తగ్గుటచే ఆవంత, చింతాకు, అను సంధి గలిగిన పదములే వాడుకలో స్థిరపడి యుండును.

తన హృద్గతములగు భావముల నెదుటివానికి బోధ పఱచుటయే భాషను ప్రయోగించుటలో మానవుని ముఖ్యోద్దేశము గావున, తానా యుద్దేశ మెంత లఘుతరం బగు ప్రయత్నముచే సాధింపగలిగిన నంతధన్యునిగాఁ దలంచికొని యనవరతము నట్టి ప్రయత్నలాఘవముకొఱకు ఫలాధిక్యసం

పాదన కొఱకునే యత్నించుచుండును. మానవుఁ డెల్లప్పుడు నల్పతర ప్రయత్నముచే నధికతరఫలమును సాధించుటకై యత్నించుచుండునను విషయమే—అనఁగా మానవుని సౌకర్యాపేక్షయే(love of ease) భాషలోఁ గలుగుచుండుమార్పులకు ముఖ్య కారణములలో నొకటై యున్నది, ఇదియే తాను చెప్పఁదలఁచిన భావము నెంత లఘుతరంబగు ప్రయత్నముచే సులభముగా నల్పకాలములో నితరులకు బోధపడునట్లు చేయ గలఁడో అంత సులభముగఁ జేయుటకుఁ దగిన మార్గములను వెదకుట కాతని ననవరతము హెచ్చరించుచుఁ దత్సాధకమగు వేగోచ్చారణమునకై యాతనిని ప్రోద్బలము చేయుచుండును. వెనుక పరిస్ఫుటముగా, వ్యక్తముగా, సావకాశముగా నుచ్చరించినగాని బోధపడని శబ్దములు, వాక్యములు, అలవాటును బట్టియు, ననవరత శ్రవణమునుబట్టియు, వేగోచ్చారణమందును వినువానికి బోధపడుచునే యుండును. మఱికొంత కాలమున కీ వేగోచ్చారణమున కలవాటుపడిన వారు నడుమ కొన్ని యక్షరములు లోపించినను, వ్యక్తముగా నన్ని యక్షరములు పలుకఁబడక పోయిననుగూడ నా వాక్యార్థమును గ్రహింపగలుగు స్థితిలోనికి వత్తురు. తాను చెప్పఁదలఁచిన భావమును వ్యక్తముచేయు పదములు నక్షరములన్నియు స్పష్టముగా పలుకఁబడకపోయినను, తన భావము నితరులు గ్రహింపఁగలుగుచున్నారను విషయము వక్తకుఁ దెలిసినతోడనే, సహజముగ సౌకర్యకాంక్షియగు నాతఁ

డప్పటినుండియు నా యక్షరముల నన్నిటి నుచ్చరింప యత్నింపనే యత్నింపఁడు. ఈ కారణముచేతనే పదముల నడుమను, వాక్యముల నడుమను గల యక్షరములు కొన్ని—ముఖ్యముగా నూది పలుకవలసిన యావశ్యకత లేనివి—కాల క్రమమున నంతరించుటయు, నా పూర్వపదములు, తగువాఁతి వారు గుర్తుపట్ట లేనంతగా మాఱిపోవుటయు సంభవించు చుండును. "వేగముగా రమ్ము," అను వాక్యము ద్రుతతరో చ్చారణమున మొదట "వేగంగా రా" అనియు పిదప "వేగంరా" అనియు "వేన్ రా" అనియు నగుచున్నది. "వేరా" యనియుకూడఁ గావచ్చును. గ్రీకు లాటిన్ భాషల లోని, Eleemosyne అను పద మాంగ్ల భాషలోనికి వచ్చు సరికి 'alms' అను పదముగా మాఱుటకుఁ గారణమిదియే. Cup-board, ship-board అను పదములు కబోర్డు, షిబోర్డ్ అని పలుకఁబడుచునే యున్నవిగదా. Is not, can not, do not మొదలగునవి వ్యవహారవేగమువలననేగదా, isn't, can't, don't అని పలుకఁబడుచు, వ్రాతలోనికిఁ గూడ నెక్కి శిష్టజనాంగీకారమును బడయుచున్నవి.

ఇట్లే ద్రుతతరోచ్చారణము కారణముగా భాషలో బయలుదేరి వ్యవహార బాహుళ్యముచే నర్థస్ఫురణమునకు భంగము కలుగని సందర్భములలోను, సుప్రసిద్ధుఁడగు మహా కవి యొకఁడు తాను గడించిన నిరంకుశత్వబలముచేతనో ఛందస్సౌకర్యమునకో యెప్పుడైనను బ్రయోగించుటు లేట

స్థించినప్పుడును గూడఁ గొన్ని సంధులు ప్రత్యేకముగాఁ గొన్ని పదముల విషయమునమాత్రమే భాషలోఁ గానవచ్చుచుండు టయుఁ గలుగును. చింతాకు, ఆవంత, సుబ్బయ్య మొదలగు పదబంధములు వ్యవహారబాహుళ్యముచే గలుగు వేగోచ్చా రణమునఁ జిరకాలము క్రిందటనె భాషలో చేర్పడినవి. మేనత్త, మేనయత్త అను రూపములు రెండును ప్రచార ములోనున్నను, రెండవదానికంటె మొదటిదె వ్యవహార బాహుళ్యము కలదగుటచే కొద్ది కాలమునకె యిదియు నిత్య సంధి గలదిగాఁ దలంపఁబడుచున్న పై శబ్దముల తెగలోఁ జేరవలసినదే యగును.

ఇఁక స్త్రీవాచక తత్సమ సంబోధనాంత శబ్దముల విషయమున వీని తుదియచ్చు ప్రత్యేకార్థబోధకం బగుచుం డుటచే, నది లోపించినచో నర్థమునకు భంగముకలుగును గావున నట్టి సందర్భముల సామాన్యముగా సంధి జరుగుట లేదు. కావుననే వైయాకరణులుగూడ నట్టి సంధిని నిషే ధించిరి. "రాముఁడ ఇటురమ్ము" అను నప్పుడు సంధి జరిగి నచో సంబుద్ధ్యర్థ మేమాత్రమును బోధపడకయేపోవును. తత్సమ ఆకార సంధిలోను నిట్టి చిక్కు లేకపోలేదు. అట్లయ్యును "గంగనుకాపె, చేష్టుడిగె, రంగభర్తంచు" అను కొన్ని స్థల ములలో తత్సమాకారసంధిని నిరంకుశులగు కవులు చేసియే యున్నారు. అర్థముకాని పదమును, లేదా పదసంధిని వీరు మాత్ర మేల ప్రయోగించినారను విషయమును విచారింప

వలసి యున్నది. "గంగను కాసె" యన్నప్పుడు "గంగను" అనునది ద్వితీయాంతశబ్దమను భ్రమ కలుగుట కవకాశము గలుగుటచే, "గంగయనునట్టి" యను నర్థము స్ఫురించు విషయమున చిక్కు కలుగుచున్నను, వ్యవహారమున నీ సంధిగత రూపము వ్యాప్తిగాంచి యుండుటచే నొకానొక కవి తన నిరంకుశత్వబలముచే పూర్వలక్షణరూపశాసనము నతిక్రమించి యీ రూపమును శిష్టకవితలోఁ బ్రయోగింపఁగలిగినాఁడు. పూర్వలక్షణమునుబట్టి లాక్షణికులు కొందఱీ రూపము దుష్టమే యని పరిహరించినను, వ్యవహారమునఁ బ్రసిద్ధమైయుండి యొక ప్రసిద్ధకవిచే నాదరింపఁబడి యుండుటను బట్టి, యీ రూపమునకును సాధుత్వము కలిగి కాలక్రమమున దానికి లక్షణమేర్పడును. వ్యవహారమునఁగూడ లేని క్రొత్త రూపము నెంత ప్రసిద్ధుఁడైన కవియైనను స్వయముగఁ గల్పించుననుట సంభావ్యముకాదు. ఒకవేళ నొకఁడు తన నిరంకుశత్వమునే చాటుకొనుట కట్లు చేసినచో నా రూపము వ్యవహారవిరుద్ధమగుటచే నా భాషలో ప్రచారములోనికి వచ్చుటగాని దానికి లక్షణమేర్పడుటగాని దుర్లభమే యగు ననుటకు సందేహములేదు.

— అర్థస్ఫురణమునకు సహకారులు, స్వరము, ఊనిక —

"గంగను కాసె" మొదలగు రూపముల కర్థస్ఫురణము విషయమున చిక్కు గలుగుచున్న దని చెప్పఁబడెను గదా. అట్లర్థమే స్పష్టముగాని రూపము భాషలో వ్యవహార

మున మాత్రము వ్యాప్తిగాంచు టెట్లను ప్రశ్న బయలు దేరకమానదు. ఒక భాషయొక్క వ్యావహారికరూపము నకును, గ్రాంథిక రూపమునకును గొంత భేదము లేకపోలేదు. వ్యవహారము ముఖ్యముగా ధ్వన్యాత్మక మగుటచే నీధ్వన్యాత్మక శబ్దముయొక్క అర్థస్ఫురణమునకు సాహాయ్యకారులగు సాధనములు ఊనిక (Emphasis) స్వరము (accent) మొదలగునవి కొన్ని దీనికి ప్రత్యేకముగాఁగలవు. వీని సాహాయ్యమున వ్యావహారికభాష, గ్రాంథికము వ్యక్తపఱుపలేని విషయములను, భావచ్ఛాయలను గొన్నిటిని విశేషముగాఁ దెలుపఁ గలుగుచుండును. ఇవి యన్నియు గ్రంథస్థములగుట తఱచుగా సంభవింపదు. ఒక కాలమున సంభవించుట తటస్థించినను, వ్యవహారభాష జీవద్భాష యగుటచే, మరల కొలఁది కాలముననే క్రొత్తమార్గములను ద్రొక్కుచుండును. కావుననే వాస్తవముగా నేదోయొక కాలమునందలి వ్యవహారము ననుసరించియే యా యా కాలములందలి గ్రంథములు రచింపబడుటయు, గ్రంథస్థభాష యేర్పడుటయుఁ దటస్థించినను, ఎప్పటికప్పుడే యీ గ్రంథస్థ భాషకంటె వ్యవహారమందున్న భాష ముందు పరుగులిడుచుండుటచే, నీ రెండింటికిని కొంత భేదమేర్పడుట తటస్థించుచున్నది. దాని నందుకొనుటకై, అందుకొని దానితోడి చేరికను సంపాదించుకొని యభిన్నత్వమును బడయుటకై, యీ గ్రాంథికభాష దాని యడుగుల జాడలనే పడి తానును ముందునకుఁబోవ యత్నిం

చుచుఁ దన వెనుకటి ప్రామాణికత్వమును విడువకయే తా నా వ్యవహారప్రసిద్ధములగు నూతన రూపములను గ్రహించి వానికి ప్రామాణికత్వము సిద్ధింపఁ జేయుచుఁ దానును నూతన సంస్కారములను బొంది నవ్యస్వరూపమును గాంచు చుండును. లేనిచో నది యట్లు ముందుకు నడువనిచో "ప్రాత వడ్డమాటలై, రసభంగము చేయుచు నే పోలమునుగాని యట్టి క్రమముం బొందినదగు" నేమో యనియు, కవులు తనను జేపట్టుట "జరద్వధూవిషయ సంగరసరసికతను బోలు నని" తలంచి పరిహరింతు రేమో యనియుఁ గొంత భయము దానికిని గలదు. కావుననే వ్యవహారప్రసిద్ధము లగు నూతన రూపము లా యా కాలముల కవుల రచనాప్రాగల్భ్యము నండగాఁ జేసికొని యింతకుఁ బూర్వమే ప్రామాణికత్వమును బడసిన గ్రాంథికభాషలోఁ జేరి తాము ను బ్రామాణికత్వ మును బడయుచుండును. ఈ రీతిగా నొక కాలమున భాషలో వ్యవహారమందే లేకపోయినను, కాలక్రమమున జనుల యుచ్చారణమునందలి వేగమునుబట్టి వ్యవహారములోనికి వచ్చి, సామాన్యవ్యవహారప్రసిద్ధములై వ్యాప్తి గాంచుటచే, తరువాతి కాలమున నొకప్పుడు గ్రాంథిక భాషలోని కెక్కిన రూపములలో జేరినవే యీ "గంగనుకాసె" "చేష్టుడిగె" మొదలగునవి.

గ్రాంథికభాషలో నర్థస్ఫురణమున కడ్డుపడుచున్న వని చెప్పఁబడిన యీ రూపములకు వ్యవహారమున మాత్ర

మెట్లర్థస్ఫురణ గలుగుట తటస్థించినదను ప్రశ్నకు సమాధాన ముగా వ్యవహారభాషకు స్వరము (accent) ఊనిక (emphasis) అను వాని సహాయము కలదని యీవరకే సూచింపఁబడినది గదా. ఇట్లు స్వర మనున దొకటికలదని సామాన్యముగా మాటలాడునప్పుడు మనము గుర్తింపము గాని, యది యెల్ల ప్పుడు మన యుచ్చారణ ననుసరించియే యుండి మనకుఁ దెలియకుండగనే మన ముచ్చరించు ధ్వనులయందు విచిత్ర ములగు మార్పులను కలుగఁజేయుచుండును. వ్యవహారమం దున్న భాష కాలక్రమమున మారిపోవుచుండుటకుఁ గల ముఖ్యకారణములలో నిదియు నొకటి. నాలుగైదక్షరములు గల పదమున గాని, నాలుగైదు పదములతోఁగూడిన యొక వాక్యములోఁ గాని యొక యక్షరముపై లేదా పదముపై నూఁత (emphasis) పడి యా యక్షరము లేదా పదము మాత్రమే యూఁది బలుకఁ బడినప్పుడా పదములోని తక్కిన యక్షరములు, లేదా యా వాక్యములోని తక్కిన పదములు కొంతవఱకు తేల్చి పలుకఁ బడుటయు, నట్లు తేల్చి పలుకఁ బడినవి కాలక్రమమున నుచ్చారణమున జాఱవిడువఁబడుట యుఁగూడ తటస్థించును. సౌకర్యకాముఁడగు మానవుఁడు తన భావము నితరులకు వ్యక్తపఱచుట నెప్పటి కప్పు డల్ప తరంబగు ప్రయత్నముచే సాధింపయత్నించుచుండును గావున నెట్లయినను దన భావ మితరులు గ్రహింపఁగలుగుదు రను నమ్మకము గలిగినచో నూఁదిపలుక నవసరములేని యక్షరము

లను, పదములను క్రమముగా జాఱవిడుచు మొదలిడును. కావుననే పెక్కక్షరములతోఁ గూడిన పదము కాలక్రమమున నల్పాక్షరములతోఁగూడిన దగుటయు, రెండుమూడు పదములతోఁగూడిన వాక్య మర్థమునుబట్టి యొక్కపదముగా గ్రహింపఁబడుటయు తటస్థించినపుడా పదములకుఁ బ్రత్యేకముగాఁ గల స్వరము పోయి, యా పదసమూహమునకు నొక్క స్వర మేర్పడుటచే, నా భిన్న పదములలోని ప్రత్యేక ధ్వనుల ప్రాధాన్య మంతరించి, వానిలోఁ గొన్ని జాఱిపోవుటయు, నందువలన నా పద స్వరూపము మాఱిపోవుటయుఁ దటస్థించును. వెనుకఁ జూపిన యుదాహరణములే దీనికివి లక్ష్యములగును. అలసతవలనను, సౌకర్యాపేక్షచేతను మానవుఁ డల్పతరప్రయత్నమూలక మగు నుచ్చారణవేగముచే కొన్ని ధ్వనులను జాఱవిడుచు సందర్భమున నెట్టివానిని విడువఁగలడు అను ప్రశ్నమున కీ స్వరమును గూర్చిన విచారణము కొంత సమాధానమును జెప్పుచున్నది. అనఁగా నొక శబ్దమునఁగాని వాక్యమునఁగాని ప్రాధాన్యమును వహించిన వగుటచే నూఁది పలుకవలసిన ధ్వనులను జాగరూకతతోఁ బలుకుచుఁ దక్కినవానిలో మిగుల నప్రధానములగుటచే నేమాత్రము నూఁది పలుకవలసిన యావశ్యకత లేని ధ్వనులను జాఱవిడుచుచుండు నని మనము గ్రహింపఁదగి యున్నది. కావుననే ఇంగ్లీషుభాషలో 'man-like' అను రెండు పదములు ప్రత్యేకస్వరములతోఁ గూడినవి, కలిపి యుచ్చరింపఁ

బడునప్పుడు, రెండవదానిమీఁద స్వర మప్రధాన మగుటచే, తుదినున్న 'ke' అను కకారధ్వని లోపించి 'manly' అను నొక్క పదముగా మాఱిపోయినది. Can not 'can't' 'is not-isn't మొదలగు సంక్షిప్తరూపములు గలుగుటకుఁ గల కారణ మీ యూఁత మొదటి పదమునందలి మొదటి యక్షరముపైఁబడి రెండవ పదమందలిది తేల్చి పలుకబడుటయే యైయున్నది. తెలుఁగున పెక్కుచోట్ల పదమధ్యవర్ణములు లోపించి ద్విరూప్యము సిద్ధించుటకుఁగూడ నిదియే కారణము. ఉదా.—

చేసికొనుము—చేసికో, చేస్కో
కలవాఁడవు—కలాఁడవు—కలవు
ఇట్టివారేమి—ఇట్టిరేమి—ఇట్టిరే
చిలుక—చిల్క ; ములికి—ముల్కి
పెరుగు—పెర్గు ; కానుక—కాన్క
కలిమి—కల్మి, తాలిమి—తాల్మి
ఎదురుచు—ఎద్రుచు, అబ్బురము—అబ్రము
తోడుకొని—తోడ్కొని, తోకొని
అక్కడ—ఆడ, ఇక్కడ—ఈడ
ఇప్పుడు—ఇప్డు ; చప్పుడు—చప్డు
కప్పురపు దుమారము=కప్రపు దుమారము
ఉంగరము—ఉంగ్రము
మున్ను+నాళ్—మున్నాళ్—మొన్న
అక్కడను వెళ్లుచున్నాడను—అడ కెళుతున్నా

ఇట్లుచ్చారణవేగవశమునఁ గొన్ని ధ్వనులు లోపించుట వ్యవహారములో నున్న భాషావిషయమున జరుగును గాని, గ్రంథస్థమగు భాష కట్టి మార్పు గలుగుట కవకాశమే లేదుగదా. కావుననే వ్యవహారములో నున్న భాష యనవరతము మార్పులకు లోనగుచు కాలముతోపాటు ముందుకుఁ బోవుచుండ, గ్రంథస్థమగు భాష వెనుకవెనుకల బడుచు నెమ్మదిగా దానితో జరుగుచుండు నని చెప్పఁబడినది.

ఈ స్వర మనునది రెండు విధములు గలది. ఉదాత్తాది భేదములతోఁ గూడిన దొకటి. దీనినే 'pitch accent' అని యందురు. ధ్వని బయలుదేరు నపుడు కంపమును జెందు నాదతంతువుల (vocal chords) కంపమునందలి వేగమును బట్టి ఉదాత్తాది భేదము లేర్పడుచున్నవి. ఆ నాదతంతువుల కంపముయొక్క వైశాల్యమును బట్టి (amplitude) లేదా బలమును బట్టి నిర్ణయింపఁబడునది ఊనిక. దీనినే stress accent అని యందురు. ఉదాత్తాది స్వరములు వేదభాషలోఁ బ్రసిద్ధములై యుండె ననుట సర్వవిదితమే. ఈ స్వరము (pitch accent) మూలముగనే వేదభాషావర్ణము లెంత కాలమైన నెట్టి మార్పును బొందక ప్రాచీనస్థితినే నిలుపుకొనుట కవకాశము కలిగినది. ఊనిక (stress accent) వలన నన్ననో దీనికి విరుద్ధంబగు ఫల మేర్పడును. ఏలయనఁగా నొక పదమందుగాని వాక్యమందు గాని యొకధ్వని యూఁది పలుకఁబడినతోడనే, తక్కినవానికిఁ బ్రాధాన్యము తగ్గుటయు,

నుచ్చారణ వేగముచే నవి జారిపోవుటయు, నిది కారణముగా రూపాంతరము లేర్పడుటయు సిద్ధించుచుండును.

కాఁగా ప్రస్తుత మీ ద్రావిడభాషలలో, నూనికయే ప్రాధాన్యమును వహించుటయు నిది సామాన్యముగాఁ బదము తొలియచ్చుమీఁదనే పడుచుండుటయుఁ దటస్థించుటచే గంగ+అను, చేష్ట+ఉడిగె అను పదములకుఁ జేరికగలిగినపుడు, వానిలోని ప్రతిశబ్దమునందు మొదటి యచ్చుపై నూనిక (stress accent) పడుచున్నది. మొదటిపదము రెండవదానితోఁ గలిసినను, నిది యుచ్చారణము కొఱకైన సంధియే గాని యా శబ్దములకు గల సంబంధములో నెట్టి మార్పును గలుగలేదు. గావున, నా రెండు పదముల తొలియచ్చుమీఁది యూనిక యట్లే యుండును. అపుడు "గంగ"+"అను" అనునవి "గంగను" అను నొక పదముగా నుచ్చారణ వేగముచే నేర్పడినను, మొదటి "అ" కారముపై తొలి పదమందలి యూతయు రెండవ గకారముపై నున్న అకారముపై రెండవ పదమందలి యూతయు ప్రత్యేకముగా నుచ్చారణమున సూచింపఁబడుచునే యుండుటవలన నవి భిన్న శబ్దము లనియే సూచింపఁబడుచుండును. కావున నర్థస్ఫురణమునఁ జిక్కుగలుగుట కవకాశము లేదు. లేనిచో "గంగయను" అన్నగాని యర్థము కాకపోవును. ఇఁక ద్వితీయావిభక్తి రూపమగు "గంగను" అనున దొక్కటే పదమగుటచే మొదటి గ కారముమీఁదనే యూత పడును గాని

రెండవ గకారముపై నుండదు. ఇట్లుచ్చారణములోని యూని కను బట్టి గంగ ను (గంగ+అను) అనుదానికిని, గంగను (గంగ+ను) అనుదానికిని భేద మగుపడుచునే యుండును. వ్యవహారమున నూనిక సహాయమువలన నర్థహాని కలుగకుండు టచే "గంగను" అను సంధి జరిగిన రూప మొకకాలమున స్థిరపడినచో నదియే వ్యవహార బాహుళ్యముచే కావ్యభాష లోనికిఁగూడ మఱికొంత కాలమున కెక్కుట తటస్థించును. కావుననే స్త్రీవాచక తత్సమశబ్దముల తుది యకారమున కచ్చు పరమైనపుడు సామాన్యముగా సంధిలేకపోయినను, అట్లు లేదని ప్రాచీనకావ్యభాషయందలి రూపమునుబట్టి నైయాకరణులు భాషను వ్యాకరించి లక్షణమేర్పఱచినను, గంగనుకాసె, రంగ భర్తంచు మొదలగు సంధి చేయబడిన రూపములు వ్యవహారమునందలి ప్రాచుర్యమునుబట్టి కావ్యములలోనికిఁ గూడ క్వాచిత్కముగా నెక్కుటయుఁ దటస్థించినది. ఇట్టి రూపములు వ్యవహారమున నుచ్చారణరీతినిబట్టి సులభము గనే యర్థమగుచుండుటవలన సంధిగతరూపమున కర్థహాని వాటిల్లకపోయినను, గ్రంథస్థమగునప్పుడట్టి అర్థబోధ సులభ ముగఁ గాకుండుటచేతను, ప్రాచీన కావ్యభాషా సంప్రదాయ మునకు విరుద్ధంబగుటచేతను, కొంత కాలమువఱకు నీ రూప ములు విరుద్ధముగఁ గనఁబడుటయు, నిట్టి ప్రయోగములు ప్రాచీన లక్షణమునకు విరుద్ధములనియు వీనిని ప్రయోగించిన

కవులు దుష్ట కవులనియు, వారి గ్రంథము లసత్కావ్యము లని కొందఱు లాక్షణికులు దెగడుచుండుటయు దటస్థింపక మానదు. కాని యా రూపమునకు వ్యవహారః బాహుళ్యము కలిగినప్పుడును దానిని బ్రయోగించిన కవి సుప్రసిద్ధుఁడై యాతని కావ్యము రసవంతమై వాఙ్మయమున స్థిరస్థానమును బొందఁగలిగినప్పుడును, నీ యపప్రయోగములకే కాలక్రమమున లక్షణ మేర్పడుటయేగాక, యవియు సుశబ్దములేయై 'స్వర్గలోకమున కామధుక్కులు' గూడ నగుట తటస్థించును.

ఇట్లు గంగయను, చేష్టయుడిగె, రంగభర్తయంచు, అనియే చెప్పవలసియుండి సంధి రాఁగూడని స్థలములందు, వ్యవహార బాహుళ్యముచేఁ గొందఱు మహాకవులు సంధి చేసిన రూపములను బ్రయోగించి యుండుటనుబట్టి, వీనికి లాక్షణికులు వికల్పసంధి విధింపవలసిన స్థితి కలిగినది.

ఒక కాలమున వికల్పముగా కలుగు సంధి మఱికొంత కాలమునకు నిత్యముగాఁగూడ నగుచుండును. ఇప్పుడు కావ్యభాషలోఁ బ్రాచీన ప్రయోగముల ననుసరించి "మేనయత్త" "చించియిచ్చు" మొదలగు రూపములు ప్రయోగింపఁబడినను సామాన్య వ్యవహారమున "మేనత్త" "చించిచ్చు" అను రూపములే గాని సంధిలేని రూపములు వాడుకలోఁ గానఁబడవు. కావున మఱికొంత కాలమున కీ రూపముల విషయమునఁగూడ అకు, అంత శబ్దములు పరమైనపుడు నిత్యసంధి గలుగు నని చెప్పవలసిన యావశ్యకత గలుగును.

ప్రాచీన రూపములు సంధి జరుగనివి కొన్ని కనఁబడు చున్నను, ఈ కాలమున సంధిగతరూపములకే వ్యవహార ప్రాచుర్యము కలిగినప్పుడు వెనుకటి రూపములనుబట్టి యీ కాలమునగూడ సంధి వికల్పమనుట సమంజసముగాదు. ఈ కారణముచేతనే కావలయును "నుయిదాటేవానికిం జింతయూ కంతైనన్" "తనయంత జగముల బరగుచుండు" అను సంధి గాని ప్రయోగములు కొన్ని కనఁబడుచున్నను, "ఆకు, అంత, అయ్య, అక్క" మొదలగు శబ్దములు పరమైనప్పుడు నిత్యసంధిని కొందఱు లాక్షణికులు విధించి యుండుట తట స్థించినది. పద్యములలో ఛందస్సౌకర్యము కొఱ కెవనైన సంధిలేని రూపమునుగూడఁ బ్రయోగించినఁ బ్రయోగింప వచ్చును. గాని, సామాన్య వ్యవహారమున చింతాకు, తాటాకు, తనంత, సుబ్బయ్య, భామక్క మొదలగు సంధితోఁ గూడిన రూపములే భాషలో స్థిరపడిన వని చెప్పక తప్పదు. ఇట్టి మార్పుల మూలముననే ఆయా యుగములయందొక్క భాషకే భిన్నవ్యాకరణము లావశ్యకమగుట తటస్థించును.

ఈ "చింతాకు" మొదలగుచోటులఁ గలిగిన సంధికిని "మఱ్ఱాకు" "తాటాకు" అను శబ్దములలోని సంధికిని ఇంచుక భేదముగలదు. చింతశబ్ద మకారాంతమగుటచే సంధి గలిగి నను ఉచ్చారణమందు చిక్కేమియుఁ గలుగుట లేదు. తాటి, మఱ్ఱి, శబ్దము లికారాంతములగుటచే, సంధి లేనియప్పుడు యకార ముచ్చారణ సౌకర్యముకొఱకై వచ్చి చేరినది.

అప్పుడు "తాటియాకు, మట్టియాకు" అను రూపములే కలిగి.నవి. కాని కాలక్రమమున నుచ్చారణమందలి వేగముచే నందలి ఇకారము జాఱిపోవుటయుఁ, దత్సాంగత్యమువలనను యకార సాహచర్యమువలనను "ఆ" (ae) అనునొక విలక్షణ ధ్వని ఇంగ్లీషు భాషలోని 'Man' అను శబ్దములోని ధ్వని వంటిది బయలుదేరుటయుఁ దటస్థించినది. ఈ ధ్వని వ్యవహారమునఁ బ్రాచుర్యము వహించియున్నను, వ్రాతలోఁ జూపుటకు దీనికి సంకేత మేమియు నేర్పడకుండుటచే "తాటాకు, మట్టాకు" అని సంధి గలిగిన రూపములవలెనే వ్రాయుచు "తాటాకు," "మట్టాకు" అని "అ" ధ్వనితో పలుకవలసివచ్చినది. వ్రాఁత, పలుకుబళ్ళలోఁ గలిగిన యీ చిక్కును జూచియే వైయాకరణులు కొందఱు "ఇకారాంత స్థలములలో ఆకు శబ్దము పరం బగునపుడు సంధి శ్రుతికటువుగా నుండును కాన ఉ. 'తాటాకులలోన వ్రాసిరి పరాంగనగూడినఁ బాపమంచు'—క. 'మట్టాకునఁ బండెడుదొర, గుట్టానికి రెండుకాళ్లు కోడికి వలెనే' మొదలైనవానియందు 'తాటియాకు, మట్టియాకు' అని ప్రయోగించుటయే రమణీయంబు" అని హెచ్చరింపఁ జొచ్చినారు. ఇవి నిజముగా సంధివశమున గలిగిన రూపములే కావు. సంధిగాక యడాగమము వచ్చిన "తాటియాకు" "మట్టియాకు" అను రూపములనుండి వ్యవహారవేగముచే "తాట్యాకు" "మట్ట్యాకు" అనియై, పిదప యకారమునకు బదులుగా 'ఆ' అను నూతన

ధ్వనితోఁగూడి బయలుదేరిన రూపము లివి. వ్యవహారప నున్న యీ రూపములనే కొందఱు కవులు తమ కావ్యమ లోని కెక్కింపఁగా, త్రాఁతలో నివి కేవల మాకారయు ములుగనే గనఁబడుట జేసి యీ సంధి శ్రుతికటు వని వై యా కరణులు వివరించుట తటస్థించినది.

ఇక కేవలము విశేషణార్థమును సూచించు పదాంతా కారమునకు గూడ సంధి జరిగిన స్థలములు కొన్నిగలవు పుట్టిన+ఇల్లు = పుట్టినిల్లు. వృద్ధరాజులొద్ద ; రాజులాజ్ఞ సురారులమ్మా, తామరసనేత్రలిండ్ల, అను నీ స్థలములందు రెండు పదములును గలిసి యొక్క-పదముగనే — అనఁగా సమాసముగ గ్రహింపఁబడుటచేతనే సంధి జరిగిన దని తలంప వచ్చును. సమాసము కానియపుడు రెండవపనముపై నూఁతపడును.

ఈ విధముగా నీ భాషలో "నత్తునకు సంధి బహుళంబ" గుట తటస్థించినది. అనఁగా నీ భాషలో పదాంతమందలి 'అ' కారము సామాన్యముగా పదస్వరూపమునకుఁ జెందినదే గాని యాగంతుకముగ—లేదా యుచ్చారణవశమున—వచ్చి చేరినదికాదు గావున, సంధిలో నిది లోపించుట తటస్థించినపు డర్థమునకు భంగము రావలసియుండఁగా నూనిక దీనికిఁ దోడ్పాపై నిలిచి, యర్థమునకు భంగములేకుండఁ జేసి యుచ్చారణ సౌలభ్యమునకుఁ దోడ్పడియుండుటచే, వ్యవ హారవేగమునఁ గొన్ని స్థలముల సంధి జరిగినది. మఱికొన్ని

స్థలముల జరుగకుండుటవలన నీ సంధి వైకల్పికమగుటగూడ తటస్థించినది. కాని విశేష మేమనఁగా వైయాకరణులు చేసిన లక్షణమునకు భిన్నములగు రూపములుకూడఁ గాన వచ్చుచుండుటయే. స్త్రీవాచక తత్సమశబ్దములకు సంధి కూడదని వారు విధింపఁగా సంధి జరిగిన రూపములు నగపడు చున్నవి. ఆకు, అంత, మున్నగువాని యచ్చులు పరమైన పుడు సంధి నిత్యమని చెప్పఁగా సంధిలేని రూపములు విరళ ముగానైనను గనఁబడుచునేయున్నవి. దీనినిబట్టి, జీవద్భాష యెల్లపుడును మార్పులకు లోనగుచునే యుండును గావున, నందలి రూపము లెల్లపుడు నొక్క లక్షణములకే లొంగి యుండ వనియు నొక కాలమందలి భాషను వ్యాకరించి చేయఁబడిన లక్షణము తనునాటికాలమందలి భాష నరికట్ట జాల దనియు నది యొక్కొక కాలమునఁ బ్రామాణిక ములుగా గ్రహింపబడుచు వచ్చిన యాయా భాషారూపము లను జూపుటకు మాత్రమే తోడ్పడుననియు మనము గ్రహింప వలసియున్నది.

## —: ఇ కా ర సం ధి :—

ఈ విషయమే యికార సంధినిగూర్చి విచారించినపుడు గూడ మనకు గోచరించును. ఆంధ్రవైయాకరణులు క్త్వార్థకే కారమునకు సంధిలేదనియు మధ్యమ పురుషక్రియల యికార మునకు నిత్యముగా నగుననియు తక్కిన పదములందలి యికారమునకు సంధి వైకల్పికమనియుఁ దెలిపియున్నారు.

క్త్వార్థకేకారము భాషలో ప్రత్యేకార్థమును — అనగా భూత కాలమును —సూచించునదగుటచే నది సంధివశమున లోపించినచో నర్థమునకు భంగము కలుగనచ్చును గావున నిది లోపింపకుండుట న్యాయమే. కాని యట్టి యికారముకూడ లోపించి చించిచ్చు అనుచో సంధి జరిగియుండుటను మనమిది వరకే గ్రహించి యున్నాము. ఇట్టివింక ననేకములుండుటను జూచియే "కవిసంశయ విచ్ఛేద" కారుఁడు 'ఇడగనచ్చు నల్పప్పుడై నిత్యసంధిమాత్ర మొక్కొకచోటను మట్టుమీఱు' అని క్త్వార్థకేకార సంధి నొప్పుకోవలసినవాఁడైనాఁడు. ఈతఁడు చూపిన లక్ష్యములలో రెండు భారత కవులే ప్రయోగించినవియుఁ గలవు. భారతకవుల ప్రయోగములను శిరసావహించుట తప్పదు గావున, వానిని శబ్ద పల్లవము లని చెప్పి సమర్థించి, తక్కిన వానిని మాత్రము కొందఱు వైయాకరణులు నిరాకరింపఁజూచిరి. కాని యీ సంధియెట్లు సాధ్యమైనదో మనమిప్పుడు పరిశీలింపవలసియున్నది. క్త్వార్థ సంధి జరిగిన స్థలములను గొన్నిటిని పరిశీలించినచో నవి చాల వఱకు ఇకారము పరమైన స్థలములుగానే కనఁబడుచున్నవి. క్త్వార్థ కేకారమున కికారము పరమైనపుడు సంధి జరిగినను, ఏదో యొక యికారమేయచ్చుటఁ గనఁబడుచుండును గావున నా యికారముపై నూఁతపడినచో నర్థము సులభముగనే స్ఫురించుట కవకాశము కలుగుచుండును. అట్టి సందర్భములలో సంధి యుచ్చారణవేగమున జరిగినను నర్థమునకు భంగము వాటిల్లదు.

ఎఱిఁగించి+ఇప్పుడే=ఎఱిఁగించిప్పుడే – భార. ఉద్యో.

వెఱచి+ఇట్లు=వెఱచిట్లు—నిర్వ. ఉ. రా.

చీరచించి+ఇచ్చువారు=చీరచించిచ్చువారు. ఆముక్త.

అడిగి + ఇచ్చునో = అడిగిచ్చునో. విజయ.

ఎక్కడనుండి + ఇట = ఎక్కడనుండిట. క. ప.

నిగిడి+ఇరువైపులన్=నిగిడిరువైపులన్. శుద్ధా రా.

కాని క్వాచిత్కముగ నికారేతరాచ్చులు పరమైనప్పుడును సంధి జరిగినది.

ఎఱిఁగి+ఎఱింగి=ఎఱిఁగెఱిఁగి—భాగ. ఎఱిఁగెఱిఁగి యుండియకటా—రాజశే. చ. అడిగి+అడిగి=అడిగడిగి.

ఈ రెంటి నామ్రేడిత సంధి కుదాహరణములుగా గ్రహింపవచ్చును. ఆమ్రేడిత సంధియని దీనికి పేరు పెట్టినను ఉచ్చారణవేగమున జరిగిన సంధియనియే ఫలితార్థము. ఒక్క పదమే రెండుమార్లుచ్చరింపఁబడినదగుటచే మొదటి పదమందలి తుది యచ్చు లోపించినను రెండవ పదస్వరూపమును బట్టి తొలి పదమును గుర్తించుట కవకాశము గలదు గావున నర్థమునకు భంగము గలుగదు. ఇచ్చట రెండవపదమందలి తుది యికారము క్త్వార్థమును సూచించునదిగావున, మొదటి యికారము లోపించినను, అర్థవ్యక్తికి భంగము కలుగ లేదు.

ఇఁక "చెప్పంపఁడే"—ప్రభా. 4. ఆ, అననలసంటి గాని, విజయ, అను సందర్భముల సంధియగుట కొంత వికృతముగాఁ గనఁబడవచ్చును. కాని సంధివశమున నేకాదేశంబైన "అ"కార ముచ్చారణమునఁ గేవలము "అ"కారముగ గాక "ఇ"కార లక్షణమునుగూడఁ గొంత గ్రహించినదై 'అ'(ae) అనుదానివలె పలుకఁబడుటచే (మట్టాకు మొదలగు స్థలములందువలెనే) సర్థభంగము కలుగకుండ వారింపఁబడుట తటస్థించినది. ఇట్లుచ్చారణ వేగమునఁ గలుగు మార్పుల మూలముగా నర్థభంగము కలుగకుండునట్లు జీవద్భాష వ్యవహారానుకూలముగా నేవో కొన్ని క్రొత్తమార్గములు నెప్పటికప్పుడు కల్పించుకొనుచుండును. ఈ నూతన మార్గములను లేదా ధ్వనులను సూచించు చిహ్నములు లిపిలో కల్పింపఁబడిన నేమోగాని, లేనిచో నీ రూపములను "చెప్పంపఁడే" యని ప్రాతవర్ణములతో మాత్రమే వ్రాయఁగడంగినచో, "చెప్పు+అంపఁడే" అని విభాగింపఁ బడినపుడు అర్థభంగము కలుగుటేగాక వెనుకటికాలపు వ్యాకరణమునుబట్టి యివి యపభ్రంశములు నపశబ్దములు నగును. వ్యవహార బాహుళ్యమును బట్టియే తిక్కనవంటి మహాకవియే వాడినను, ఈ వ్యాకరణములనుబట్టి వానిని బండితులు దిద్దివేయుటయో, లేక పాఠాంతరముల గల్పించుటయో తటస్థించును. లేదా వానినిమాత్రము మహాకవి ప్రయోగములనియో శబ్ద పల్లవములనియో సమర్థించి, యిఁక నితరులు మాత్రమిట్టివానిని

ప్రయోగింపఁగూడదని వ్యాకరణము శాసించును. ఈ భాషలో నీ 'Man' శబ్దములోని "ఆ" వంటి ధ్వనికి లిపి చిహ్నమింకను కల్పింపఁబడక పోవుట చేతనే చూశాను, వచ్చాను మొదలగు రూపములు — చెప్పంపఁడే, మట్టాకు శబ్దముల వలెనే — గ్రాంథికభాషలోని కెక్కకపోవుట తటస్థించినది. ఇవి ప్రామాణిక రూపములుగా గ్రహింపఁబడకపోవుట యను కారణము వేఱొండుండిన నుండుఁగాక. "చెప్పంపఁడే" "అనవలసంటి" మొదలగు నవి వ్యవహారబాహుళ్యమునుబట్టి గ్రంథములలోని కెక్కిన వేగాని, పూర్వవ్యాకరణ సమ్మతములై ప్రామాణికత్వమును బడసినపిదపఁ బ్రయోగింపఁబడినవి కావుగదా.



ఇట్లు మొత్తముమీఁద నీ క్త్వార్థకసంధి వ్యవహారమునఁ గొన్ని సందర్భముల వాడికలో లేకపోలేదు. కాని యీ వాఙ్మయమునఁ జాల నూతనములగు మార్గములను ద్రొక్కి తమ స్వాతంత్ర్యమును వెల్లడించిన పింగళి సూరనార్యుఁడు మొదలగువారు కొందఱు వ్యవహార ప్రచురమైన రూపమును మనమెందులకుఁ బ్రయోగింపఁగూడదని తలంచి సాహసించి "చెప్పంపఁదే" యని "అనవలసంటిగాని" యని క్త్వార్థకేకారమునకు ఇకారేతరమగు నచ్చుపరమైనపుడు సంధిచేసి ప్రయోగించినను, సామాన్యముగాఁ దక్కిన కవు లెవరును ప్రాచీన లక్షణమును మీఱుటకు సాహసింపలేదు. ఎట్లైనను క్త్వార్థకేకారసంధి నిషేధము కొంత కాలమునకు పాటింపఁబడకపోవుట తటస్థించినదనియే చెప్పక తప్పదు.

ఇఁక నిత్యముగా విధింపఁబడిన మధ్యమ పురుష క్రియల సంధినిగూర్చి పరికింతము. ఏలితివి+అప్పుడు=ఏలితి వపుడు, ఏలితిరి+ఇపుడు=ఏలితిరిపుడు—అని నిత్యసంధి కావలసినదేయని వైయాకరణులు విధించినారు. ఈ మధ్యమ పురుషేకార సంధినిగూర్చి వ్యాఖ్యానము చేయుచు సుప్రార్థ ప్రకాశికా కారుఁడు, దీనికి సంధి నిత్యము గావున, "ఏలితివి యిపుడు" అని చెప్పఁగూడదనియు, "ఇదేశమనాజ్ఞ ద్రోచి తిరి యెచ్చటనుండిట వచ్చినారలు" అని కవులమ్మములో నిదిగా స్వరలక్షణ సారసంగ్రహమునం దుదాహరింపఁబడినట్టి యడాగమముతోఁ గూడిన ప్రయోగము నిరాకరంబనియుఁ జెప్పియున్నాఁడు. వీరి మతమున ప్రథమోత్తమపురుషలలోని యికారమునకు సంధివైకల్పికమే. వచ్చిరిపుడు — వచ్చిరి యిపుడు, వచ్చితిమిపుడు—వచ్చితిమి యిపుడు, అని రెండు రూపములునుండగా "ద్రోచితిరి యెచ్చట" ద్రోచితిరెచ్చట యని మధ్యమ పురుషలోఁగూడ రెండు రూపములున్నచో నాశ్చర్యమేమియు నగపడదు. అయితే భాషలోనున్న రూపములను శిష్టులు కావ్యములఁ బ్రయోగించిన రూపములనే ప్రామాణికరూపములుగా గ్రహింపవలెగాని, "వచ్చిరి యపుడు" అని యున్నది గావున "ద్రోచితిరి యెచ్చట"అను రూపముగూడ నుండఁగూడదా యని వాదించినచో, నింక ననేక శబ్దముల విషయమునఁగూడ నిట్టి వాదమే బయలుదేఱుటయు భాషకు నియమమే లేకుండుటయు దటస్థించుననియు

గొందఱు వాదింపవచ్చును. భాషలోఁగొన్ని శబ్దములు మఱి కొన్ని శబ్దముల సామ్యమున స్వీయరూపమును వదలి మాఱు రూపు పొందుచుండుటకు శబ్దసామ్యము (analogy) అనున దొక బలవత్తరమైన హేతువే (factor) యగునను విషయము నటుంచి, "త్రోచితిరి యెచ్చట" అను ప్రయోగము నొక కవి ప్రయోగించి యుండఁగా, నొక లక్షణకర్త యుదాహరించి యుండఁగా నట్టి రూపము నిరాకరించుటకు మనకేమి హక్కుగలదో యనుదానినిగూడ నాలోచింప వలసి యున్నది. ఇట్టి ప్రయోగములు విశేషముగఁ గానవచ్చుట లేదనియు, నా ప్రయోగించిన కవి సుప్రసిద్ధుఁడును ప్రామాణికుఁడు నగు శిష్టకవి గాఁడనియు గొన్ని కారణములు చెప్పవచ్చును గాని లక్షణ కర్తలలోనే యభిప్రాయభేదము కలిగినప్పు డద్దానిని నిర్ణయింప వేఱుమార్గము నవలంబింపవలసి యుండునుగదా. "శాస్త్రప్రయోగవచసోః శాస్త్రం బలవదుచ్యతే," "తదల్పమపినోపేక్ష్యం కావ్యే దుష్టంకథంచన" అను కారికలనుబట్టియే విచారించినచో క్త్వార్థక సంధి, తత్సమ సంధి చేసిన తిక్కన, కృష్ణదేవరాయాది కవులందఱును లాక్షణిక కవులే కాకపోవుదురు. ఇంతకు నుత్తమ ప్రథమ పురుషలలో నిత్యసంధి వికల్పముగా జరుగుట కనువైయున్న పరిస్థితులు మధ్యమపురుష విషయమునఁగలవా లేవాయని పరిశీలించినచో, నిచ్చట నిత్యసంధి జరుగవలయునో వికల్పసంధి జరుగవలయునో యను విషయముకూడా

తేలఁగలదు. తరువాత నీ సంధి గలుగని రూపములు తక్కిన వానివలెఁ బ్రాచుర్యమును వహింపఁకుండుటకుఁ గల కారణము నారయ వచ్చును. మఱియు భాషలోనున్న రూపము లెట్లెందుల కాయా రూపములు గలిగియున్నవో పరిశీలించి సకారణముగ సమర్థించుటయే భాషాచరిత్రకు ముఖ్యలక్షణముగాని తాత్కాలిక వ్యాకరణమునవలె నిది సుశబ్దము, ఇది యపశబ్దము నని నిర్ణయించి యొకదాని నాదరించి యొకదానిని త్రోసిపుచ్చుట దాని లక్షణముకాదు. భాషాచరిత్రకు భాషలోని యర్థవంతములగు శబ్దములన్నియు లక్ష్యములే. ఒకదానియం దాదరభావము మఱియొకదానియం దనాదరభావము దానికిలేదు. కావున చారిత్రిక దృష్టితో నీ రూపములను బరిశీలించుట యుక్తము.

ఈ పై క్రియారూపములన్నియు ధాతువునకుఁ జేర్పఁబడిన కాలసూచక శబ్దములపై—లేదా ప్రత్యయములపై సర్వనామ శబ్దములనో ప్రత్యయములనో చేర్చుటచే నేర్పడినవనుట స్పష్టమే. కావున ని, మి, వి, రి అనునవి "(నే)ను, (మే)ము, (ఈ)వు, (ఈ)రు, (వా)రు," అనువాని రూపాంతరములే యనుటకు సందేహములేదు. ఇవి భవిష్యద్వర్తమానకాలిక రూపములలో ఉకారాంతములుగనే యుండియు, భూతకాలిక క్రియాపదముల తుది నికారాంతములగుటకు ముఖ్యకారణము భూతకాల చిహ్నము "ఇ" కార యుక్తమై యుండుటయే యని తలఁపనగును. పో+ఇ(తు) + (ఈ)వు = పోయితు + ఈవు =

పోయితీవు, పోయితివి. ఇట్లే పోయితిరి, పోయితిని, పోయితిమి మొదలగునవి తమిళమునందలి మధ్యమ పురుషైక వచన రూపములలోఁ బ్రాచీనములగునవి కొన్ని "శైదీ" మొదలగునవి తకారముపై నీకారము కలవగుటచే నవి శేయిదు అనుదానికి ఈ (వు) అను సర్వనామ రూపముఁ జేర్చుటచే నేర్పడియుండునని తలంచుట కవకాశముకలదు. బహువచన రూపములలో నిది మఱింత స్పష్టమగుచున్నది. చేసితు+ ఈరు=చేసితీరు=చేసితిరి. cf. తమి. శైదీర్, కన్న. గెయ్దిర్ ఈ రూపముల నిష్పత్తి క్రమమునుబట్టి విచారించినచో "చేసితివి" "చేసితిరి" అనువానిలోని మొదటి ఇకారము భూతకాలిక చిహ్నమనియు రెండవ ఇకారము మధ్యమ పురుష చిహ్నమనియు నీ శబ్దము లొక కాలమున హలంతములే యైయుండి కాలక్రమమునఁ బూర్వమందున్న ఇకార ద్వయ సాహచర్యముచేఁ దుదిహల్లుపైనూఁతగాఁ జేరిన "ఉ"కారము ఇకారముగా మాఱుటవలన నివి ఇకారాంతము లైనవనియుఁ దెలియ వచ్చుచున్నది. కాఁబట్టి "చేసితిరి" మొదలగు నికారాంత రూపము లేర్పడక పూర్వము "చేసితీరు" వంటి ఉకారాంతములుగాని, తమిళమునందలి "శైదీర్," కన్నడమునందలి "గెయ్దిర్" అనువానిని బోలిన హలంత రూపముగాని యీ తెనుఁగుభాషలోఁగూడ నుండియుండును. రేఫముగాని, ఉచ్చారణార్థమైన ఉకారము గాని అంతమందుగల రూపముల కచ్చుపరమైనపు డా హల్లు తో నచ్చుసయుటయే యచ్చట జరుగు కార్యము. ఇట్లే

యీా శబ్దములందలి తుది "ఇ"కార ముచ్చారణార్థకమగు ఉకారస్థానమున వచ్చినదగుటచేఁ దరువాత నొక యచ్చు పరమైనపుడది లోపించినను అర్థమునకు భంగము కలుగదు. కావున సంహితలో నుచ్చారణవేగమున నది లోపించుటయు వెనుకటి హల్లు పరపదాద్యచ్చుతో నెనయుటయుఁ దటస్థించును.

మధ్యమ పురుషక్రియయందలి తుది "ఇ" కారము వలెనే తక్కిన ప్రథమోత్తమ పురుషక్రియలయందలి తుది ఇకారములును పూర్వమునఁ గల భూతకాలిక చిహ్నమగు "ఇకు" అనుదానిలోని ఇకార ప్రభావముచే గల్గినవేగాని యెచ్చటనుండియో వచ్చి చేరినవని చెప్పుటకు వీలులేదు. తమిళ కన్నడములలోని యీా భూతకాలిక రూపములు హలంతములే యైయుండుటయుఁ దెనుఁగునమాత్ర మా రూపము లొక యికారాగమును దుదిని గ్రహించుటయు నీ క్రింది పట్టికలోని యీా భాషారూపములను బోల్చి చూచినచోఁ దెలియఁ గలదు.

| | | తె. | తమి. | కన్న. |
|---|---|---|---|---|
| ఉత్త. | ఏ. | చేసితిని | శెయ్ దేన్ | గెయ్ దెన్ |
| | బ. | చేసితిమి | శెయ్ దోమ్ | గెయ్ దెవ్ |
| మధ్య. | ఏ. | చేసితివి | శై దీ | గెయ్ దయ్ |
| | బ. | చేసితిరి | శై దీర్-శై దనీర్ | గెయ్ దిర్ |
| ప్రథ | ఏ. | చేసెను | శై దాన్ | గెయ్ దమ్ |
| | బ. | చేసిరి | శై దార్ | గెయ్ దర్ |

తమిళ కన్నడములందలి భూతకాలిక చిహ్నము (ఇతు) లోని ఇకారము "పోయినాన్" "మాడిదెన్" మొదలగు కొన్ని క్రియారూపములలోఁ గనఁబడుచునే యున్నను, పెక్కు రూపములలో జాఱిపోయి యుండుటచే దీని ప్రభావ మా రూపములందలి తుదిహల్లులపైఁ బ్రసరింప నవకాశమే లేక పోయెను. తెలుఁగునమాత్ర మీ ఇకారము నిలిచి యుండుటచే, చెయ్+ఇతు+ఏన్ = చేస్+ఇతు+ఏన్ = చేసితేన్ = చేసితేను=చేసితిని, ఈ రీతిని మార్పు నొందుటచే నీ రూపములు తుద కీకారాంతములగుట తటస్థించినది. ఇట్లీ రూపములన్నియు నొక్క రీతిగా నేర్పడినవే యగుటచేఁ దుది యికార సంధి విషయమున మధ్యమపురుషక్రియలకును, తక్కిన ప్రథమోత్తమపురుషక్రియలకును భేద మేర్పడుట కవకాశము కనఁబడదు. మూఁడు పురుషలలోనుగూడ నీ క్రియాపదములందలి ఇకారము అచ్చుపరమైనపుడు లోపించుటయే సహజమై కనప్పట్టుచున్నది. అట్లే భాషలో నవి లోపించుచునే యున్నవి. కాని మఱికొంత కాలమున కీ శబ్దముల తుది ఇకారము లా శబ్దములకు సహజములే యని తలఁపఁబడుటచేతనో లేక ఛందస్సౌకర్యమునకుగాఁ గొందఱు కవులు సంధిచేయక యడాగమముం జేసిన రూపములను వాడుటచేతనో యడాగమ సహితరూపములు భాషలో బయలుదేఱినవి. ప్రథమోత్తమ పురుషలలోవలెనే మధ్యమపురుషలలోఁగూడ యడాగమ రూపము "ఇదె శమనాజ్ఞఁ ద్రోచితిరి యెచ్చట

నుండిట వచ్చినారలు” అను స్వరలక్షణసారసంగ్రహమందుఁ జేర్కొనఁబడిన లక్ష్యమునఁ గానవచ్చుచునేయున్నది. పై వాని నంగీకరించి దీని నంగీకరింపకుండుటకుఁ గారణ మగపడదు. కావునఁ గ్రియాపదములందలి ఇత్తునకు సంధి వైకల్పికమని చెప్పుటయే ప్రస్తుతస్థితియందు న్యాయ్యముగాఁ గనఁబడుచున్నది. అందువలననే తాత్కాలిక వ్యాకరణ సూత్రాన్వయమునకు విరుద్ధమగుటచే స్వరలక్షణసారసంగ్రహకారుఁడిచ్చిన “క్రోంచితిరి యెచ్చట” అను ప్రయోగము నిరాకరణీయమని చెప్పుట లక్ష్యైకదృష్టిలేని కేవల శాస్త్రప్రామాణ్యపద్ధతిచే సూచించుచున్న దనవలసియున్నది. ఇఁక “కూర్చుండిరి యొండొరుం గదిసి” అను శ్రీనాథ ప్రయోగమునుగూర్చి—

కం. విరచించెను శ్రీనాథుఁడు
ధరణిని శృంగారనైషధంబునఁ గూర్చుం
డిరి యొండొరు నని కానక
పరపురుష క్రియలఁ బ్రకృతి భావముకలదే.

అను నప్పకవి చేసిన యాక్షేప మతిసాహసం బని యధిక్షేపించుటయు సమంజసముగాదు. “నిత్య మనుత్తమపురుషక్రియాస్వితః” అను సూత్రమున కప్పకవి చేసిన వ్యాఖ్యానానుసారముగా పై శ్రీనాథుని ప్రయోగము శాస్త్రవిరుద్ధమే యగునుగదా. స్వరలక్షణసారసంగ్రహకారుఁడు సంగ్రహించిన మధ్యమపురుష క్రియల ఇకారమునకుఁ బ్రకృతి భావముకలిగిన రూపము బాలవ్యాకరణ కర్తకుఁ గాని

తద్వ్యాఖ్యాతకుఁగాని విరుద్ధముగా కనబడినట్లే ప్రథమపురుష క్రియల ఇకారమునకుఁ బ్రకృతిభావము కల్గుట యప్పకవికిఁ శాస్త్రవిరుద్ధముగా గనఁబడినది. మధ్యమపురుష క్రియా రూపము విషయమునఁ బ్రకృతిభావమును నిరాకరించుట సాహసము కాకుండ ప్రథమపురుషక్రియలను గూర్చిన యాక్షేపము మాత్రమే సాహసం బనుట యెట్లు పొసంగును. మొదటి దానిని నిరాకరించుటకే బాలవ్యాకరణసూత్ర మాధార ముగా గ్రహింపఁబడినదో శ్రీనాథుని ప్రయోగమును నిరాక రించుటకు నా యాంధ్రశబ్దచింతామణి సూత్రమే (అప్ప కవి చేసిన వ్యాఖ్యానము ప్రకారము) ఆధారముగా గ్రహింపఁ బడినది. "ప్రయోగశరణా వైయాకరణాః" అను భావమును వదలి "శాస్త్రప్రయోగవచసోః శాస్త్రం బలవ దుచ్యతే" అను శాసనమునే శిరసావహించుట న్యాయ్యమని తలంచినచో నీ నిరాకరణములకు నాక్షేపములకును హద్దే యుండదు. లాక్షణికులలోనే యభిప్రాయభేదము కలుగుచునే యుండును. ఒక కాలమందలి భాషాలక్షణమునకును దాని తరువాతి కాలమందలి లక్షణమునకును భేదముండక తీరదు. కావున నా యా కాలముల స్థిరపడిన భాషారూపములను, చారిత్రిక దృష్టితోఁ జూచి సమన్వయింపవలసినదే కాని కేవల లాక్షణిక దృష్టితోఁ జూచినచో దోషములని చెప్ప వలసి వచ్చుచుండును. పరిశీలింపఁగాఁ గ్రియాపదముల ఇకార మునకుఁ బ్రాచీన కాలమునుండియు సంధి కలుగుటయే సహ

జమై యుండెననియు, ఛందస్సౌకర్యము మొదలగు కారణ ములచే సంధి జరుగక యడాగమము వచ్చిన రూపము లిట్టి వలికాలమున వాడుకలోనికి వచ్చినవనియుఁ దలంపఁ దగి యున్నది.

ఇఁక ఇకార సంధి సందర్భమున నేమ్యాదుల ఇకార మును గూర్చి పరిశీలింపవలసి యున్నది. దీనికి సంధినైకల్పిక మని చెప్పఁబడినది గావున నీ శబ్దములయందలి తుది యికా రము సహజమా? ఆగంతుకమా? అను విషయ మింకను విచారింపవలసియుండును. దీనిని నిర్ణయించు పట్ల నీ శబ్దముల నితర ద్రావిడ భాషారూపములతోఁ బోల్చి చూచుట యుక్తము. ఈ గణములో మొదటిదగు "ఏమి" శబ్దమును గ్రహింతము.

ఏమి—ద్రావిడ భాష లన్నిటిలోను ప్రశ్నార్థక సర్వ నామరూపము "ఎ" "ఏ" అను మూలరూపములకు నకార, దకార, మకారములను జేర్చుటచే నేర్పడినట్లగపడుచున్నది. త. ఎదు; తె. ఎది, ఏది, అని దకారముతోఁ గూడిన శబ్ద ముల కంటె నకార మకారములతోఁ గూడిన తె. ఏమి, త. ఏన్, మ. ఏన్ అనునవి కేవల భావార్థమును (Abstract idea) సూచించునవై యున్నవి. ఎదు, ఏది, అనునవి ఇంగ్లీషులోని Which శబ్దమువలె నమహదర్థమును సూచించు చుండ, ఏన్, ఏమి అనునవోక నిర్దిష్ట వస్తువునుగూర్చి గాక ఇంగ్లీషులో What అను శబ్దమువలె సామాన్యప్రశ్నార్థకము

లగుచున్నవి. "ఏది" అను నమహదర్థసూచక మగు శబ్ద మును బోలినది తమిళమున "ఎన్నదు" అనునది. ఇది "ఎన్" అనుదానికి అదు శబ్దమును జేర్చుటచే నేర్పడినది. దీని బహువచన రూపము "ఎన్న" అనునది. అది ఏకవచనమునఁ గూడ వాడుకలోనికి వచ్చినది. కన్నడములో 'ఏను' అనునది కేవల ప్రశ్నార్థకావ్యయము గాక సర్వనామమై విభక్తిప్రత్య యములఁగూడ గ్రహించుచున్నది. తెలుఁగున సామాన్య వ్యవహారములో "ఏమియో" అనుదానికంటె ఏమో (ఏమ్+ఓ) అనునదే యెక్కుడు ప్రచారములో నున్నది. ఇది తమిళ కన్నడ మళయాళములలో "ఏనో" అనురూపము గలదై యున్నది. ఆ భాషలలో "ఏన్" అనుదానికి "ఏని" రూపాంతరముగాని "ఏనియో" అను శబ్దముగాని లేకుండు టచే నాంధ్రమున "ఏమి" అనుదాని యందలి తుది "ఇ"కా రము కన్నడమునందలి "ఏను" అనుదాని "ఉ"కారమును గూడ నుచ్చారణవశమున వచ్చిచేరిన నే యని మనము నిశ్చ యింపవచ్చును. వ్యవహారమున "ఏమి" అనుదానికి బదులుగా "ఏఁ=ఏమ్" అనునది ప్రసిద్ధమై యుండుటనుబట్టి కూడ నిది హలంతమనియే చెప్పఁదగియున్నది. Cf. "సీకే భ్రాతియే వెన్నలుంబాలు" "శవముక్రియనుండెడిదే"=ఏమి? కావున "ఏమ్+ఇది=ఏమిది" అను రూపమే ప్రాచీనసంప్రదాయాను సారమైన ట్లగపడుచున్నది. ఏమి యిది అనునది తుది యికా రము శబ్దగతమే యని తలంపఁబడిన పిదప ఛందస్సౌకర్యము

కొలఁదిఁ గొందఱు కవులు ప్రయోగించి యుండుటచేత వాడుకలోనికి వచ్చియుండును.

మఱి :—మఱి+ఏమి=మఱేమి, మఱియేమి. ఇచ్చట "మఱి" అనఁగా వేఱొకటి యని యర్థము. దీనికి తమిళ, కన్నడరూపము "మఱు." వేఱొక, రెండవ, తరువాత (Other, next, following) అని దీని యర్థము. కన్నడము నందలి "మఱుమాతు" అను దానిలోవలెనే తెనుంగులో మఱుమాట=ప్రతివచనము అనుదానిలో నీ శబ్దము ఉకారాంతమయియే యున్నది. ఈ సమాసమున నొక విశేషము కలదు. ఒక్క పదమే భిన్నరూపములను జెందుటచే నర్థభేదము కలదై యొక రూపమున విశేషణముగను, వేఱొక రూపమున విశేష్యముగను నెట్లగపడుచుండునో పై సమాసమువలన మనము తెలిసికొనవచ్చును. "మాట" అను శబ్దమునకు ఒక పలుకు, వాక్కు అని యర్థము. కన్నడమున నిది మాతు అను రూపముకలదై యున్నది. 'మాత' అనియు దీనికి రూపాంతరము కలదు. ఇవి రెండునుగూడ మాఱు ధాతువు నుండి యేర్పడిన నామవాచక శబ్దములే. మాఱు అనుదానికి మూలార్థము బదులు, బదులుగాఁ జెప్పఁబడినది, అనినై యుండును. మాఱు పల్కుట = మాట (What is said in reply) పిదప మాఱు పల్కినదికూడ నొక శబ్దమే కావున నదియు మాట=పల్కు, వచనము (a word) అయినది. మాఱు ధాతువు మాట, ఎట్లయినదని యడుగవచ్చును.

శకటరేఫము ద్విత్వము చెందినపుడెల్ల ప్రాచీన కాలమున నది "ట్ర" యని యుచ్చరింపఁబడుచుండెడిది. ఇప్పుడు తమిళమునఁ గూడ నట్లే పలుకఁబడుచున్నది. ఈ కారణము చేతనే తెనుఁగున, "చిఱు, చిట్టి, కుఱు, కుట్టు (కుట్టుసురు) మొదలగు రూపములు కొన్ని వ్యస్తముగను, కొన్ని సమా సములలోను గానవచ్చుచున్నవి. ఈ 'మాఱు = మాట' యనువానికి తమిళ మళయాళ రూపములు మాఱ్ఱు; తు. మాఱు—మాఱ్ఱు, మాఱ్టు అనియుఁ గలవు. వ్రాఁతలో ద్విత్వ శకటరేఫమే కనఁబడినను ఉచ్చారణమున ద్విత్వటకారము "ట్ర" అని వినఁబడును. కావున నామవాచకరూపమున మాఱు ధాతువు నందలి శకట రేఫము ద్విత్వము చెందు టచేఁ మాఱ్టు, మాఱ్ఱు అను రూపము లేర్పడి యుచ్చారణ మున మాట్రి(యై రేఫము లోపించినపుడు 'మాట' అను రూపమేర్పడి తెనుఁగులో నిలిచినదనుటకు సందేహము లేదు. ఇట్లు మాఱు ధాతువు నుండియే మాటశబ్ద మేర్పడినను ఈ మాటకు పూర్వరూపంబగు మాఱు శబ్దమే దీనికి విశేషణ ముగా ముందు నిలుచుట తటస్థించినది.

ఇఁక "మఱి" — అనునది 'మాఱు' ధాతువునకు రూపాంతరమగు 'మఱు' అనుదానినుండి యేర్పడినదే. పైని జూపఁబడిన యితర భాషారూపములు "మాఱు, మఱు" అని ఉకారాంతములే యగుటచేతను పలుమాఱు, పలుమఱు, మఱుమాట, మఱుసటి (క. మఱుచల్ = మరుసల్ = Second)

దినము మొదలగు వానిలో నిది ఉకారాంతమే యగుటచేతను, "మఱి" అను నవ్యయమందలి ఇకారము సహజము కాదనియే వ్యక్తమగుచున్నది. ఈ "మఱి" అనునది కాలక్రమమున కేవలావ్యయముగా వాడుకలోనికి వచ్చినది. అప్పుడు మఱియేమి, యను సంధిలేని రూపములు భాషలో నేర్పడి యుండును.

కి షష్ఠి :— దీనిని షష్ఠీవిభక్తి ప్రత్యయమనుటకంటె చతుర్థీ ప్రత్యయమనుటయే న్యాయ్యము. సహజముగానిది 'కు' వర్ణమని తలంచుటయే యుక్తము. తెనుఁగులో నికారాంత శబ్దములపైఁ జేర్పఁబడినపుడా యికార సాహచర్య బలముచే నిది "కి" వర్ణముగ మాఱుచున్నది. తమిళమున "కు" "క్కు" మళయాళమున "క్కు" ప్రాచీన కన్నడమున "కె" "గె" హాసనకన్నడమున "గె" "క్కె" (ఇగె); తుళు భాషలో కు, గు, క్, గ్ ; తుడభాషలో క్, గ్ అని రూపములు కలదై యున్నది.

దీని నిజస్వరూపమును మనకు, తనకు, రామునకు వారలకు మొదలగు శబ్దములనుబట్టి గుర్తింపవచ్చును. cf. క. త. నినగె. నినక్కు. ఈ రూపములో షష్ఠి ప్రత్యయము లేదా సంప్రదానార్థక ప్రత్యయము కేవల "కు" వర్ణము మాత్రమే గాక దానికిఁ బూర్వమందున్న అకారముతోఁ గూడిన "కు" వర్ణముగా మనము గ్రహింపవలసియున్నది. ఈ "అకు" అనునది "అగు" అను శబ్దమునకు లేదా అగు

ధాతువునకు సంబంధించినదే. "రామునకు" "నినగా"— అనఁగా—రామునిది యగునట్లు—నీది యగునట్లు—అని యర్థము సిద్ధించును. 'కు' వర్ణము వాస్తవముగా సంప్రదానార్థమును సూచించునదై యేర్పడినదే గావున (తక్కిన భాషలలో నిది చతుర్థీప్రత్యయముగానే గ్రహింపఁబడుచున్నది. తెలుఁగులో మాత్రమే షష్ఠీ ప్రత్యయమయినది. చతుర్థిలోను మఱొక విధముగా — కొఱకు, కై లలో నగపడుచునే యున్నది) "రాముని దగునట్లు" ఇచ్చెను, అను నర్థమిచ్చుచున్నది. "అగునట్లు" అనునుదంత తద్ధర్మార్థ రూపములం దగపడు చున్న నకారమే యీ కు వర్ణముపైని గనఁబడుచుండుటచే నిది ద్రుతాంతమైనది. ఈ తుది నకారముతో నచ్చు గూడిన రూపములు భాషలో ప్రాచీనములు, సంధి జరిగిన రూపములు నవీనములునై యుండును. కాని సామాన్యముగా నీ భాషలో పదాంత మందలి ఉకార ముచ్చారణార్థమై వచ్చి అచ్చుపరమైనపుడు లోపించుచుండుటనుబట్టి ఉకార సంధి ప్రాచుర్యమును వహించుటచే నట్టిరూపముల సామ్య ముచే కాలక్రమమున నీ "కు" వర్ణముపైఁగూడ సంధిగలిగి "రామునికిచ్చె" వంటి సంధిగత రూపములకే వ్యవహార బాహుళ్యము గలిగినట్లగపడుచున్నది.

అది, అవి, ఇది, ఇవి, ఎది, ఎవి. ఈ యనుమాత్సర్వ నామ శబ్దములన్నియు నితర భాషలలో నుకారాంతములై యున్నవి. ప్రాచీనభాషలో హలంతములే యైయుండును.

కావున హలంత శబ్దముపై నచ్చు నిలచినపుడు హల్లచ్చుతో నెనయుటచే సంధి జరిగిన రూపములే ప్రాచీనకాలమునుండియు భాషలో నేర్పడియుండును. తరువాతికాలమున నాంధ్రమున నికారముచ్చారణ వశమున వచ్చి చేరినపదప నది సహజముగ శబ్దగతమే యని తలపఁబడినపుడు సంధి జరుగక యడాగమము వచ్చిన రూపముకూడ నేర్పడుటచే వికల్ప సంధి గలిగినది. ఇతర భాషలలోని యంత్యోకారము నిందలి యికారమువలెనే యుచ్చారణ వశమున వచ్చినదేగాని సహజమున నీ శబ్దములు హలంతములే యనుటకు తక్కిన మహన్మహత్యర్థక రూపములగు "అవన్" "అవళ్" "ఇవన్" "ఇవళ్" అనునవికూడ హలంతము లగుటయే కాక గోండు భాషలో నీయమహదర్థక రూపములుకూడ "అద్" "ఇన్" అని హలంతములే యగుటయుఁ దార్కాణములగుచున్నవి. తమిళమున వీని తుది యుకారమునకు సంధి వికల్పమే యైనను పరుషముపై వచ్చు నీ యుకారము "కుట్రియల్" ఉకారమే కావున నర్థమాత్రకంబగు దానికి లోపమే సహజమని తలపనగును.

ఏమ్యాదు లాకృతి గణంబని చెప్పఁబడినది. ఆకృతి గణంబనఁగాఁబోలికచే నూహింపఁబడఁదగిన పదసముదాయము. అనఁగా నికార వికల్పసంధి జరిగి వ్యవహారమునఁ బ్రసిద్ధములైన శబ్దములన్నియు నీ సూత్రముచేతనే సాధింపఁదగినవనుట. కావున "ఇ" కార సంధి జరిగిన ప్రాచీన కవి

ప్రయోగములన్నియు నేమ్యాదులలోఁ జేరుచున్నవి. భాషలో నికారమంతమందుఁగల శబ్దములలో నేయే శబ్దములకు సంధి యగునో వేనికిఁగాదో నిశ్చయించి చెప్పుట కవకాశము లేదనియు వ్యవహారమునుబట్టియు, బ్రయోగమునుబట్టియునే వీని సాధుత్వమును నిర్ణయింపఁదగియున్నదని చెప్పుటయే దీని నాకృతి గణంబుగాఁ జేయుటలోఁ గల విశేషము. ప్రాచీన లక్షణ గ్రంథములగు ఆంధ్రభాషా భూషణ సర్వ లక్షణసారసంగ్రహాదులందుఁ జేర్కొనఁబడిన "బంతిది, పెం డ్లాడి, నెండుంగరము, సైడందెలు, తండ్రేడి" మొదలగు స్థలములలో నికారము పూర్వపదములోని భాగమేయైనను అర్థమునకు భంగము కలుగకుండగనే యది లోపించి సంధి జరుగుటచే బాలవ్యాకరణకర్త వీని నాకృతి గణములోఁ జేర్చి స్వరమే యిచ్చుట శబ్దరూప గ్రహణమునకు దోడ్పడు చున్నది.

ఇట్లు వ్యవహార ప్రాచుర్యమునుబట్టియుఁ గవి ప్రయో గములనుబట్టియు నే పై శబ్దములలో వికల్పసంధిని తిమ్మకవి చెప్పియుండును. "మగనాలు" అను దాని నహోబలపతి యికార సంధి కుదాహరణముగా నిచ్చెఁ గావున లాక్షణిక కవుల ప్రయోగము లారయనిది విరుద్ధ ప్రయోగములు కన్పడి నంతమాత్రమున వానిని భారాళముగా సాధువులని యెంచఁ గూడదని గుప్తార్థ ప్రకాశికాకారుఁడు హెచ్చరింపఁ జొచ్చి యున్నాఁడు. శ్రీనాథుని కాశీఖండమున "ఖర్మ్మమై నుప్పిండి యుపవాసముండ నీ మగనాలి సరిఁబోల్పఁదగుదు విధవ" అని

సంధిఁజేసిన రూపము ప్రయోగింపఁబడియుండగా సుత్తర రామాయణమున "ఆ సమయంబునన్ మగని యాండ్రును గన్యలు నాకసాచ్చి"అని 'మగనియాండ్రు'అని సంధి విరహిత రూపము ప్రయోగింపఁ బడియున్నది. ఒకవేళ నహోబలపతి కాలమునకు సంధిజరిగిన రూపములే ప్రసిద్ధములై యుండి సంధి జరుగని రూపములు భాషలో ప్రచురముగా లేకపోవుటచేత నే యాతఁడు "మగనాలు" అను దానిని నిత్యసంధి కుదాహరణ ముగా నిచ్చియుండె నేమో. దీనినిఁబట్టి భాషలో సంధిజరిగిన రూపము ప్రాచీనమా? సంధిజరుగని రూపము ప్రాచీనమా? యని సందేహము వొడమక మానదు. "మగనాలు" శబ్దము మగని+ఆలు అని ఇకారాంతమగు మగని శబ్దముపై నాలు శబ్దము చేర్పఁబడునపుడు, వీని కవయవ శక్తి పోయి "పుణ్యస్త్రీ" యను సముదాయశక్తి రూఢమగుటచే నుచ్చా రణ వేగమున సంధిగతరూపమేర్పడినదని తలంచుట కవకా శము కలదు. కాని 'మగని' అనునది "మగన్" శబ్దమునకు షష్ఠీ విభక్త్యంతరూపము గావున "మగనాలు" శబ్దమునకు మగని (యొక్క) ఆలు అని యవయవార్థము లేదా విగ్రహ వాక్యము చెప్పవలసి వచ్చినప్పు డట్లు చెప్పఁబడు చున్నను, ఇది మగని+ఆలు అను శబ్దములకు సంధి జరుగుటచే నేర్పడి నదిగాక ప్రాచీన కాలముననే "మగన్+ఆలు" అను శబ్దముల కూడికచే నేర్పడియుండుననియుఁ దలంపవచ్చును. "మగన్" అనునది స్థానబలముచే విశేషణమై పూర్వమున నిలిచి తరు వాతిపదముతోఁ గూడినపుడు, నీ సమాసమునకు మగని(యొక్క)

ఆలు అని యనయవార్థమునే బట్టి వచ్చిన పుణ్యస్త్రీ అను నర్థము రూఢమగుట తటస్థించును. ఈ సమాసమును తరువాత కాలమున నైయాకరణులు విభజింపవలసివచ్చినప్పుడు మగని+ఆలు అని విడఁదీసి, దీని నికార సంధి కుదాహరణముగా నిచ్చియుందురు. "పురటాలు" శబ్దముకూడ నిట్టిదే కావచ్చును. ఇది "పురుడు+ఆలు" అను శబ్దముల కూడిక చేతనే యేర్పడియుండును. అట్లు కానిచో సామాన్య వ్యవహారమున "తాటి+ఆకు=తాటాఁకు, రావాఁకు, అనునవి ఇకారా కారధ్వనుల సంయోగమువలన నేర్పడి ఆకారధ్వని గలవై వ్యవహరింపఁబడుచుండగా "మగనాలు" పురటాలు, అనునవి శుద్ధాకార ధ్వనితోడనే నిత్య వ్యవహారమునఁ గూడఁ బలుకఁబడుచుండుటకుఁ గారణ మగపడదు. కావున నివే భాషలోఁ బ్రాచీనరూపములనియు, సంధి జరుగక యడాగమము వచ్చినదని తలంపఁబడుచున్న రూపము లర్వాచీనములనియుఁ దలంపఁదగియున్నది. "మగనియాలు, పురిటియాలు" అను శబ్దములు వ్యవహారమున నంతగాఁ గానఁబడవు. ఇంక "తెలివొంది" అనుదానికి సుప్తార్థ ప్రకాశికా కారుఁడు పెక్కు ప్రయోగముల నిచ్చియున్నాడు. అవి చాలవఱకు భారతప్రయోగములె. 'తెలివొంది మనసు నిశ్చలవృత్తినే కాగ్రమైయునికి" (భార. శాం. 4 ఆ.) సామాన్య వ్యవహారమునగూడ 'తెలివియొంది' అనురూపము ప్రసిద్ధముగా నున్నట్లు లేదు. సంధిగత రూపమునకే మన మలవాటుపడుటచే నదియట్లగపడుచుండె నేమో యనియుఁ

జెప్పవచ్చును. కాని చిరకాలమునుండియు నీ రూపమునకే ప్రాచుర్యము కల్గుటకుఁ గారణమేమైనఁ గలదాయని విచారించినచోఁ బ్రాచీనకాలమున నిట్టి వనేకములు ఉకారాంతములే యైనట్లు తెలియవచ్చుచున్నది. తనివు—తనివి; చెలువు, విరివి, నిడువు—నిడివి, cf. త—అతివు. "ఉలివు" అను శబ్దము కారాంతముగనే కనబడుచున్నది. తెలివు+ఒంది=తెలివొంది యని సులభముగా నగును. ఇకారముపైకంటె నుకారముపై నిత్యముగా సంధిచేయుట యీ భాషలో నెక్కుడు ప్రాచుర్యము వహించియుండుట సుప్రసిద్ధమేగదా.

ఇఁక 'ఒకేల' 'డెబ్బదేను' 'అరువదేను' అను నికార సంధులని తలంపఁబడుచున్నవి. ప్రాచీనకాలమున "ఒకఁడు+ఏల" "డెబ్బదు (త. ఎళ్పదు.)+ఏను" "అరువదు+ఏను" అని ఉకారాంత పదములతోఁగూడి భాషలో స్థిరపడినవేయైయుండును. ఈ యుకారాంతశబ్దములు కాలక్రమమునఁ దెనుఁగున నికారాంతము లగుటచే నిచ్చట జరిగినది ఇకార సంధియేయని వైయాకరణులు తలంచుటకు| కవకాశమేర్పడినది. ఇప్పు డికారంతములైయున్న శబ్దము లనేకములు ప్రాచీనకాలమున నీ భాషలో నికారాంతములుగాక హలంతములో ఉకారాంతములోయైయుండెననుటకు సందేహములేదు. 'పది' శబ్దము కూడ నిట్టిదే. ఇది ప్రాచీనభాషలో "పత్" అను రూపముగలదై యుచ్చారణార్థము తుదినొక యర్థమాత్రోకారముతోఁ జేర్చి వ్యవహరింపఁ బడుచు

వచ్చినది. తమిళములోఁ బ్రాచీన కాలమున నిది "పత్తు" అని యర్థమాత్రోకారముతోఁ గూడినదనియే ప్రాచీన వ్యాకరణములు తెల్పుచున్నవి. కాని యిటీవలి కాలమున నా భాషలో నిది 'పదు' అని యుకారాంతమైనది. తరువాతఁ గాల క్రమమున నిది యాంధ్రమున "పది" అని యికారాంత రూపమయినది. కావున "అరువదేను" "డెబ్బదేను" అను రూపములు ప్రాచీనభాషలో నీ "పది" శబ్ద ముకారాంతమై యున్నప్పుడో లేదా "పత్త్" అని హలంతమై యున్నప్పుడో యేర్పడియుండెనని తలఁపఁదగియున్నది. తమిళ, కన్నడ రూపములగు "అఱువత్తాఱు" "ఎళ్బత్తేళు" క. "ఎప్పత్తేళు" "ముప్పత్తాఱు" మొదలగునవి "పత్త్" శబ్దముతోఁ గూడిన సమాసములే యని తలంపనగును.

## — ఉ కా ర సం ధి —

ఇఁక ఉకారసంధిమాత్ర మీ భాషలో నిత్యముగాఁ గలుగుటకుఁ గల కారణమేమో పరిశీలింపవలసియున్నది. ఈ ద్రావిడభాష లన్నిటిలోను ముఖ్యముగాఁ బ్రాచీనకాలమందు పెక్కు శబ్దములు హలంతములై యుండెనని తలంచుట కవకాశముండెనని యిదివఱకే సూచింపఁబడెను. సర్వనామములు, సంఖ్యావాచకములు, నిత్యకృత్యమున వాడుకలోఁ గల శబ్దములు, మొదలగునవియేగాక యీ భాషలోని ధాతువులు గూడ పెక్కు హలంతములే యైయుండుట నీ భాషా రూపముల నించుక సరిపోల్చి చూచినచో కనిపట్టఁగలము. ఒక్కొకభాషలో నొక్కొకపు డివి యజంతములగుట

తటస్థించినను నితర సన్నిహిత భాషారూపములతోఁ బోల్చి చూచినపుడవి యొక కాలమున హలంతములే యని తోఁచక పోదు. ఇతరభాషలలో నివి యిప్పటికిని హలంతములై యుండుట నీ క్రింది పట్టిక వ్యక్తము చేయఁగలదు.

ఉత్తమపురుష సర్వనామములు :—

త—యాన్, నా౯-యామ్, నామ్, నాంగళ్.
మ—ఞ్యాన్-నామ్, ఞాంగళ్.
కన్న—యాన్-ఆన్-ఆమ్.
తు—యాన్; (వెంకులు).
కూర్గు—నన్, నన్గ.
తుద—ఆన్, ఆమ్, ఏమ్.

} తె— ఏను, నేను, ఏము, మేము. క. నాను- నావు.

మధ్యమ పురుషము :—

త—నీ, నీయ్, నీర్, నీయిర్.
మ—నీ, నిఙ్ఙల్, నీఙ్ఙల్
తు—ఈ, ఈర్.

} తె—నీవు-మీరు.

ప్రథమపురుష :—

త—అవన్, అవళ్-అవర్, యావన్, యావర్. } తె—వాఁడు, అది, వారు, ఎఁవఁడు, ఎవరు.
క—అవ౯, అవళ్, అవర్. } క— అవను, అదు, అవరు, అవు.
తుద—అథమ్, ఇథమ్ తె—అతను, ఇతను.

ఆత్మార్థకము :—

త—తాన్, తామ్, తార్. తాను-తాము.

— సంఖ్యావాచకములు —

| | త. | మ. | కన్న. | తుళు. | తె. |
|---|---|---|---|---|---|
| 1. | ఒర్, ఒరు, ఒన్ఱు. | ఒర్. | ఒర్ (ఒందు). | ఒర్ (ఒంజి). | ఒండు. |
| 2. | ఇర్, ఇరణ్డు. | ఇర్. | ఇర్, ఎరడు. | ఇర్, రడ్డు | రెండు. |
| 3. | నాల్. | నాల్. | నాల్, నాలు. | నాల్, నాలు. | నాల్గు. |
| 4. | ఏఱా. | ఏఱు. | ఏళు. | ఏళ్. | ఏడు. |
| 5. | ఎణ్. | ఎణ్. | ఎణ్, ఎణ్టు. | ఎణ్, ఎణ్మ. | ఎన్మిది. |
| 6. | ఒన్బాన్. | తొళ్. | తొంమ్. | సొంణ్, | తొమ్మిది. |
| 7. | పాణ్, పత్, పత్తు. | పదిణ్ పణ్. | పది, పత్తు. | పాద్, పత్తు. | పది. |

— మఱికొన్ని శబ్దములు —

| త. | తె. |
|---|---|
| కణ్ | కన్ను |
| కాల్ | కాలు |
| వాయ్ | వాయి |
| పల్ | పల్లు, పన్ను |
| నాళ్ | నాడు |
| కల్ | కల్లు, (రాయి) |
| కళ్ | కల్లు (మద్యము) |
| ఊర్ | ఊరు |
| నాయ్ | నాయి |
| వెళ్ | వెల్ల |
| తాయ్ | తాయి |
| తమ్మ్రణ్ | తమ్ము్రణ్డు |
| కూళ్ | కూడు |
| పేయర్ | పేరు |
| మగణ్ | మగణ్డు |
| పొన్ | పొన్ను, హొన్ను |
| ఇల్ | ఇల్లు |
| ముళ్ | ముల్లు |
| కాఱ్ | కాఱు |
| నీర్ | నీరు |
| మీన్ | మీను |

| త. | తె. |
|---|---|
| కుళమ్ | కొలను |
| కుళంగళ్ | కొలఁకులు |
| మరం | మ్రాను |
| మరంగళ్ | మ్రాకులు |
| ముదల్ | మొదలు |
| తొల్ | తొల్లి |
| మున్ | మున్ను |
| కడల్ | కడలి |
| విరల్ | వ్రేలు |
| పగల్ | పగలు |
| ఇరుల్ | ఇరులు |
| వేర్ | వేరు |
| పోర్ | పోరు |
| విల్ | విల్లు |
| పెణ్ | పెణ్ణు, పెణు |
| ఆల్ | ఆలు |
| మణ్ | మన్ను |
| అవర్ | వారు |
| ఇవర్ | వీరు |
| వెళ్ | వెండి |
| పశుమ్ | పశిమి |

| త. | తె. | త. | తె. |
|---|---|---|---|
| తోల్ | తోలు | (క. ఆన్) | ఆను |
| కెయ్ | చేయి | ఈన్ | ఈను |
| కురల్ | కురులు | నెయ్ | నేయు |
| ఉయిర్ | ఉసురు | కోయ్ | కోయు |
| తేర్ | తేరు | పాయ్ | పాయు |
| శెయ్యుమ్ | చేయును | తోయ్ | తోగు |
| ఆగుమ్ | అగును | అదిర్ | అదురు |
| పోగుమ్ | పోవును | (క. బెళ్) | వేల్చు |
| కాణ్ | కను | ఏర్ | ఎక్కు |
| మాణ్ | మాను | పోల్ | పోలు |
| కొళ్ | కొను | నిల్ | నిలు |
| చేర్ | చేరు | కొల్ | కొలు (చు) |
| వర్ | వచ్చు | కనల్ | కనలు |
| శెయ్ | చేయు | తళిర్ | తలిరు |
| కేళ్ | (కన్న. కేళు) | కనర్ | కనరు |
| కాయ్ | కాయు | ఆర్ | ఆర్చు |
| తొళ్ | తొలు (చు) | అలర్ | అలరు |
| తిన్ | తిను | నాన్ | నాను |
| ఎన్ | అను | (క. సార్) | చేరు |
| ఎణ్ | ఎన్ను | కూర్ (స్నే. హే.) | కూరు |
| పూణ్ | పూను | అళల్ | అడలు |
| పణ్ | పన్ను | మీఱ్ | మీఱు |

| త. | తె. | త. | తె. |
|---|---|---|---|
| సీళ్ | చీలు | తగుళ్ | తగులు |
| తాళ్ | తాలు | పొరళ్ | పొరలు |

ఈ పై పట్టికనుబట్టి చూడఁగా నాంధ్రమునందలి అజంత పదము లనేకము లిప్పటికి నితర ద్రావిడభాషలలో హలంతములే యైయున్నట్లగపడుచున్నది. ప్రాచీనభాషలోఁ గూడ హలంతములే యైయుండి తరువాతఁ గాలక్రమమున నుచ్చారణ సౌకర్యమునకై తుది నొక ఉకారము*ను గ్రహించిన వగుటచే నుకారాంతములైన వనుటకు సందేహములేదు, ఇట్టి మార్పు తక్కిన ద్రావిడభాషలలోఁగూడ లేకపోలేదు. తెలుఁగువలె కన్నడముగూడ నిటీవలి కాలమున చాలవఱకజంత భాష కాఁజొచ్చినది. తెలుఁగులో "ఇ" కారమును గ్రహించిన శబ్దములు కొన్ని తమిళ కన్నడములలో 'ఉ' కారమును గ్రహించియుండుటను బట్టియే యీ యికారము ఉకారమునుగూడ నుచ్చారణ సౌకర్యమునకై వచ్చి చేరినవే యని తలంపవచ్చును. తమిళ కన్నడముల తచ్ఛబ్దార్థకామహద్రూపైకవచనము "అదు." తె. అది. అట్లే "పత్తు" అను శబ్దము తమిళమున నర్థమాత్రకమగు నుకారమును (కుట్రియలుకరం) గ్రహించి "పత్తు" అని కాఁగా నది కన్నడమున "పదు" అని యుకారాంతంబై యున్నను

* (ఇదియే తమిళమున కుట్రియలుకరమనఁబడుచున్నది. ఇది యర్థమాత్రోకారము.)

తెలుఁగున 'పది' యని యికారాంతంబైనది. కావుననే "అదేమి" అనునపుడికారము లోపించి సంధిజరుగుట. అదు(ది)+ఏమి=అదేమి, పద్(ది)+నాలుగు=పద్నాలుగు. ఇట్లే పదారు మొదలగు రూపము లేర్పడుటయుఁ దటస్థించినది. ఇట్లుచ్చారణార్థముగా వచ్చి చేరిన 'ఉ'కారమున కచ్చు పరమైనపు డిది లోపింపగా పూర్వమందున్న హల్లు తరువాతి యచ్చుతో నెనయుటలో నాశ్చర్యమేమియును లేదు. భాషలో చిరకాలము క్రిందటనే స్థిరపడిన యీయలవాటును బట్టి సహజముగ శబ్దగతమైన యికారముగూడ లోపించి సంధి జరుగుట తటస్థించును. కావుననే ఉకారసంధి నిత్యముగుట తటస్థించినది.

## —ప్రథమావిభక్తి ప్రత్యయస్వరూపము—

ఈ భాషలో ప్రథమా విభక్తి ప్రత్యయములుగా గ్రహింపఁబడుచుండిన డు, ము, వు, లు అనువానిలోని 'ఉ' కారముకూడ నుచ్చారణ సౌకర్యము కారణముగా వచ్చి చేరినది గావుననే దీనికచ్చు పరమైనపు డుకారము లోపించుటయు పరస్వరైకాదేశరూప సంధి గలుగుటయు సంభవించినది. చక్కఁగాఁబరిశీలించి చూచినచో నివి ప్రథమావిభక్తి ప్రత్యయములనుటయే పొసఁగునట్లు తోఁచదు. ఏల యనఁగా నీ భాషలో సామాన్యముగా ప్రాతిపదికమే ప్రథమావిభక్త్యేక వచన రూపమగుచుండెనేగాని ప్రాచీన భాషలో ప్రథమా

విభక్తిని సూచించుటకుఁగాఁ బ్రత్యేక ప్రత్యయములు లేవు. కాఁగా డు, ము, వు, లు అను ప్రత్యయములు ప్రథమా విభక్తిలోఁ గొన్ని శబ్దముల తుది నగపడుచుండఁగా నట్టి ప్రత్యయములు లేవనుట యెట్లు పొసఁగునని యడుగవచ్చును. ఈ ప్రత్యయముల పూర్వ చరిత్రమును వాని పరిణామ క్రమమును ఇంచుక పరిశీలించినచో దీని యాథార్థ్యము తేటపడఁగలదు. సామాన్యముగా నీ ప్రత్యయములలో 'డు' అనునది పుంలింగ శబ్దములపైనను లేదా యాంధ్ర వైయాకరణుల విభాగమును బట్టి మహచ్ఛబ్దముల మీఁదను 'ము, వు, లు' తఱచుగా నపుంసకలింగ శబ్దముల మీఁదను వచ్చుచున్నవి. అమహత్తుల పైని తఱచుగా 'ము' వచ్చును. కాని ఉకారాంతములగు శంభువు, మనువు మొదలగు మహద్వాచకములపైఁ గూడ 'వు' వర్ణము వచ్చుచున్నది. ఇంతేగాక అమహద్వాచకము లన్నిటిపైఁగూడ నీ ము వు లు వచ్చునని చెప్ప వలనుపడదు. ఏలయనఁగా నమహత్తులలో ననఁగా స్త్రీ తిర్యగ్జడములలో స్త్రీవాచక శబ్దములపై నివి వచ్చుట లేదు. ఈ భాషలో స్త్రీలింగద్యోతకమైన ప్రత్యేక ప్రత్యయమే లేదు. ప్రథమా విభక్తిలో ప్రత్యేకముగాఁ దద్విభక్తి సూచకమగు ప్రత్యయము లేకపోవుటయే యీ భాషా సంప్రదాయమున స్త్రీత్వమునకు విశేషలక్షణముగా గ్రహింపఁబడినది. ఇందు 'అది' అను నమహత్సర్వనామరూపమే స్త్రీ తిర్యగ్జడ శబ్దములకన్నిటికి సర్వనామంబుగా వ్యవహరింపఁ

బడుటయే గాక క్రియా రూపములలోఁగూడ 'ది' వర్ణాంత రూపమే స్త్రీ తిర్యగ్జడవాచక శబ్దములతోఁ నన్వయించు చున్నది. అనఁగా తక్కిన ద్రావిడభాషలలోవలె 'అవళ్ శెయ్‌దవళ్' అని స్త్రీ లింగద్యోతక ప్రత్యయముతోఁగూడిన రూపములు లేక, 'అదు శెయ్‌దదు,' అది చేసినది, ఆమె చేసినది, గోవు వెళ్లినది, చెట్టుపడినది, అనురీతిని 'ది' వర్ణాంత క్రియారూపమే యన్నిటికి నన్వయించుచున్నదనుట. ఇట్లే భాషలో నతి ప్రాచీనకాలము నుండియు "అది" అను నమహత్త్వద్యోతక శబ్దము లేదా దాని యవశిష్ట భాగమగు 'ది' అనునదే మహతీత్వామహత్త్వద్యోతక మగుచుండెనేగాని తక్కిన తమిళ కన్నడాదులందువలె నీ భాషలోఁ బ్రత్యేక ముగా మహతీత్వద్యోతక ప్రత్యయ మొకటి కనఁబడుట లేదు. కావుననే ప్రథమైకవచనప్రత్యయ రహితములగు శబ్దము లనన్నింటి నాంధ్ర వైయాకరణులు స్త్రీసమంబులని చెప్పఁ దొడంగినారు.

'విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తులకత్వ స్త్రీవద్భావంబులు విభాషనగు.' 'దూతాదు లకు స్త్రీత్వంబగు' ఇత్యాది సూత్రములచే స్త్రీత్వమును విధించి "స్త్రీలింగఁబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు" అను సూత్రముచేఁ బ్రక్రియకొఱకుఁగాఁ బ్రథమైక వచన ప్రత్యయము నొకదానిని కల్పించి వైయాకరణులు దానిని మరల లోపింపఁ జేసినారు. ఈ స్త్రీలింగ స్త్రీసమ శబ్దము

మీాసమ్, చుట్టమ్" మొదలైనవి. ఈ శబ్దము లన్నిటిలోను, ప్రథమైకవచనమునను బహువచనముననే గాక (ఫలము–, ఫలముల–; గుఱ్ఱము–గుఱ్ఱములు;) తక్కిన విభక్తు లన్నిటిలో నేకవచనమునను బహువచనముననుగూడ ముపర్ణాంతమే యంగముగా నిలిచియున్నది. ఉదా. "ఫలము చేత, ఫలముల చేత, చుట్టమువలన, చుట్టములవలన" మొదలైనవి.

ఇట్లు సర్వవిభక్తులలోను వచనములలోను ప్రాతిపదిక కవయవముగనే నిలిచియున్న యీ ముపర్ణ మాంధ్రభాషలోఁ బ్రథమావిభక్తి ప్రత్యయమెట్లు కాఁగలదు. సంస్కృత నపుంసక శబ్దములలోఁ బ్రథమా ద్వితీయైకవచనముల రెంటను నొక్కటేరూపము పొడచూపుచున్నను తక్కిన విభక్తులలోని యంగమందుఁ బై వానిలోని 'మ' కారము పొడచూపకుండుటచే నది సంస్కృతమందుఁ బ్రథమా విభక్తి ప్రత్యయముగా గ్రహింపఁబడుట తటస్థించినది. కాని యిది తత్సమమై తెనుఁగునఁ జేరునప్పటికది ప్రాతిపదికావయవమే యైన దనవలసియున్నది. చుట్టములు, చుట్టాలు; ఫలములు, ఫలాలు; మీాసములు, మీాసాలు; మొదలగుచోటుల బహు వచనమున నీ 'ము' వర్ణము లోపించుచుండుటనుబట్టి యది ప్రథమావిభక్తి ప్రత్యయమనుటయుఁ బొసగదు. ము వర్ణము లోపించినను అది లోపించినందులకు బదులుగా వెనుకటి యచ్చునకు దీర్ఘము కలుగుచునే యున్నది. మఱియు నిది యేకవచనమున నే విభక్తిలోను లోపించుటయే లేదు.

"చుట్టముచేత, చుట్టచేత, వనములోపల, వనలోపల" అను నీ రీతి రూపాంతరములు లేవుగదా. కావున 'ము' వర్ణము శబ్దావయవమే కాని విభక్తి ప్రత్యయము కాఁజాలదు.

ఇఁక తెలుఁగులో ము వర్ణాంతములను బోలినవే తమిళ కన్నడమున "అమ్మంత" శబ్దములు "మరమ్, కుళమ్" మొదలగునవి కొన్ని కలవు. ఈ శబ్దములు తెలుఁగులో "మ్రాను, కొలను" అను నువర్ణాంతశబ్దములై యుండుటయే గాక విభక్తి ప్రత్యయము పరమైనపు డీ వర్ణము లోపించు టయు లేదు. తమిళమున "అత్తు" అను నొప విభక్తిక ప్రత్యయము చేర్పఁబడుచుండుటచే ద్వితీయాద్యేకవచన రూపములందు నీ 'మ' కార మగపడకున్నను బహువచన మున నిది యన్ని విభక్తులలోను గానవచ్చుచునే యున్నది.

| | |
|---|---|
| మరమ్ | మరంగళ్ |
| మరత్తై | మరంగళై |
| మరత్తాల్ | మరంగళాల్ |
| (మరమోడు) మరత్తోడు | మరంగళోడు |
| మరత్తిర్కు | మరంగళిర్కు |
| మరత్తిన్ | మరంగళిన్ |
| మరత్తినదు | మరంగళినదు |
| మరత్తిల్ | మరంగళిల్ |

ఏకవచనమున నొక ప్రథమా విభక్తిలో మాత్రము నిలిచియున్నదిగదా యని దీనిని ప్రథమా విభక్తి ప్రత్యయ

మనఁజనదు. బహువచనమున "గళ్" అను ప్రత్యయము చేర్పఁబడినపు డీ "అమ్" అనునది యెచ్చటను లోపించుట లేదుగదా. అనఁగా నమ్మంత శబ్దమున కే "గళ్" ప్రత్యయము చేర్పఁబడుచున్నదనుట. ప్రాచీన కన్నడమునఁగూడ బహువచన ప్రత్యయము "అమ్మంత శబ్దము" న కే చేర్పఁబడుచున్నది. కాని యందలి మకారము వికల్పముగా లోపించుటం జేసి మకార రహిత రూపాంతరములు గూడ నా భాషలో నేర్పడుచున్నవి. హొసగన్నడమున బహువచన రూపములలో మకారమే కనఁబడదు. ఎట్లయినను ప్రాచీన కన్నడమునఁగల మకార సహితరూపమే భాషలోఁ బ్రాచీనము గావున నది సహజముగ శబ్దగతమే యనియుఁ గాలక్రమమునఁ దేల్చి పలుకఁబడఁగాఁ దుదకు జాఱిపోయినదనియుఁ దలంపఁ దగియున్నది. మఱియు హొసగన్నడమునందలి "వు" వర్ణాంత శబ్దములు ప్రాచీనములగు మకారాంత శబ్దముల నుండి యేర్పడిన ట్లగపడుటచే వానిలోని మకారము శబ్దగతమే యని తలంపవలసియున్నది.

| త. | హొస కన్న. | తె. |
| --- | --- | --- |
| మరమ్ | మరవు | మ్రాను |
| కుళమ్ | కొళవు | కొలను |
| పులమ్ | హొలవు | పొలము |
| నిలమ్ | నెలవు | నెలవు |
| పణమ్ | హణవు | పణము |

ఇట్లు ప్రాచీనభాషలో "అమ్మంత" ములగు శబ్దము లాయా భాషలలో 'ము' వర్ణాంతములు, 'న' వర్ణాంతములు, "వు" వర్ణాంతములు గూడనైన ట్లగపడుచున్నవి,

సంస్కృత వ్యాకరణ ఫక్కిని కన్నడమున అమ్ అను నది ప్రథమా విభక్తి ప్రత్యయమని తలంపఁబడినట్లే దాని రూపాంతరమగు "ము" వర్ణము తెలుఁగునను, "వు" వర్ణము పూొసగన్నడమునను ప్రథమావిభక్తి ప్రత్యయములుగనే తలఁపఁ బడుచున్నవి. కాని సహజముగ నవి విభక్తిని సూచించినవిగావు. శబ్దగతములే యని చెప్పఁదగియున్నది. ఈ దేశ్య పదముల తుదినిఁ గల "అమ్" అనునది యమహ ద్భావమును సూచించుటకో లేదా పూర్వపదమును విశేషణ ముగా మార్చుటకో, తరువాతి కాలమున నమహచ్ఛబ్దం బులపైఁ జేర్పంబడిన "అత్తు" అను శబ్దమువలెనే, ప్రాచీన కాలమున నాయా శబ్దములపైఁ జేర్పఁబడి యుండుననియు నీ "అమ్" అనునది నిర్దేశార్థకా మహత్సర్వనామమయి యుండుననియు కాల్డ్వెల్ పండితుని యభిప్రాయమై యున్నది. ప్రశ్నార్థక సర్వనామమునుండి "ఏమ్" "ఏన్" అను అను నాసికాంత రూపములు బయలుదేరినట్లే "అదు" అను నిర్దే శార్థక సర్వనామమునుండి "అమ్" "అన్" అను సర్వనామ రూపములు గూడ బయలుదేఱి యుండవచ్చునని యాతడు తలంచెను.

ప్రాచీన భాషలో హలంతములైన శబ్దములు తరువాతి కాల మున నుచ్చారణ సౌకర్యముకొఱకై తుదినొక యుకారమును

గ్రహించిన కారణమున హ్రస్వాకారాంతమునను ఆంధ్రము నను గూడ నుకారాంతములు "ము" వర్ణాంతములగుటయు నా "ము" వర్ణము ప్రథమావిభక్తి ప్రత్యయముగఁ బరిగణింపఁ బడెననియు గ్రహించితిమి గదా. దేశీయములగు మాంత శబ్దములు కొన్ని "నిలమ్" మొదలగునవి కాలక్రమమున తుదినొక "ఉ" కారమును గ్రహించి యుచ్చారణ వశమున "నెలవు" మొదలగు రూపములను బొందియుండ, ధర్మము వంటి తత్సమ శబ్దములుకూడ 'వు' వర్ణాంతము లగుట తటస్థించినది. సంస్కృత శబ్దములగు తరు, శంభు మొదలగు 'ఉ' కారాంత శబ్దముల కచ్చుపరమైనపు డుచ్చారణ సౌకర్యమునకై వచ్చిన వు గాగమముతోఁ గూడిన రూపమునుండి వు వర్ణాంతమే శబ్దముగా విభాగింపఁబడుటచే "తరువు, శంభువు" మొదలగు శబ్దములేర్పడినవి. ఇట్టివాని లోని "వు" వర్ణమును విడదీసి పై మువర్ణమువలెనే యిదియు ప్రథమావిభక్తి ప్రత్యయమని వైయాకరణులు తెలిపి యున్నారు, ఈ "వు" వర్ణము పై 'ము' వర్ణమువలెనే, ద్వితీయాది విభక్తులలో లోపింపకపోవుటచే నిదియుఁ బ్రథమా విభక్తికిఁ జెందినదని చెప్ప వీలులేదు. ఉకారాంతములకు వలెనే "ఓ" కారాంతములకుఁగూడ "వు" వర్ణము వచ్చినది. కావుననే గోశబ్దము "గోవు" అయినది. ఓకార ముచ్చరించిన పిదప వాచికావయవములు అనఁగా, ముందుకు చాచఁబడిన పెదవులు మరల యథాస్థానమును బొందు

సమయములో నొక 'వ' కారము సంధ్యక్షరముగా (glide) బయలుదేరక మానదు. అప్పుడు గో—"గోవ్ + ఉ" గోవు అగును. ఇందలి "ఉ" కార మూఁతగా వచ్చినదే గావున "గోవు+అచ్చట" అన్నపు డది లోపించి "వ" కార మకార ముతోఁగూడి గోవచ్చట అను రూపమగుచున్నది.

ఇఁక "డు" ప్రత్యయముగూడ "ము, వు" ల వలె నేర్పడినదే. కాని యిది యీ రూపమును బొందుటకుఁ బూర్వము తక్కినవానికంటె నెక్కుడు మార్పులకు లోనైనది. ఈ భాషలలో "అన్" అనునది పుంలింగ ప్రత్యయము గను "అళ్" అనునది స్త్రీలింగ ప్రత్యయముగను "అవన్, అవళ్" మొదలగు శబ్దములలో లింగభేదమును సూచించుచు మిగుల ప్రాచీనకాలముననే యేర్పడినవని యిదివఱకే సూచింపఁబడి యున్నది. "అవన్" శబ్దములోని పదాంత నకారమునకుఁ గాలక్రమమున గలిగిన పరిణామమే "వాండు" అను రూపములోని డు ప్రత్యయమునకు మూలమైనట్లగపడు చున్నది. తమిళమున నిప్పటికిని నిలిచియున్న నకారద్వయ లక్షణమును విచారింపఁగాఁ బ్రాచీన భాషలోఁగూడ పద మధ్యమున వచ్చు నకారమునకును, పదాంతమునవచ్చు నకారమునకు నుచ్చారణమందు భేదముండెనని తలంపఁదగి యున్నది. వీనిలోఁ గల భేద మేమనఁగా పదమధ్య నకారము దంత్య నకారమనియును పదాంతమందలి దానిని దంత్యమునకును మూర్ధన్యమునకును మధ్యస్థమై యొకింత

విలక్షణమగు alveolar నకారమని చెప్పవచ్చును. ఏల యనఁగా దంత్యములని చెప్పఁబడుచున్న "త" వర్గాక్షరములు నాలుకను పై దంతములకును దంతములకు సన్నిహితముగానున్న చిగుళ్లకును దగులునట్లుగా పఱచి తాఁకించినపుడు బయలుదేరుచున్నవి. కాని యా నాలుకనే కొంచెము కుదించి దాని యగ్రభాగమును దంతములకు దాఁకకుండ నా దంతములకు సన్నిహితోపరి భాగముననున్న చిగుళ్లకుఁ దాకించినచో, కేవల మూర్ధన్యములగు "ట" వర్గధ్వనులకును దంత్యతవర్గధ్వనులకును మధ్యస్థముగ నుండు నొక విధమగు "ట" వర్గధ్వనులు బయలుదేఱును. ఇవి పదాంతముననే సామాన్యముగా వచ్చుటచే పదాంత టవర్గధ్వనులని చెప్పవచ్చును. ఇవి యింగ్లీషు భాషలోని తుది 'ట' కార ధ్వనిని, then అను దానిలోని నకారధ్వనిని బోలియుండును. ఈ వర్గములోని యనునాసికమే తమిళమున నిప్పటికిని నిలిచియున్న రెండవ నకారము, ன. అనఁగాఁ బదాంత్యమగు పొల్లు నకారము. ఒక పదము చివర నీ Alveolar నకార ముచ్చరింపఁబడునే గాని దంత్య నకారమును పలుకుట కష్టము. స్వాభావికమునుగాదు. కావున వీనిని పదాంత టవర్గమని యనవచ్చును. శకటరేఫ మిచ్చట పుట్టినదే. కావుననే "ఱ" ట్ర ట్ట యగుచున్నది.

"అనఁగా" ఒన్, మూన్, మగన్ మొదలగు శబ్దములలోని నకార మీ పదాంత నకారమే. కావుననే దానిపై

నూఁతగా బయలుదేఱిన పనుపాకరమునఁ గూడ ణకార నకారములకు మధ్యస్థమైన పదాంత "ణ" కారమున్నది. ఈ ధ్వని సంస్కృతభాషా ప్రాబల్యము గలిగిన యిప్పటి కన్నడాంధ్రభాషల వర్ణమాలలో స్థానమును బడయలేదుగాని యీ ప్రాచీనాంధ్రశాసనములలో "ణ" కారమునకును "న" కారమునకును మధ్యస్థమగు లిపి చిహ్నముచేత సూచింపఁబడి యుండుట గానవగును. నన్నయకుఁ బూర్వ శాసనములఁ గొన్నింటిలో అచ్చువాన్ఱు, వేవాన్ఱు, మగన్ఱు, శత్యాదిత్యన్ఱు, శాదిరాజన్ఱు, గోత్రన్ఱు మొదలగు శబ్దములలోని సంయుక్తాక్షరమందలి నకారము క్రిందగల చిహ్నము శకటరేఫ చిహ్నమని తలంచి యీ పదములను శకటరేఫ సహితము లుగాఁ జదివి యీ కాలమున 'ఱు' అనునది ప్రథమావిభక్తి ప్రత్యయముగా నుండెననియు నద్దానిఁ జేర్చుటచే వాన్ + ఱు = వాన్ఱు, మగన్ + ఱు = మగన్ఱు, ఇత్యాది రూపములయ్యెననియు నవియే యీ శాసనములలోఁ గానవచ్చుచున్నవనియుఁ గొందఱు తలంచిరి. కాని యిది శకటరేఫ చిహ్నమునకును "డ" కార చిహ్నమునకునుఁగూడ భిన్నంబగు చిహ్నముగాఁ గానంబడుచు పై రెంటికిని భిన్నంబైన రీతి నుండుటచేతను, * నిది దంత్య మూర్ధన్య వర్గలకు నడిమి వర్గయగు alveolar వర్గములోని డకారమునకు గుర్తుగా గ్రహింపవలసి యుండు నని తోఁచుచున్నది.

Cf. * అహదనకరశాసనము (భారతి), వేటూరి ప్రభాకరశాస్త్రులు గారు.

ఈ సందర్భమునఁ బ్రాచీనభాషలో నిట్టి వర్గ మొకటి యుండియుండుననుటకుఁ దమిళమున నొక వర్గ ముండుటయె నిదర్శనము. తమిళభాషలోని వర్ణములను తమిళ వైయాకరణులు "వల్లినం"=పరుషాక్షరములు, "మెల్లినం"=సరళాక్షరములు, "ఇడైయినం" = అంతస్థములు అని మూఁడు భాగములుగాఁ జేసియున్నారు. అందుఁ బ్రతిభాగమందు నారేసి యక్షరములు గలవు. క, చ, ట, త, ప, ఱ ఇవి వల్లినం— పరుషములు ; ఙ, ఞ, ణ, న, మ, న్ (పదాంత నకారము) ఇవి మెల్లినం—సరళములు. య, ర, శ, ల, వ, ఱ ఇవి ఇడైయినం – అంతస్థములు. ఈ విభాగమును బట్టి చూడఁగా "మెల్లినం" వర్గములోఁ దుదివర్ణముగాఁ దెలుపఁబడిన నకారమునకు "వల్లినం" ఱకారమునకు నుత్పత్తి స్థానమున నభిన్నత్వమే యుద్దేశింపఁబడెననుటకు సందేహములేదు. కావుననే, "కొళ్—కొణ్" ధాతువుపై "తు" చేరినపుడు కొండు, కొండేన్, మొదలగు రూపములు కాఁగా శల్+తు=శన్ఱు; ఎన్+తు=ఎన్ఱు, కన్ఱు, అను నీ సందర్భములలోఁ బదాంత నకార మీ భాషలో దానికి సవర్ణమగు ఱకారమునే గ్రహించుచున్నది. అనఁగా "త" కార మీ పదాంత నకారమునకుఁ బరమైనపుడా పదాంత నకారమునకు సవర్ణంబైన 'ఱ' కారముగా మాఱుచున్నదనుట. ఇట్లె "ఒన్, మూన్" శబ్దములుకూడ తుది నొక ఉకారమును గ్రహించినపుడు 'ఒన్ఱు, ఒణ్ణు, మూన్ఱు, మూణ్ణు" అని యగుటయేగాక (ఈ ప్రాచీన

రూపములు మళయాళభాషలో నిప్పటికిని వాడుకలో నున్నవి.) తుది "న" కారము సజాతీయమగు "ఱ" కారము నూఁతగాఁ గ్రహించుటఁజేసి "ఒన్ఱు, మూన్ఱు" అను రూపాంతరములు ప్రాచీనభాషలోనే యేర్పడినవి. ఇవి "ఒన్డ్రు, మూన్డ్రు" అని పదాంత డకార సహితముగాఁ బలుకఁ బడుచుఁ దమిళ భాషలోఁ బ్రాచుర్యము వహించియున్నవి. ఇవి కాలక్రమమున నాంధ్ర కన్నడ భాషలలోఁ ఒణ్డు, మూణ్డు, అను రూపములను బొందినవి.

ఇట్లే పదాంత నకారముతోఁ గూడిన "అవన్" అను నది తుది నొక యుకారమును గ్రహించినపుడు మధ్య నా నకారముతో సావర్ణ్యముగల "ఱ" కారమే యూఁతగా వచ్చుటచే "అవన్ఱు, వాన్ఱు" అనురూపము లేర్పడఁగా కాల క్రమమున "వాన్ఱ్రు, వాణ్డు, వాండ్డు, వాఁడు" అను రూపము లాంధ్రమున సిద్ధించియుండును.

ప్రాచీనశాసనములలో నకారము క్రింద పదాంత "డ" కారమే వ్రాయంబడియుండ "ణ్డు" అని ణకారముక్రింద డకారము వ్రాయంబడిన రూపము తరువాతికాలపు శాసనములలో గనఁబడుచున్నది. ప్రాచీన భాషలోఁ బ్రత్యేకవర్ణముగాఁ బరిగణింపఁబడి, తమిళమున నిప్పటికి నిలిచియున్నదగు నీ రెండన పదాంత నకారము తెలుఁగులోఁ బ్రత్యేకవర్ణముగాఁ గ్రహింపఁబడకపోవుటచే దంత్య నకారమే దాని స్థానమునఁ గూడ వ్రాయంబడుచు వచ్చినది. ఇఁక దానితో సంయోగ

మును జెందిన వర్ణము ప్రాచీనభాషలో నలఘురేఫమే అనఁగా వల్లినం అకారమే లేదా శకటరేఫమే యైనను దెనుఁగున దాని కలఘూచ్చారణమే నిలిచి వాడుకలో "ట్ర" కారోచ్చారణమంతరించినది. ఆస్థితిలో 'అనన్' మగన్ మొదలగు వానినుండి యేర్పడిన "అవన్టు, వాన్టు మగన్టు" అను శబ్దములను వ్రాయవలసివచ్చినపుడు నకారము క్రింద కేవల శకట రేఫమునే వ్రాయక దానికిఁ గొంచెము విలక్షణమగు లిపిని, శకట రేఫమునకును డకారమునకును భిన్నమగు దానిని కల్పించి యా ప్రాచీనంబగు నుచ్చారణ మున కనుకూలముగఁ జేసి యా పదాంత డకారమును వ్రాతలో సూచింపఁ జొచ్చిరనవలసి యున్నది.

మొత్తముమీఁదఁ బరిశీలింపఁగా విభక్తి ప్రత్యయ మనఁబడు 'డు' వర్ణము పదైకదేశమేగాని వేఱుగాదు. కాల క్రమమున పదాంత డకార ధ్వనియంతరించి "డ" కారధ్వని వ్యక్తమగుట తటస్థించినపుడు—అనఁగా "వాన్డు" అను నుచ్చారణము ప్రబలమైనపిదప నకారముక్రింద డకారమునే వ్రాయఁ జొచ్చిరి. ప్రాచీన శాసనములలో నీ సందర్భముల నకారముతో సంయోగమును జెందిన వర్ణము పదాంత డకారము కాలక్రమమున మూర్ధన్య డకారమై తనకుఁ బూర్వమందున్న దంత్య నకారమునుగూడ మూర్ధన్యముగా (ణకారముగా) మార్చివేసినది. కావుననే మగణ్డు, మగండు, మగఁడు అను రూపములు సిద్ధించినవి. ఇట్లు "అవన్,

మగన్” మొదలగు శబ్దములు తెలుఁగున “వాఁడు, మగఁడు” అను రూపములను చెందఁగా ద్వితీయాది విభక్త్యులను, సూచించు శబ్దములు—లేదా ప్రత్యయములు అవన్ + ఇ= అవని—వాని, మగన్+ఇ=మగని మొదలగు సోప విభక్తిక వర్ణములతోఁగూడిన రూపముపై అనఁగా షష్ఠీ రూపముపైఁ జేర్పఁబడుచుండ ప్రథమలో నట్టి దగపడకుండుటచే సహజముగ శబ్దగతమేయైన డు వర్ణమును విడఁదీసి దానిని ప్రథమా విభక్తి ప్రత్యయముగాఁ దరువాతి వైయాకరణులు తలంచుట తటస్థించినది. “రాముఁడు, భీముఁడు” మొదలగు తత్సమ శబ్దములకన్నిటికి “అవన్, మగన్” శబ్దముల సాదృశ్యము చేతనే విభక్తి రూపము లేర్పడినవి. మొత్తముమీఁద “ము, వు” లలో వలెనే యీ ‘డు’ ప్రత్యయమునందలి తుది “ఉ” కారముగూడ, నుచ్చారణ సౌకర్యము కారణముగా వచ్చినదే కాని, మూలశబ్దమునకుఁ జెందినది కాదనియు నది లోపించినందువలన నర్థభంగమేమియు కాదనియు వ్యక్తమగుచునే యున్నదికదా.

ఇఁక బహువచన ప్రత్యయమగు ‘లు’ ను గూర్చి విచారింతము:—సర్వనామ శబ్దముల బహువచన రూపములలో మకార రేఫములు వకారము బహువచన చిహ్నములుగఁ బ్రాధాన్యమును వహించియున్నవి. ఇవియే యీ భాషలోఁ బ్రాచీనంబులగు బహువచన ప్రత్యయములుగా తలంపఁ దగియున్నవి. కాని తమిళ మళయాళములతో నస్మ

దర్థమున, "యామ్, నామ్, నోమ్" అనియు యుష్మదర్థమున "నీర్, నీయర్" అనునవియేగాక త-నాజ్గళ్, మళ-"తాజ్ గళ్" అని గళ్ ప్రత్యయాంత బహువచన రూపములుగూడఁ గానవచ్చుచున్నవి. ఈ 'గళంత రూపములీ భాషలలోఁ గూడఁ దక్కిన వానికంటె నర్వాచీనములనుటకు సందేహము లేదు. మిగిలిన ద్రావిడ భాషలలో నొక్క "తులు భాష"లో మాత్రమే యీ "గళ్" ఇంచుక మార్పుతో "నికుళు, యెంకుళు" అని యుష్మదస్మదర్థ బహువచనరూపములలోఁ గానవచ్చుచున్నది. ఆంధ్రమున యుష్మదర్థమునను, తదర్థమునను, మీరు, వారు, అను బహువచన రూపములకు రూపాంతరములుగ "మీరలు, వారలు" అను లువర్ణాంత రూపములుకూడ కనఁబడుచున్నవి. కాని యవియు భాషలో మిగుల నర్వాచీనము లనుటకు సందియము లేదు. మఱియు కొలఁకులు గోఁగును మొదలగు గొన్ని శబ్దములలో "గళ్" ప్రత్యయము సంపూర్ణముగనే కనఁబడుచుండ కూర్గు భాషలోని "నంగ, ఎంగ, నింగ" అను రూపములలో గళ్ లోని పూర్వభాగమగు "గ" కారమే బహువచన ప్రత్యయముగా నిలిచియున్న ట్లగపడుచున్నది. దానినిబట్టి తెనుఁగు సర్వసామాన్యముగ బహువచన ప్రత్యయముగా గ్రహింపఁబడుచున్న 'లు' వర్ణమును, కూర్గుభాషలో తుది 'ళ్' కారము జారిపోవుటచే నిలిచిన "గ" వర్ణమును, తక్కిన తమిళ కన్నడములలోఁ గనఁబడుచున్న "గళ్" ప్రత్యయమునొక్క

యవశిష్టాంశము లేయని నిశ్చయింపఁ దగియున్నది. ఇంతేగాక తెలుఁగున కలన్వాదులయు గోన్వాదులయు బహువచన రూపమున నిష్పత్తి క్రమ సందర్భమున నీ లువర్ణము మాత్రము చేర్చుటయేగాక దానికి "కుజ్" విధానముకూడ నావశ్యక మగుటం జేసి యాంధ్రమునఁ గూడ ప్రాచీనకాలమున "గళ్" అనునదే బహువచన ప్రత్యయమై యుండెననియు నది యొక ఉకారము నూఁతగా గ్రహించి 'లు' వర్ణమునకు మూలమయ్యెననియు నేర్పడుచున్నది.

ఇట్లే యీ భాషలోని బహువచన ప్రత్యయమగు "లు" వర్ణములోని తుది యుకారము తక్కిన "ము, రు" లలోని ఉకారమువలెనే యుచ్చారణ సౌకర్యము కారణముగా వచ్చి చేరినదే కాని, సహజముగ శబ్దగతము కాదని తెలియ వచ్చుచున్నది. మఱియు నీ లువర్ణము కేవల బహువచనార్థకమై యన్ని విభక్తులలోను గూడఁ జేర్పఁబడుచునే యుండుటచే నిది ప్రథమావిభక్తి ప్రత్యయమనుట యెంతమాత్రము సమంజసము కాదు. తమిళమునందలి మరమ్—మరంగళ్, మరత్తాల్—మరంగళాల్; మరత్తోడు, మరత్తిన్—మరంగళోడు, మరంగళిన్; మొదలగు బహువచన రూపములందు "గళ్" పొడచూపుచున్నట్లే "ప్రభువులు" ప్రభువులుచేత, ప్రభువులువలన" అను నట్లుగాఁ బ్రథమా "లు" వర్ణమే తక్కిన విభక్తులలోని బహువచన రూపము లందును నగపడక కొంచెము

మాఱ్పుఁ జెంది "ప్రూఁకులచేత, ప్రూఁకులవలన, ప్రూఁకుల యందు" అనువానిలో "ల" కారముగాఁ గనఁబడుచున్నది గనుకనే మొదటి "లు" వర్ణమును ప్రథమావిభక్తి ప్రత్యయముగా నైయాకరణులు గ్రహించియుందురు. కాని దాని పూర్వస్థితిని గమనించినచో నది ప్రథమా విభక్తికి ప్రత్యేక చిహ్నము కాదనుట వ్యక్తమగును. వాస్తవముగాఁ దక్కిన విభక్తులలోఁగూడ "లు" వర్ణమేకలదు. కాని యీ "లు" వర్ణాంత ప్రాతిపదికమునకును నీ శబ్దములకును గల సంబంధమును వ్యక్తము చేయుటకుగా నొపవిభక్తిక ప్రత్యయమగు నొక అ వర్ణము (ఇది విశేషణ విశేష్య భావద్యోతకము) చేర్పఁబడుటచే ప్రూఁకులు + అ + చేత = ప్రూఁకులచేత, ప్రూకుఁలు+అ+వలన్ = ప్రూఁకులవల్ (ప్రూఁకులయొక్క వలను) అనువానిలోని లు వర్ణము ల వర్ణమగుట తటస్థించినది. కావున ప్రథమలోని "లు" వర్ణమే తక్కిన విభక్తులయందును గానవచ్చుచున్నదనియు నిది బహువచనద్యోతక ప్రత్యయమే కాని ప్రథమా విభక్తి ప్రత్యయము కాదనియు నిర్ణయింపవలసియున్నది.

ఇట్లు ప్రథమావిభక్తి ప్రత్యయము లనఁబడుచున్నవి విభక్తి ప్రత్యయము లెంతమాత్రము కావనియు, వాని తుది నున్న ఉకారము ప్రాచీన కాలమున హలంతములైయున్న శబ్దములపై నుచ్చారణ సౌకర్యమునకై చేర్చికొనఁబడినదే గాని శబ్దగతము కాదనియు స్పష్టము. ఈ యుకారము

లోపించిన నునర్థమునకు భంగము కలుగబోదు గావున నీ యుకారము లోపించి సంధి నిత్యముగ జరుగుట సంభవించినది.

## — ప్రథమేతర విభక్తి సంధి —

ఈ పై కారణములచేఁ బ్రథమా విభక్తి ప్రత్యయములుగా గ్రహింపఁబడిన వాని యుకారమునకు సంధి నిత్యముగనే జరుగవలసియుండెను. ఇఁక బ్రథమేతర విభక్తుల లోని యుకారమునకు మాత్రము వైకల్పిక సంధి గలుగుటకుఁ గల కారణమేమో మనము పరిశీలింపవలసియున్నది.

సూః—"ప్రథమేతర విభక్తి శత్రర్థ చు వర్ణంబులయందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును." అని బాలవ్యాకరణ సూత్రము.

ప్రథమేతరములగు విభక్తి ప్రత్యయములలో నుకారాంతములైనవి ద్వితీయా ప్రత్యయమగు "ను", చతుర్థ్యేక షష్ఠీ ప్రత్యయమగు "కు", సప్తమ్యర్థకమగు "అందు" అనునవి గలవు.

వీనిలో అందు అనునది "అఁ౯" అనుదాని రూపాంతరమే. దీని ప్రాచీనరూపము "అల్" అనునది. స్థల వాచకములగు "అల్" ఇల్, ఉల్, శబ్దములలోని తుది లకారము నకారముగా మాఱుటచే "అన్, ఇన్, ఉన్" అను రూపములఁ బొంది సప్తమ్యర్థమున పదముల తుదిని జేరి కాలక్రమమున సప్తమీ ప్రత్యయములుగా వ్యవహరింపఁ బడుచు

వచ్చినవి. ఇవి తెలుఁగులో "న" కారాంతములుగా మాఱి నను ప్రాచీనములగు వీని లకారాంత రూపములే కన్నడ, తమిళములలో నిప్పటికిని సప్తమీ విభక్తి ప్రత్యయము లుగా వాడుకలో నున్నవి. కన్న. "అల్లి-మరదల్లి", ఒళ్- ఇది 'ఉళ్' శబ్దముయొక్క రూపాంతరమే—మరదొళ్; త. ఇల్ : మర త్తిల్. తమిళమున "ఇన్"గా మారిపోయిన ఇల్, శబ్దముమీఁదనే, మరల "ఇల్," శబ్దము సప్తమ్యర్థ చిహ్నముగాఁ జేర్చుటగూడ తటస్థించినది. "మర త్తిల్"— రూపాంతరము—"మర త్తినిల్" "అల్" అనునదే తుది నొక యికారమును గ్రహించి "అల్లి" యై కన్నడమున సప్తమీ ప్రత్యయముగా నేర్పడినది. అదియే తుది లకారము "న"కార ముగా మారినపిదప నొక "ఉ" కారము నూఁతగా గ్రహించి "అన్ను.-అందు" యై తెనుఁగున సప్తమీ విభక్త్యర్థమున "అన్" అనుదానికి రూపాంతరముగా నేర్పడినది. ఈ "అన్" అనునదే "ఇంటన్, ఊరన్" మొదలగు శబ్దముల తుది నిప్పటికిని గానవచ్చుచునే యున్నది. ఇట్లీ తుది యుకార ముచ్చారణ సౌకర్యమునకై కాలక్రమమున నేర్ప డినదే కావున నచ్చుపరమైనపు డది లోపించుచున్నది. అట్లే యైనచో వికల్పసంధికిఁ గారణమేమని ప్రశ్నకలదు.

'అందు' అనుదాని పూర్వరూపమగు "అన్" అనునది నకారాంతమై యుండుటచే దాని రూపాంతరమగు నిదిమాత్ర మెందుకు ద్రుతాంతము కాఁగూడదను సామ్య దృష్టిచేత

"అందు" శబ్దమునుకూడ నిటీవలివారు ద్రుతాంతముగాఁ జేసి యుందురు. లేదా దీనిపైఁ గొంతకాలమునకు మరల ఉల్ (ఉన్) చేర్పఁబడుటచే ("అందులో" అన్నట్లే) "అందున్" ఏర్పడియుండును cf. త, మరత్తినిల్. ప్రాచీనకాలమున నది కళయే యనుటకు శాసన ప్రయోగములు భారతాది ప్రయోగములుగూడ నిదర్శనము లగుచున్నవి. సామాన్యముగా "అందు+ఉండె=అందుండె" అను రూపమే వ్యవహారమునఁ బ్రసిద్ధము. "అందునుండె" అనునదొకప్పుడు సముచ్చయార్థకమగు ఉన్ అనుదానితో గూడినదియు గావచ్చును. ఇది కావ్యములలో ఛందస్సౌకర్యమునకుగాఁ బ్రయోగింపఁబడుచు నుండెనేగాని వ్యవహారమున నంతగాఁ బ్రాచుర్యమును వహింపలేదు. కావున నిది యర్వాచీన రూపమని తలంపనగును.

ఇఁక చతుర్థ్యర్థ ప్రత్యయమగు "కు" వర్ణముపై సంధి నైకల్పిక మగుటకుఁ గల కారణమును తెలిసికొనవలసి యున్నది.

దీని ప్రత్యయావస్థ చిరకాల రూఢమై యుండుటచే నిది యే మూలపదముయొక్క యవశిష్టభాగమో తెలిసికొనుట యంత సులభ సాధ్యముకాదు. కాని యర్థ సంబంధమును బట్టి యిది యగు ధాతువునకు సంబంధించిన భాగమై యుండునని తలంపవచ్చును. ఏల యనఁగా రామునకు నిచ్చెననునప్పుడా యియ్యఁబడినది రాముని సంబంధముకలది

యను భావమును తెలుపుచున్నదిగదా. కావుననే యాంధ్రమున దీనిని సంబంధార్థము తెలుపు షష్ఠి యని వాడి యుందురు. రామునకు నిచ్చె—అనఁగా రామునిది అగునట్లుగా నిచ్చెనని యర్థము. త. ఎనక్కు—నినక్కు, క. ఎనగె—నినగె మొదలగు రూపములలో నీ "కు" వర్ణము "అ" కార పూర్వకమేయై కానవచ్చుచున్నది. "రామునకు నిచ్చె" "రామునిది అగునట్లుగా" నిచ్చె అను నర్థము వ్యక్తము చేయుటకు అగు ధాతు సహాయ మాదికాలమునఁ గ్రహింపఁబడి యుండును.

ఈ "అగు" ధాతువును జేర్చుటచే స్వామ్యాది సంబంధము వ్యక్తము చేయఁబడుచున్నది. "అగునట్లుగా" అనునప్పుడు "అగు" లోని "గు" వర్ణముపై "న"కార మెట్లు వచ్చినదో "రామునకు నిచ్చె" అనునప్పుడుకూడ "కు" వర్ణముపై నకారమునట్లే వచ్చినది. "అగును" అనునది ప్రాచీన కాలమందలి సంపూర్ణ క్రియారూపమునకు సంబంధించినదై, కొన్ని సందర్భములలో మాత్రమే నిలిచియున్న యీ ను వర్ణము షష్ఠీ ప్రత్యయముగఁ గాలక్రమమునఁ బరిణమించిన "కు" వర్ణమును గూడ ద్రుత ప్రకృతికముగాఁ జేయుటకుఁ గారణమైనది. ఇట్లు "న" వర్ణ మాంధ్రమున ఉదంత తద్ధర్మార్థ విశేషణములపైఁ గనపడుచున్నట్లే, "కు" వర్ణముపైఁ గూడఁ గనఁబడు చున్నది. ఇఁక తద్ధర్మార్థక విశేషణము లందువలెఁ గాక "రామునకిచ్చె" ఇత్యాదులందలి సంధి

యుచ్చారణ సౌకర్యమునకై చేర్పఁబడుచుండు "ఉ" కార మువంటిదే యను తలంపుతోఁ జేయంబడియుండును. కొన్ని టిలో నచ్చు లోపించి కేవల కకారము మాత్రమే నిలిచి యున్నది. cf. తుళు తుద. క్. గ్. కన్నడమున నిది కె—గె యను రూపములు గలదై యున్నది.

విభక్తి ప్రత్యయములలో ద్రుతాంతమైనది ద్వితీయా ప్రత్యయమగు "ను" అనునది మఱియొకటియే కలదు. ఇదియు పై "కు" వర్ణమువలెనే పూర్వమున నికారమున్న పుడు నికారాంతముగా మాఱుచున్నది. కావుననే ని, ను, అనునవి రెండునుగూడ ద్వితీయా ప్రత్యయములుగా గ్రహింపఁ బడు చున్నవి. అయినను "ను" అనునదే దీని తొలిరూప మనుటకు సందేహములేదు. కన్నడమునఁ బ్రాచీన రూపములు హలంతములే యైయున్నవి. ప్రథమ—మరం, ద్వి—మరనుం, మరవమ్, మరనమ్. తుళు—యనమ్-(నన్ను), నినన్-(నిన్ను), హొస కన్నడమున నీ హలంతరూపము లజంతములైనవి. అన్ను, ను, అనునవి ద్వితీయా ప్రత్యయములైనవి.

| హ. క | హొ. క |
|---|---|
| ఇదమ్=(దీనిన్) | ఇదన్ను |
| అవళమ్ | అవళన్ను |
| మరమం | మరవన్ను=(వృక్షమును) |

దీనినిబట్టి యీ ద్వితీయా ప్రత్యయము భాషలో నెట్లే ర్పడియున్నను, ప్రాచీనకాలమున నిది హలంతమేయనియుఁ

దరువాతి కాలమున నది యుకారము నూఁతగా గ్రహించి యుకారమైనదనియుఁ దలంపవలసియున్నది. ఆంధ్రమునఁ గూడఁ దుది నుకారము లేక హల్మాత్ర నకారముతోఁ గూడిన రూపములే ప్రాచుర్యమును వహించియున్నవి— వానిన్, రామున్, వనములన్. కావున నన్నడిగె యను శబ్దము నన్ను+అడిగె అను శబ్దముల కలయిక వలనఁగాక నన్+అడిగె, అను శబ్దముల కూడికవలననే యేర్పడియుండును; కాని "నన్ను" శబ్దము భాషలో నేర్పడుటచేత "నన్ను+అడిగె," అని యుండఁగా ఉకారము లోపించి పరస్పర మేకాదేశమై సంధి జరిగినదని తలంపఁబడుచున్నది. విచారింపఁగా నీ భాషలోని ద్వితీయావిభక్తి ప్రత్యయములగు ను, న్ను, అనునవి యీ భాషలోఁ బ్రాచీనతమంబులగు ఉత్తమ, మధ్యమపురుష సర్వనామముల ద్వితీయా రూపములగు నన్, నిన్, అను వానికి సంబంధించినవనియు, నివి కాలక్రమమున నొక ఉకారము నూఁతగాఁ గొని నను, నన్ను, నిను, నిన్ను కాఁగా వానిలోని ను, న్ను, లు ద్వితీయార్థ బోధకములని యెంచి వాని నా శబ్దములనుండి విడదీయుటచే నేర్పడినవనియుఁ దలంపఁదగి యున్నది. నన్ను, నిన్ను, అను సర్వనామ శబ్దములు ఉకారాంతములై భాషలో స్థిరపడిన వెనుక వీనిపై మరల నువర్ణము కూడఁ జేర్పఁబడినది. కావుననే నన్నును+అడిగె=నన్ను నడిగె, అను రూపాంతరమును కలిగినది. ఇట్లు ప్రథమేతర విభక్తులలోని "ఉ" కారమునకు సంధి వికల్పమగుట తటస్థించినది.

ఇక శత్రర్థక చువర్ణము. ఇది వర్తమానార్థమున ధాతువునకుఁ జేర్పఁబడుచుండును. ఉకారాంతములైన ప్రథమేతర విభక్తులును, వర్తమానార్థక చువర్ణంబును, తెలుఁగు భాషలో ద్రుత ప్రకృతములగుచున్నవి. ప్రథమేతర విభక్తుల యుకారాంత ప్రత్యయములెట్లు ద్రుత ప్రకృతములైనవో యితర ద్రావిడభాషల సామ్యమునుబట్టి చూపఁబడినది. తెనుఁగు నందలి యాధునిక వర్తమానార్థక రూపముల నాధునిక కర్ణాటక రూపములతోఁ బోల్చి చూచినచో నివి యభిన్నములే యని తెలియకపోదు, "చేస్తున్నాను, హో౦స. క—మాడుత్తేనె. Cf. మాడుత్తుం—చేస్తూ, కట్టుత్తుం—కట్టుతూ; ఇళియుత్తే=దిగుతు. మాడుత్తుం—అను దానికి సరియగు వాడుక మాట చేస్తూఅని కలదు. చేయుచున్నాఁడు అనునది గ్రంథములందు నిలిచిన రూపము. వర్తమానార్థమున నగపడుచున్న ఉతు, ఉచులతోఁ గూడిన రూపములలో తు వర్ణాంతములే చు వర్ణాంతములకంటెఁ బ్రాచీనములని చెప్పఁదగి యున్నది. చేయుదు, కట్టుదు, అను "ఉదు" అంత మందుగల తద్ధర్మార్థక రూపములకును వీనికిని భేదమున్నట్లగపడదు. ప్రాచీన కన్నడమున "గెయుతుం" గెయుత్తుం, (=చేస్తూ) అను మకారాంత రూపములుగూడ వర్తమానా సమాపక క్రియలుగా నున్నవి. ఇది "గెయితు" అనుదానికి సముచ్చయార్థక "ఉమ్" చేర్చుటచే నేర్పడినదని కాల్డ్వెల్ పండితుని యభిప్రాయము. "గెయుతుం"అనునది తెలుఁగునందలి చేయుచున్

అను దానితో నభిన్నంబనియే చెప్పవచ్చును. కావున నిందలి నకారము సముచ్చయార్థక ఉమ్—ఉన్, అను దానికి సంబంధించిన దనుటయే యుక్తముగా నున్నది. 'ఉమ్' చేర్చిని యప్పుడు, చేయుచు+ఉండె=చేయుచుండె, అని సంధియే జరుగుచుండెడిది.

తెనుఁగున తద్ధర్మార్థక రూపమే విశేషణ రూపముగాను క్రియారూపముగాను చిరకాలము వాడఁబడియుండుటచే వర్తమానార్థక క్రియా రూపమున కావశ్యకతయే లేకపోయినది. ఈ భాషలో వర్తమానార్థక రూపము కల్పింపవలసినపుడు, చేయును—చేయుతు అను తద్ధర్మార్థక శబ్దమునకు రూపాంతరమగు "చేయుచు" అను దానిపై వర్తమానార్థసూచకమగు "ఉండు" ధాతువుయొక్క విశేషణ రూపమగు ఉన్న అనుదానిఁ జేర్చి చేయుచు+ఉన్న=చేయుచున్న, అను రూపమును కల్పించినారు. ఈ "చేయుచున్న" అను శబ్దమును "చేయుచు+ఉన్న" అని విడఁదీసినచో భాషలో చేయుచు అను రూపము, "చేయుచున్ అ *" అని విడదీసినచో నకారాంత రూపము నేర్పడియుండవచ్చును. లేదా "ఉన్" సముచ్చయార్థకమైన గావచ్చును. ఈ రెండు రూపములు నేర్పడిన పిదప వీనిపై నజాది శబ్దములు చేరునపుడు "చేయుచేగెను, చేయుచునేగెను" అను రూపము లేర్పడి యుండును.

---

* ఈ 'అ' అనునది విశేషణార్థద్యోతకముగా నీ భాషలలో గొన్ని శబ్దములపై జేరుచుండును.

పదము చివర "న" కారముండుట తటస్థించినచో నది తరువాతి యచ్చుతో నెనయవలసినదే. ప్రథమేతర విభక్తుల లోని నకారాంత ప్రత్యయముల తుదిని, శత్రర్థక చువర్ణము తుదిని గల నకారముతోఁబాటు ఇఁకాదులలోఁ గల నకారము మాత్రమే లోపించునుగాని తక్కిన చోటులందలి పదాంత నకారము లోపింపదని చెప్పుటకే "ఇఁకాదులకుఁ దప్ప ద్రుత ప్రకృతికంబులకు సంధి లేదు" అని సూత్రించి వ్యాకరణకర్త యా స్థలముల సంధిని వారించినాఁడు. "ఇక" శబ్దము, ఇని-ఇన్(ద)+కాన్=ఇంకాన్=ఇంకఁ అని నకారమంత మందుకలదై నది. వ్యవహార వేగమున తుది నకారము జాఱ విడువఁబడినపుడది అకారాంతావ్యయముగా గ్రహింపఁబడు టచే సంధిగతరూపము గూడ నేర్పడియుండును.

## — అపదాది స్వరసంధి —

ఇంతవరకు పదద్వయ స్వరసంధిని గూర్చి తెలుపఁ బడినది. సామాన్యముగా నీ భాషలోని యజంత శబ్దము లన్నియు నకారేకారోకారాంతములే యగుటచే వీని కచ్చు పరమైనపుడు జరుగు సంధికార్యములే చెప్పఁబడుట తటస్థించి నది. ఇఁక నపదాది స్వరంబు పరంబగునపుడు జరుగు సంధిని గూర్చియు వైయాకరణులు తెలిపియున్నారు. "పదము" "అపదము" అను సంస్కృత వైయాకరణుల సంకేత మీ ద్రావిడ భాషలకు వర్తింపఁజేయుట సమంజసము కాదు. "సుప్తిఙంతంపదం" అని సుబంత తిఙంతశబ్దములు పదములని

సంస్కృత వైయాకరణులా భాషా సంప్రదాయము ననుసరించి యొక సంకేతము నేర్పఱచినారు. ఆ సంకేతమునే యవలంబించి యాంధ్ర వైయాకరణులును అపదసంధినిగూర్చి ప్రత్యేకముగా నిట్లు చెప్పఁగడంగిరి. "అంద్వవగాదులందప్పు నపదాది స్వరంబు పరంబగునపుడు సంధి నిత్యముగానగును" అని. "అందు" "అవ" అనునవి తొలుత స్వతంత్రపదములే యై యుండినను, ప్రత్యేకార్థమున మఱికొన్ని శబ్దములపైఁ జేర్పఁబడి కాలక్రమమునఁ దమ ప్రత్యేకతను గోల్పోవుటచే అపదములని తలంపఁబడు స్థితికి వచ్చినవి. 'అందు, ఇందు, ఎందు' అను శబ్దములు స్థలవాచకములై యిప్పటికిని భాషలో స్వతంత్ర ప్రయోగము కలవై యున్నవి "అందున్నాడు" అనియేగాక "అందలి వస్తువు, అందులకు, అందుచేత, అందు వలనఁ, అందుకొఱకు" అని విభక్తి ప్రత్యయములనఁబడు చున్న యితరపదములతోఁ గూడికొని వ్యవహరింపఁ బడు చున్నవి. "అందు" అనునది స్థలవాచకములగు తక్కినవాని కంటె తఱచుగా శబ్దములపై జేర్పఁబడుటచే సప్తమీ ప్రత్యయముగా వైయాకరణులు గ్రహించిరేకాని "మీఁద, క్రింద, దగ్గఱ, ముందు, వెనుక" మొదలగు శబ్దములన్నిటివలెనే యిదియు నొక స్వతంత్రశబ్దమే. తమిళమున నిట్లే మేల్, కీళ్ మొదలగునవి సుమారిరువది శబ్దములు సప్తమ్యర్థమున వచ్చునవిగాఁ దెలుపఁబడినవి. ఇవియన్నియు విభక్తి ప్రత్యయములు, అపదములు ననియే వైయాకరణుల దృష్టిలో చెప్పవలసి యుండును.

ఈ భాషలో విభక్తి ప్రత్యయములని చెప్పఁబడిన వానిలో పెక్కింటికి కిట్లే వ్యస్తప్రయోగ ముండుటచే వానిని గూడ ప్రత్యయములనుట సమంజసముకాదు. "అందు" అను దానివలెనే "అవ" అనునదియు నొకప్పుడొక స్వతంత్రపదమే కాని యిప్పుడది ప్రత్యేకపదముగా నంత వాడుకలో లేదు. "అవ" అనునది "అగు" ధాతువునుండి యేర్పడిన క్రియాజన్య విశేషణము. "అగు+అ=అవు+అ=అవ." ఈ "అగు" ధాతువునుండి యేర్పడిన భూతకాలిక క్రియాజన్య విశేషణము మాత్రమే అనఁగా '"అయిన' అను శబ్దముమాత్రమే యిప్పుడు సామాన్య వ్యవహారమునఁ గనఁబడుచున్నది కాని యీ "అవ" అనునది పూరణార్థమునఁ జిరకాలముక్రిందటనే స్థిరపడిపోయి "మూఁడవ, నాలవ" మొదలగు శబ్దములలో మాత్రమే పొడసూపు చున్నది. మూఁడవ—మూఁడవది యనఁగా మూఁడు అగునట్టిది అని యర్థము. "అవ" అనునది సంఖ్యా వాచక శబ్దసాహచర్యమువల, వానితోఁ గలిసిపోయి తన సహజ స్వరూపమును సులభముగా వ్యక్తముచేయకలేక పోవుచున్నది గాని విడిగాఁ జెప్పినప్పుడు "మూఁడు అగు" అని అగుశబ్దమే ప్రయోగింపఁ బడుచున్నది. కొందఱు ప్రాచీన కవుల గ్రంథములలో మూఁడవ అనుటకు బదులుగా మూఁడగు అను ప్రయోగమే కానవచ్చుచున్నది. భారతమున "ఏడగుపర్వంబు, మూఁడగుపర్వంబు" అను నిట్టి గువర్ణాంత రూపములకును ప్రయోగముకలదు. అనంతుని ఛందములో

"ఏడవు" అను "వు" వర్ణాంతరూపముగూడఁ గాన వచ్చు చున్నది. కావునఁ విశేషణ రూపముగా గ్రహింపఁబడు చుండిన 'అయిన' అను దానివలెనే యిదియు అగు ధాతువు నుండి యేర్పడిన విశేషణ శబ్దముయొక్క (అనగా "అగ" అనుదాని) రూపాంతరమే కాని వేఱుకాదు. దీనినిబట్టి "అయిన అను భూతకాలిక క్రియాజన్య విశేషణమువలెను, దీనికంటె భాషలో నర్వాచీనములగు "చేయుచున్న, చేయఁ గల" అను వర్తమాన భవిష్యత్క్రియాజన్య విశేషణముల వలెను, నీ భాషలోఁ బ్రాచీన కాలమునఁ దద్ధర్మార్థక క్రియా జన్య విశేషణములలోఁగూడ చేయు అను దానివంటి ఉకా రాంత రూపములేగాక "అ" కారాంత రూపములుకూడ నుండెనని యూహింపఁదగియున్నది. ఆ రూపములేవో కొన్ని యర్థములలో స్థిరపడి ప్రత్యయావస్థను పొందియుండుటచే నీ భాషలోఁ జేయు, అగు, అను ఉకారాంత శబ్దములే తద్ధ ర్మార్థక క్రియాజన్య విశేషణములుగా నిలిచినవని తలంపఁ దగియున్నది. ఇఁక ఎఁడు గాగమము ఇంచుగాగమము అని ఆగమ మాత్రములుగా గ్రహింపబడుచున్న ఎఁడు, ఇంచులు గూడ స్వతంత్రపదములే. ఎఁడు శబ్దమునకు తమిళ మళయాళ ములలో "ఎత్తు" అని యర్థము. చేతితో ఎత్తుట—తూఁచుట అనియు నర్థము కలదు (to hold up, to weigh in a balance) ఎడుత్తు అనునదే యీ భాషలో "ఏత్తు" అయియుండును. వీసెఁడు అనఁగా వీసె ఎత్తు, చేతితోఁగాని త్రాసుతోఁగాని

ఎత్తి పీసె బరువున్నదని నిర్ణయింపఁబడినది. ఇది తరువాత ద్రోణాది పరిమాణమును దెలుపు పదములకుఁ గూడఁ జేర్పఁబడినది. cf. మానెఁడు, కుంచెఁడు. కొలతలోఁగూడ కలదు- మూరెఁడు, బారెఁడు.

ఇంచు :—"ఇంచు, ఇచ్చు" అనునవి "ఈ" ధాతువు యొక్క రూపాంతరములే. కన్నడమునగూడఁ "ఇసు" అని యనునాసిక రహితమైన రూపము కలదు. cf. రంజించు, భాగించు, కన్న—రంజిసు, భాగిసు. మాటాడు, వేటాడు, కొండాడు, తూటాడు మొదలగువానిలో చలనార్థకమగు ఆడు ధాతువు, చేయుట అను నర్థము నిచ్చుచు వెనుకటి పదములను వేఱు ధాతువులుగా నెట్లు మార్పఁ గలుగుచున్నదో యట్లే ప్రాచీనకాలమున "ఇచ్చు" అనునది కూడ సహాయ ధాతువుగా నితర ధాతువులకుఁ జేర్పఁబడి వానికి క్రియారూప సిద్ధిని గలిగించినది. దేశ్య ధాతువులపై ప్రేరణార్థమునఁ జేర్పఁబడుచు వచ్చిన యీ "ఇచ్చు" ధాతువు సంస్కృత ధాతువులను తెలుఁగు ధాతువులుగాఁ జేయుటకుఁ జేర్పఁబడు సహాయ ధాతువుగాఁ గూడ నుపయోగించుకొనఁబడినది. ఉత్తర పదము పూర్వపదముతోఁ జేరిపోయి తన ప్రత్యేకతను గోలుపోవు స్థితికి వచ్చినపుడే—దాని ప్రత్యేకార్థము స్ఫురింపకున్నపుడే, దానికిఁ బ్రత్యయావస్థ వచ్చును. కావున నిత్య సంధియే కలుగవచ్చును. కాని యీ విషయముకూడ చాలవఱకుఁ బూర్వపదాంతమునఁగల స్వరము యొక్క

స్వాభావముమీఁదను నర్థమునకు భంగము కలుగకుండు నం తటి వ్యవహార ప్రాచుర్యము మీఁదను ఆధారపడి యుం డును. రాముల+అందు, అనునపుడు లకారముమీఁది అకా రమునకు విశేషార్థముకలదు కావున సంధి సామాన్యముగా జరుగకూడదు. కావుననే రాములయందు అనురూపము భాషలో నున్నది. కాని వ్యవహార వేగమున "రాములందు" అనురూపముకూడ నేర్పడినది. ఇచ్చట నకారాంత పదముపై అందులోని అకారము పరమగుటచే సంధికి సౌకర్యమేర్పడి నది. అకారముపై నూఁదిపలుకవచ్చును. హరి+అందు, అన్నపుడట్టి సంధి కాలేదు. హరిశబ్ద రూపహాని కలుగును గాన నిత్యసంధి సూత్రమునుండి అందు, అవగాదులను తప్పిం చవలసి వచ్చినది. వసియించు, వసించు అను రెండు రూప ములు నుండుటచే "ఇంచు" అను దానిఁగూడ వాస్తవ ముగా అందాదులలోఁ జేర్పవలసినదే. ఇంతవఱకు భాష లోఁ బ్రధానములుగా గ్రహింపఁదగిన అకార, ఇకార, ఉకార సంధులను గూర్చి చెప్పఁబడినది. పూర్వ పరస్వరం బులకుఁ బరస్వరైకాదేశరూప సంధి యీ యచ్చులు పదాం తమున వచ్చునపుడే జరుగుచున్నది గదా.

—: ద్విరుక్త టకారము :—

"కుఱు, చిరు, కడు, నిడు, నడు శబ్దముల అడల కచ్చు పరంబగునప్పుడు ద్విరుక్త టకారంబగు" చున్నది. అనఁగా—కుఱు+ఉసురు=కుఱుసురు, చిరు+ఎలుక=చిఱెలుక

నడు+ఇల్లు=నడిల్లు, అని సంధి కావలసియుండఁగా నట్టి సంధి జరుగక, పూర్వమందలి అ కార డ కారముల స్థానమున ట్టకార మొకటి ఆదేశముగా వచ్చుచున్నదనుట. అ, డల స్థానములో 'ట్ట' వచ్చుచున్నదనుట కంటె అ డ లకు అజాది పదము పరమగునపుడు అవి ద్విరుక్తటకారముగా మాఱు చున్న వనుట యుక్తతరంబయి యుండు నేమో? ఏల యనఁగా సంహితలోని రెండు పదములను జేర్చి యుచ్చ రించు సందర్భమున నుచ్చారణ సౌకర్యముల కనువగు ధ్వనులు (యకారము వకారము) ఏమయిన నడుమనువచ్చి యుచ్చారణకు సహాయము చేయవచ్చును, లేదా పూర్వ పరాక్షరములకుఁ గలిగిన సంయోగముచే నాయా వర్ణము లలోఁ గొంతమార్పు గలుగ వచ్చును. కాని పూర్వపదాక్ష రములతో సంబంధములేని వర్ణము లెచ్చటనుండియో వచ్చి చేరుననుట సంభావ్యము కాదుగదా. అట్టివే కలిగినచో నవి యా పూర్వపరశబ్దముల సంబంధమును వ్యక్తము జేయుట కుఁగాఁ బ్రాచీనకాలమునఁ జేర్పఁబడిన యొక ప్రత్యేక పదము యొక్క లుప్త శేషములగు వర్ణములయిననుఁ గావలయును. లేదా వేఱొక శబ్దముయొక్క సామ్యముచేఁ (anology) జేర్పఁబడినవైనను గావలయును. కావున సంధిలో నాగమా దేశ విధానమున వైయాకరణులు చేసిన సందర్భములందెల్ల నవి యెట్లు వచ్చినవో పరిశీలించి వాని సహజస్వరూపమును గుర్తింప యత్నింపవలసియున్నది. ప్రస్తుతము "కుట్టుసురు"

అను సమాసపదములో "కుఱు" శబ్దమునకు "ఉసురు" శబ్దము పరమైనపుడు ద్విరుక్త టకార మే కారణము చేత వచ్చిన దని పరిశీలింపఁగా ఱ, డ లస్థానమున నిది వచ్చియుండుటచే తను, మూర్ధన్యములగువానితో నిది సావర్ణ్యము కలదగుట చేతను, ఱ, డ, లే ట్టవర్ణముగా మాఱినవని చెప్పుట యుక్తముగాని వాని స్థానమున "ట్ట" వర్ణ మెచ్చట నుండియో వచ్చినదనుట యుక్తముగా లేదు. ఈ సందర్భములో "ఱ" "డ" లు ద్విరుక్తటకారముగా మారుటకుఁగల కారణ మితర సన్నిహితభాషలలో నిలిచియున్న ప్రాచీన సంప్రదాయములను గమనించినచో మనకు సుబోధంబగును. సామాన్యముగా నీ భాషలలో నొక వాక్యములోని పదములకుఁగల సంబంధము విశేషణ విశేష్యభావరూపంబై యున్నది. ఈ సంబంధమును సూచించుటకు తొలుత స్థానమే ప్రధానసాధనము—అనఁగా బూర్వపదము విశేషణము నుత్తరపదము విశేష్యము నగుచుండును. వెండిచెంబు ; పొన్‌ముడి ; తల్లిపాలు అని యీ రీతిగా రెండు నామవాచక పదము లొకదాని వెనుక నొకటి నిలిచినచో నందు తొలిపద ముత్తరపదమునకు విశేషణమగుచుండును. వెండి చెంబు అనునప్పుడు "వెండి" శబ్దము నామవాచకంబే యైనను "చెంబు" శబ్దమునకు విశేషణ మగుచున్నది. వెండితోఁ జేయఁబడిన, వెండికి సంబంధించిన చెంబు=వెండిచెంబు. ఇట్టి శబ్దములలో స్థానమే వాని సంబంధమునకు సూచకమైనది. ఈ సంబంధ భావముం

దెలుపుటకు కేవలస్థానమే సమర్థమయిన మార్గముగా గనపడ నప్పుడు — అనగాఁ బూర్వపదముయొక్క విశేషణత్వము దాని స్థానమునుబట్టియే సువ్యక్తము కాదని తలంపఁబడినప్పుడు పూర్వపదమును విశేషణముగా మార్చుటకుఁగా ననేక మార్గము లవలంబింపఁబడినవి. వానిలోఁ బూర్వపదము తుది హల్లును ద్విత్వముచేసి పలుకుట యొకటి. "చిఱు" శబ్దము నందలి తుదిహల్లగు శకట రేఫమునకు ద్విత్వముచేసి (ఱ్ఱ్) అని పలుకునపుడు "ఱ" కార ధ్వని బయలుదేఱు స్థానమున నాలుకనొత్తి పలుకవలసియుండుటచే నా స్థానమున గలిగిన స్పర్శవలన స్పర్శవర్ణంబగు "ట" కారముతోఁగూడిన "ట్ర్" అను ధ్వని బయలుదేఱును. కావున కుఱు+ఉసురు; చిరు+ ఎలుక—కుట్ర్+ఉసురు, చిట్ర్+ఎలుక అనియు, పిదప రకార లోపముచే, 'కుట్టుసురు', చిట్టెలుక అని సంధిగత రూపము లును వ్యవహారమున నేర్పడుచున్నవి. అట్లే "నడు" శబ్దము నందలి డకారమును ద్విత్వముచేసి పలికినపుడది పరుషత్వ మున్నుగూడఁ బొందుటచే "డ్డ" యనిగాక "ట్ట" యని పలుకఁ బడుచున్నది. పదమధ్యగత సరళము ద్విరుక్తిఁ జెందినపుడు పరుషముగాఁ బలుకఁబడుట ప్రాచీన ద్రావిడభాషా సంప్ర దాయముగాఁ గనఁబడుచున్నది. కావున చిఱు, కుఱు, నడు శబ్దములందలి ఱకార డకారములు పదమధ్యమున ద్విత్వమును బొందినపుడు ద్విరుక్తపరుషములుగా నుచ్చరింపఁబడుట, యీ భాషలో నిలిచియున్న ప్రాచీనభాషా సంప్రదాయ

చిహ్నమై యున్నదని తలంపనగును. "చెట్టెలుక" మొదలగు శబ్దములను తరువాతికాలమున చిట్టి+ఎలుక అని విభాగించుటచే భాషలో "చిట్టి" చిటి శబ్దములుకూడ నేర్పడి యుండును. చిఱిచాప, చిఱునగవు మొదలగు రూపములు "చిట్టెలుక" మొదలగు వానికంటె మిగుల నర్వాచీనములు.

పూర్వపదము విశేషణమై నిలిచినపు డందలి తుది సరళము పరుషమై ద్విత్వమును బొందుచుండుట మఱికొన్ని సందర్భములలోఁగూడఁ గానవచ్చుచున్నది. cf. త. పాంబు+కొడి,=పాప్పుకొడి; మరుందు+పై =మరుత్తుప్పై; ఇరుంబు+కోల్ = ఇరుప్పుక్కోల్ , మాడు+తోల్, = మాట్టుత్తోల్. సరళాంతములగు నకర్మక ధాతువులు సకర్మకములైనపుడు గూడ నిట్లే పరుషద్విత్వములు కలుగుచున్నవి. దీని కుదాహరణము—త. పెరుగు–పెరుక్కు (=పెంచు) ; అడఙ్గు–అడక్కు ; ఆగు–ఆక్కు (ఆపుట) ; నీఙ్గు–నీక్కు ; తిరుందు–తిరుత్తు ; నిరమ్బు–నిరప్పు. ఇరుమ్బు, పామ్బు, వేమ్బు, అమ్బు, ఎలుమ్బు మొదలగు బు వర్ణాంత శబ్దములన్నియుఁ దెనుఁగున ము వర్ణాంతములై వ్యవహరింపఁబడుచున్నను, సమాసములం దివి పూర్వపదములై విశేషణములగుట తటస్థించినపుడు పదాంత సరళ బవర్ణము తెలుఁగు సమాసములలోఁగూడఁ బరుషత్వమునే పొందుచున్నది. ద్విత్వముమాత్ర మిం దగపడుట లేదు. ఇరుమ్బు+కోల్=ఇరుప్పుక్కోల్ అని తమిళ రూపమగు చుండగాఁ దెనుఁగున "ఇనుపకోల" యని మాత్ర

మగుచున్నది. సరళము పరుషమగుట రెండు భాషలకు సమానమే. పామ్బు+కోడి=పాప్పుక్కోడి యని తమిళమునకాఁగా పాము+జేడు=పాపజేడు, అని తెలుఁగు రూపము. అట్లే అంపకోల, ఎంపగూడు, వేఁపచెట్టు మొదలగువానిలోని తొలి పదమునందలి 'ము' వర్ణమునకు బదులుగా "పు" వర్ణము కానవచ్చుచున్నది. ఈ మార్పుతోఁగూడిన రూపములను సాధించుటకే ఆంధ్ర వైయాకరణులు:

సూ॥ కొండొకచో సమాసంబులందు నామ్యాదిక నుమ్యాదుల ముువర్ణంబులు పుఙ్వర్ణంబులగు॥

బాల. సమా. 19 సూత్రము.

అని ముువర్ణమునకు పుఙ్వర్ణ విధానమును చేయ వలసిన వారైనారు. ఈ సామాసములు భాషలో మిగులఁ బ్రాచీనము లనియుఁ దెలియవచ్చుచున్నది. ఇట్లే ద్విరుక్త టకార విధానము, పుఙ్ పువర్ణ విధానము మొదలగునవి పూర్వపదము విశేషణముగా మాఱునపు డా మార్పునకుఁ జిహ్నముగాఁ బ్రాచీన కాలమునఁ బదాంత సరళమును పరుషముగాఁ జేసియు ద్విరుక్త పరుషముగాఁ జేసియు బలుకు సంప్రదాయమును సూచించు చున్నదని చెప్పఁదగి యున్నది. తమిళమున "తొల్కాప్పియనార్" వర్ణసమామ్నాయమున సరళ వర్ణములను గ్రహింపకుండుటచే నాతని కాలమునఁ బరుషములే కాని సరళ వర్ణములే లేనట్లగపడుచుండుట చేతను నిప్పటి తమిళ వ్యవహారమున ననునాసిక పరమగు పరుషము

సరళముగాఁ బలుకుచుండు నలవా టేకాలమున బయలు దేరి నదో చెప్పుట కవకాశము లేకుండుటచేతను దేశ్యపదములఁ గొన్నిటిలో ననునాసికములపై పరుషములే పలుకు నలవాటి ప్పటికి నుండుటచేతను ప్రాచీనభాషలో "తొల్కాప్పియ నార్" కాలమునకుఁ గూడ క, చ, ట, త, ప, ఱ అను పరుషాక్షరములాఱే వ్యవహారమున నుండెనని తలంపవలసి యున్నది. తరువాత ననునాసికతోఁ గూడినప్పుడు కాని యజ్మధ్యస్థము లైనపుడుగాని యివి సరళములుగ నుచ్చరింపఁ బడుట వాడుకలోనికి వచ్చి యుండును. పదాదిని గల పరుష మజ్మధ్యస్థమగుట కవకాశము లేకుండుటచేతనే పరు షముగనే నిలిచిపోయినది. ఈ పదాది పరుషమునకుఁ బూర్వ మొక పదము నిలుచుట తటస్థించినచో నిది పదమధ్యస్థమే యగును గావున నా వర్ణము సరళముగా నుచ్చరింపఁబడు చున్నది. ఇట్టి సంప్రదాయమును బట్టియే ద్వంద్వాది సమా సములలో నుత్తరపదాదిని పరుషములు నిలిచినపు డవి సరళ ములుగ మాఱుచున్నవి. ఇఁక ద్విత్వాక్షరములు పదమధ్య మున నజ్మధ్యస్థములగుట కవకాశము లేకుండుటచే వానికి సహజమగు పరుషోచ్చారణమే నిలిచియుండుట తటస్థించినది. "మయక్కం" (மயக்கம்) అనునపుడు ద్వితీయ కకారము నకుఁబూర్వము హల్మాత్రకకార ముండుటచే నది యజ్మ ధ్యస్థము కాలేదుకదా. కావుననే దాని పరుషోచ్చారణము స్థిరమైయున్నది.



# సమాస సంధి

## — ప్రాఁతాదులు —

ఏ కాలమునం దైనను భాషను వ్యాకరించి లక్షణము చేయఁదలఁచిన వైయాకరణులు తమ కాలమున భాషలో నేర్పడి వ్యవహారములో నున్న రూపముల సహాయమును బట్టియే ప్రాచీన పదబంధములకు రూప నిష్పత్తి కల్పించుటకై యత్నింతురు. ఆంధ్రమున ప్రాఁగెంపు మొదలగు కొన్ని ప్రాచీన సమాసములను సాధించుటకై చేయఁబడిన లక్షణమే దీనికి నిదర్శనమగుచున్నది.

"ప్రాఁతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబుల కెల్ల సమాసంబుల లోపంబు బహుళంబుగా నగును" అను బాల వ్యాకరణ సూత్రము ప్రాఁత+ఇల్లు అని యుండఁగా తొలి పదములోని బిందుపూర్వక తకారమును లోపింపఁజేసి "ప్రాయిల్లు" రూపమును సాధించినది. ఇట్లే లేఁత+దూడ= లేదూడ, పూవు+రెమ్మ=పూరెమ్మ అనునవియు సాధింపఁ బడినవి. పువర్ణ విరహితమగు "పూ" శబ్దముకూడ భాషలో నున్నది గావున నీ తుది సమాసము పూ అను దానితోఁ జేయఁబడిన సమాసమే యనవచ్చును. ఇంక లేదూడ, ప్రాయిల్లు శబ్దములు లేఁత, ప్రాఁత శబ్దములతోఁ గూడి యేర్పడిన సమాసములేనా యను సందేహము కలుగక మానదు. లేతదూడ—లేద్దూడ, పాతయిల్లు—పాతిల్లు అను

నర్వాచీన రూపము లీ కాలమునఁగూడ వాడుకలో మనకు వినఁబడుచున్నవి. కావున లేదూడ, ప్రాయిల్లు అనునవి లేఁత ప్రాఁత శబ్దములతోఁ గూడిన సమాసములుగాఁ గనఁబడవు. వీనిలో పరపదాదియందు అచ్చో సరళమో యుండుటచే ననునాసికము విధించు నావశ్యకత లేకపోయినది. కాని పరుషాది శబ్దముతోఁ గూడిన ప్రాఁగెంపు, లేఁగొమ్మ మొదలగు సమాసములలో ప్రాఁత, లేఁత శబ్దములలోని యనునాసికమును మొదట లోపింపఁజేసినను మరలఁ దెచ్చిపెట్టవలసిన స్థితి గలిగినది. కావున వాస్తవముగా ప్రాఁగెంపు, లేఁగొమ్మ మొదలగు సమాసములు తక్కినవానివలెనే ప్రాఁత, లేఁత శబ్దములతోఁ గూడి యిటీవలి కాలమున నేర్పడినవిగాక భాషలోఁ బ్రాచీనములైయుండునని తలంపవలసి యున్నది. ప్రాఁత లేఁత శబ్దములలోని "త" కారము "మూఁత, కోఁత" చేఁత మొదలగు వానిలోని 'త' వలెనే యేదో యొక యర్థమున ధాతువుపై వచ్చి చేరినదే గాని, సహజముగ ధాతునిష్ఠము-లేదా మూలరూప గతము కాదని తెలియుచున్నది. కావున "ప్రాఁత" అనునది ప్రాం+త—ప్రామ్+త అని యుండఁదగును. గావున దీని వెనుకటిరూపము "ప్రామ్" అయియుండు ననుటకు సందేహము లేదు. ఇప్పటికిని దక్షిణ దేశమందలి తెలుఁగువారీ శబ్దమును ప్రాంతయనియె పలుకుచున్నారు. cf. ప్రాంత చింతపండు. తమిళ కన్నడములందీ యర్థమున నె "పరమ్" అను రూపముండుటనుబట్టి "పరమ్" అనునది యే

వర్ణ వ్యత్యయము (Metathesis) మూలముగా "ప్రామ్" అయియుండునని నిశ్చయింప నగును. అప్పుడు "పరమ్+కెంపు=ప్రామ్+కెంపు=ప్రాఙ్గెంపు=ప్రాఁగెంపు-ప్రాఁగెంపు" అని యీ విధముగా నీ సమాస మేర్పడియుండును. 'ప్రాయిల్లు' అనుదానిలో నగపడని "న"కారమిందుఁ గనఁబడుచుండుట, దానినిబట్టి సరళాదేశాదులగుట యిందు సంభవించుచున్నది. ఈ యనునాసిక యుక్తరూప నిష్పత్తిని సాధించుటకే వ్యాకరణకర్త "లుప్తశేషంబునకుం బరుష సరళములు పరములగునపుడు నుగాగమంబగు" నని "ప్రాఁత" శబ్దములో మొదట పూర్వ సూత్రముచే బిందు పూర్వక త కారమునంతను లోపింపఁజేసి మరల నుగాగమ విధానమును జేయవలసినవాఁడయ్యెను. సహజముగ శబ్దగత మగుటయో, లేదా ప్రత్యేకార్థద్యోతకమై మధ్య నిలుచుటయో సంభావ్యంబై యుండునుగాని "ప్రా"శబ్దమునకు పరుషాది శబ్దములు పరమైనపుడే మధ్య నకారము వచ్చినదనుట సంభావ్యము కాదుగదా. "పరఙ్గెంబు, ఇళఙ్గొంబు" మొదలగు నితర ద్రావిడభాషా శబ్దములతో వీనిఁబోల్చి చూడఁగా "త"వర్ణము చేర్పఁబడక పూర్వము "పరమ్" అను శబ్దమునకు 'కెంపు' శబ్దము చేర్చుటచేతనే యీ సమాస మేర్పడి యుండుననియు, నా కారణముచే "ప్రాఁతకెంపు" మొదలగు వానికంటె నిది భాషలో ప్రాచీన సమాసమై యుండుననియు నూహింపఁదగియున్నది. అయితే తమిళమున నగపడు 'పరఙ్గెంబు' శబ్దము కాలక్రమమున మాఱి

'ప్రాఁగెంపు' అయినదనుట కంటె "ప్రాఁత+కెంపు" అను శబ్దములోని ప్రాఁత శబ్దముయొక్క తొలియచ్చు మీఁది వర్ణంబులకు లోపము వచ్చిన తరువాత "ను" గాగమము వచ్చుటచేతనే యీ భాషలో నేర్పడిన ప్రాఁగెంపు అను తెలుఁగు రూపము నుండియే పరజ్గెంబు అను తమిళభాషా రూపమేర్పడి యుండఁగూడదా? తమిళమున "పరజ్గెంబు" అను రూపమున్నంత మాత్రమున ప్రాఁగెంపు శబ్దము దాని నుండి వచ్చిన దనవలెనా యని యడుగవచ్చును. తమిళమున ననునాసికముతోఁగూడిన సమాసములే వ్యవహారములో నుండుటచేతను ఆ భాషలో పై సమాసములను విడదీయ వలసి వచ్చినపుడవి పరమ్+కెంపు, ఇళమ్+కొంబు అనియో లేదా పర+మ్+కెంపు, ఇళ+మ్+కొంబు అనియో విడదీయఁ బడినవే యగుటచేతను మఱియొక విధముగా విగ్రహ వాక్యము చెప్పఁబడక పోవుటచేతను ప్రాఁత, లేఁత-ప్రాఁగెంపు, లేఁగొమ్మ శబ్దములు మన భాషలో నేర్పడక పూర్వమే "పరజ్గెంబు, ఇళజ్గొంబు" శబ్దము లేర్పడియున్నవని తలఁచుట కవకాశ మేర్పడుచున్నది.

ఇఁక మధ్యనున్న యనునాసి విషయమై విచారింపవలసి యున్నది. దాని స్వరూపమెట్టిదో తెలిసికొనఁ గొంత పరిశీలింతము. ప్రాంత అనుదానిలోని యనునాసికము 'త' వర్ణము చేర్పఁబడునప్పటికే యచ్చట నిలిచియున్నదని తలంపనగును. ఈ ద్రావిడ భాషలలో నొక ధాతువు మఱియొక ధాతువుతోఁ

జేరినపుడు వాని విశేషణ విశేష్య భావమును సూచించుటకో లేదా యుచ్చారణ సౌలభ్యముకొఱకో యొక యనునాసికము చేరుచుండుట స్వాభావికముగాఁ గనఁబడుచున్నది. ఒక్క ధాతువులోఁగూడ నది ద్వ్యచ్కమై పరుషవర్ణములతోఁ గూడినదయినచో నా పరుషమునకుఁ బూర్వ మొక యనునాసికము బయలుదేఱి యా పరుషమును సరళముగా మార్పుటయు సంభవించుచుండెను. ఈ భాషలలో మూల ధాతువులని తలంపఁదగిన, ఆ, ఈ, ఊ ల రూపాంతరములగు 'అగు, ఇచు, ఉతు' అను వానిని చూతము. అగు—అకు—అక్క—అంగు, అనియు, ఈగు—ఇక్క, ఇచు—ఇచ్చు, ఇంచు ; ఉతు, ఉత్తు, ఊదు, ఉందు, అనియు వీనిలో ననునాసికముతోఁ గూడిన రూపములుగూడఁ గనఁబడుచున్నవి. కావున నే యీ ధాతువులు ధాత్వంతరములపైఁ జేరినపుడు తునుగు—తునుంగు, వెలుగు—వెలుంగు, తొలగు—తొలంగు, అడచు—అడంచు, తలచు—తలంచు మొదలగు రూపము లేర్పడుచున్నవి.

ఇచు=ఇసు—ఇంచు

| | | |
|---|---|---|
| కన్న— | చిత్రిసు | తె—చిత్రించు |
| | రక్షిసు | రక్షించు |
| | ఆలిసు | ఆలించు |
| | అప్పళిసు | అప్పళించు |
| | సైరిసు | సైరించు |

ఉదు

ఆఱ్ + ఉదు

అఱ్దు } { అఱుందు—అందు
అద్దు } { (cf. అందదుకు) అద్దు

కన్న. ఉఱ్=to be, to be joined—ఉత్తు

త. ఉఱు=to be, exist, to draw near. approach.

తుళు. ఉన్తు=to stand, to remain.

కన్న. ఉత్తు — తు. ఉన్తు.

త. చేయుందు — తె. చేయుదు.

కన్నడ భాషలో కర్మధారయ సమాసములం దుకారాంత కృదంత శబ్దములకు గ జ ద బ వర్ణములాదిఁగల శబ్దములు పరమైనపుడు మధ్య బిందువు వచ్చుచున్నది.

ఎత్తుంగోల్, కుత్తుంగటి, పుట్టుంగురుడం (పుట్టుగ్రుడ్డి), కరుచ్చుంగల్లం, చురుచ్చుంగొల్లి, ఇనుకుంగర్బం, ఉకుఱుందొఱె, అందుదొఱె, బత్తుంబయం, ఆడుంబాలం, మించుంబుఱు, కట్టుంజోళం, సిడియుందలె.

మొత్తముమీఁద క్రియా వాచకములు గాని గుణవాచకములుగాని యగు పదములపై విశేషణ సమాసములలో పరుష సరళాదులగు శబ్దములు నిలిచినపుడు మధ్యనొక యనునాసిక మొకకాలమున బయలుదేఱుట తటస్థించినదను విషయము గమనింపఁ దగియున్నది. ప్రస్తుతము మనము

విమర్శించుచున్న 'పరమ్, ఇళమ్' శబ్దముల ప్రాచీనరూపము లెట్టివో యించుక తెలిసికొందము.

"ప్రాఁత, ఱేఁత" యను తెలుఁగు శబ్దములలో సమానార్థకములై సజాతీయములని చెప్పఁదగిన మూల ధాతువులు "పఴె, పఴై; ఏళ్, ఎళ, ఎళై" అనునవిగా గనఁబడుచున్నవి. కన్నడమునందలి పఴె. పఴై, తమిళమునందలి పఴై, తెలుఁగు నందలి "ప్రా" యనునవి "ప్రాఁత" శబ్దముయొక్క మూల రూపములుగాఁ గనఁబడుచున్నవి. వీనికి పండుట, ప్రాచీనము అని యర్థము. తమిళ మళయాళముల "పఴు" అనుదానికి పరిపక్వమును జెందుట (to ripen, to grow old) అని యర్థము కలదు. కొన్ని సమాసములలో నీ శబ్దమనునాసిక రహితమైయే గానవచ్చుచున్నది. కన్న. పఴ అలగు (an old knife blade): పఴగన్నడ (ప్రాచీన గన్నడము), పఴనెల్ (ప్రాఁత ధాన్యము). దీనినుండి హొసకన్నడమున 'హాళసు=పాడగు' (to become old, worn out, decay, to go to ruin, to be spoiled) అను ధాతువుకూడ బయలుదేఱినది. తెలుఁగులోని "పాడు" ధాతువునకు "పాడగుట—చెడిపోవుట" యను నర్థము 'పఴ' ధాతువునుండి యేర్పడినదే. ప్రాఁతదియై క్షీణించి, చెడిపోవుటయే పాడగుట. "పాటిదిబ్బల"నఁగా చిరకాల నివాసముచే శిథిలములై పాడయిపోయిన యిల్లు, కూలిపోయిన పిదప నట నిలిచియున్న ప్రాఁత మట్టి దిబ్బలన్నమాట. ఇట్లు తెలుఁగులోని పాడు ధాతువు—"పఴు" ధాతువునుండి

మే యేర్పడినది. ప్రాచీనభాషలోని "ఱ" కారము తెలుఁగున "డ" కారమగుచున్నదనుట కిది మఱియొక నిదర్శనము. ఈ 'పఱ' ధాతువునుండియే తమిళమునందలి "పఱమ్" తెనుఁగు నందలి "పండు," కన్న. "పణ్, హణ్ణు" మొదలగు శబ్దము లేర్పడినవి. "పఱు"-ధాతువు "పరిపక్వమగుట" యను నర్థముకలదగుటచే పఱం-పండు = పక్వమైనది, కావుననే "పసరు" కాయవలెఁ గాక (green and tender) పరిపక్వమును బొందిన ఫలమని యర్థముకలిగినది. "పండుగ" అను శబ్దముకూడ దీనికి సంబంధించినదే. సంస్కృతము నందలి "ప్రాక్" శబ్దమునకుఁగాని "ఫల" శబ్దమునకుగాని, తెలుఁగులోని ప్రాఁత, పండు మొదలగు శబ్దములతోడను తక్కిన దక్షిణ దేశ భాషలలోని వింత యక్షరమగు "ఱ" అను దానితోఁ గూడిన "పఱ" శబ్దముతోడను సంబంధము కలదనుట విచారణీయము.

ప్రస్తుతము మనము గమనింపవలసిన దేమనఁగా ప్రాచీన రూపము "పఱ" యనియే యున్నను దానినుండి బయలుదేరిన పఱమ్, పణ్ణు, పండు, పండుగ మొదలగు రూపములలో నది యనునాసిక సహితమై గానఁబడుచున్నది కావున "పఱ" ధాతువుపై మఱియొక ధాతు వేదో చేర్పఁబడి యుండుటచే గాని, దీని విశేషణత్వము సూచించుటకై యొక యనునాసికము చేరుటవలనఁ గాని, "పఱమ్" అను రూపమేర్పడినదనియు నా మీఁద 'పఱమ్గెంపు' మొదలగు సమాసము లేర్పడిన వనియు నైయున్నది.

"లేఁత" శబ్దమునకు మూలరూపములు "ఎళ్, ఎళ, ఎళె" అని తుళు కన్నడములందును, "ఇళ" అని తమిళము నను గలవు. తెలుఁగున "ఎడ, ఎల, లే" యనియుగలవు. తెలుఁగు నందలి ఎడ, ఎల శబ్దములు, "ఎళ్" అనుదాని రూపాంతరములే యనుట స్పష్టమే. "లే" యనునదియు 'ఎల్' అను శబ్దమునుండి వర్ణ వ్యత్యయముచే నేర్పడినదనుటకు సం దేహము లేదు. తెలుఁగులోని "లేఁత" శబ్దమునుబోలినదే కన్నడమున "ఎళతు" అను శబ్దమొకటికలదు. దీని రూపాం తరము "ఎళదు". దీనికి "లేఁతది" యని యర్థము (That which is tender, young). "ఎళతాద ఎలె" అనఁగా లేత దైన ఆకు అని యర్థము. "ఎళతు" అను దానిలోని "త" వర్ణమునకును "లేఁత" లోని త వర్ణమునకు సంబంధమేమైనఁ గలదా యను సందేహము కలుగక మానదు. లేదా, "ఎళె తన" (=లేఁతదనము) అను శబ్దమునకు సంబంధించినదైనఁ గావచ్చును. ఈ కన్నడ శబ్దములైనను 'లేఁత' శబ్దములోని యనునాసిక స్వరూపమును గూర్చి మాత్రము మనకేమియుఁ దెలియఁజెప్పుట లేదు. ఈ శబ్దములతోఁగూడిన విశేషణ సమాసములలోఁ గూడ ననునాసికము కనఁబడుట లేదు. cf. ఎళెగఱు, ఎళెగన్ది, ఎళెగాఁయ్, ఎళెగాళి (a gentle wind) ఎళెగమ్బు, ఎళెగాంగు, ఎళెతెంగు(a young cocoanut tree) ఎళెదొగల్, ఎళెదింగళ్, ఎళెవిసిల్, (ఎళె+బిసిల్) ఎళెవుల్ (ఎళె+పుల్) ఎళెవెణ్ (ఎళె+పెణ్) ఎళెప్రాయ (youth)

ఎళెదుమ్బి (a young black bee) ఎళెదళిర్ (tender foliage). ఈ సమాసములలో నెచ్చటను "ఎళె" శబ్దము తరువాత ననునాసికము వచ్చినట్లగపడదు. కన్నడమున సరళాదేశము వచ్చిన రూపములు కొన్నింటిలోఁ దెనుఁగున ననుస్వారము కూడఁ గనఁబడుచున్నది. cf. కన్న. ఎళెగెమ్బు — తె. లేఁగెంపు. ఎళదళిర్ — తె. లేఁదలిరు, ఎళవరయ — తె. లేఁబ్రాయము. వీనినిబట్టి చూడఁగాఁ దెనుఁగునందును తమిళమునఁ గొన్ని సందర్భములందును అనఁగా, లేఁగెంపు, ప్రాఁగెమ్పు, ఇళఙ్గోంబు, పరఙ్గెంబు—అనుస్థలములఁ గనఁబడుచున్న యనునాసికము ప్రాచీన ధాతు సంబంధమైనది కాదనియు, విశేషణసమాస మేర్పడు సందర్భమున వచ్చినదో యుచ్చారణ సౌకర్యమునకై వచ్చినదో యనియుఁ దలంపఁదగియున్నది. ఇట్లు "ప్రాఁగెంపు, లేఁగొమ్మ" సమాసములు ప్రాఁతకెంపు, లేఁతకొమ్మ సమాసములకంటె భాషలో మిగుల ప్రాచీనములని యెంచఁదగును.

మీఁగడ—మీఁదు + కడ = మీఁగడ అని వైయాకరణులుచేసిన విభాగము. ఇక్కడఁగూడ దు వర్ణము లోపించిన దనుటకన్న "మీ—మీం" శబ్దముతోడనే "కడ" శబ్దమునకు సమాసమేర్పడినదనుట యుక్తము. ఈ మీ—మీం శబ్దములు మేల్–మేలు శబ్దములతో సంబంధించినవే. ధాతుగతములగు ఇకార ఉకారములు ఎకార ఒకారములుగ మారుచుండుట యీ భాషలలో సహజమై యున్నది. మేల్—మేలు శబ్దములకు

"ఇ" కారముతోఁగూడిన రూపము లీ భాషలోఁ గనఁబడుటలేదుగాని, ఈ ధాతువుయొక్క మూలరూపమగు "మి" వర్ణము మిగులు అను శబ్దమునఁ గానవచ్చుచునే యున్నది. "మించు" (=ఒకదాని పైనుండు) అను ధాతువుకూడ 'మిన్-మిల్ ధాతువుయొక్క రూపాంతరమే. తమిళ కన్నడముల నిది "మిక్కు"—మిగు (to grow abundant, to increase, to exceed, to be over and above, to remain over) మిగెలు—మిగలు= (greatness, excellence, superiority remainder, rest) అనురూపములు గలిగి తెలుఁగునందలి "మిగులు" అనుధాతువుతో నభిన్నంబై యున్నది. "మించు" (to become great, to excel) ధాతువు తెలుఁగునందు వలెనే తమిళమునఁగూడఁ గనఁబడుచున్నది. కన్నడమున నిది 'మించు' అను రూపమును బొందియున్నది. తక్కిన వాని కంటె మీఁదకు వచ్చినపుడే వానిని మించుట సంభవించును గావున "మేలు"—మించులకు మూలధాతు వొక్కటియే యనవచ్చును. "మీఁజు, మిట్టు" మొదలగునవికూడ "పైకి లేచు—ఉన్నతమగు" అను నర్థమున "మీ" ధాతువునుండి బయలుచేరినవే. కావున మీ—మీన్ + కడ = మీఁగడ యయినదనుటకు సందేహములేదు. "మీ"యొక్క రూపాంతరమే "మే" యయియున్నది. కన్నడమున "మే" యను రూపమేగాక మేగు—మేం—మేల్ — (The upper side; the surface)అను రూపాంతరములుకూడ కలవు. 'మే' ధాతువుతో

గూడిన 'మేఁగడె' = (the upper side) మేగాల్ (the upper side of the foot) మేగెయ్ (the back of the hand) మొదలగు సమాసములు హళగన్నడమునఁ గలవు. కాని యిందు "మీఁగడ" యందువలె ననునాసికము వినిపించుట లేదు. కాని "మేగాల్, మేగై య్" అనువానికి "మేంగాల్, మేంగెయ్" అను అనునాసిక సహిత రూపములు ప్రాచీన కర్ణాటభాషలో నున్నవి. (Cf. ఉద్దమాగి బిగిద మేంగాల్.)

కావున కన్నడమున మేందు అను శబ్దము లేకున్నను "మేంగాల్" అను శబ్దము "మేం" అనుదానితోఁ గూడి యేర్పడినట్లే, తెనుఁగున "మీఁగడ" శబ్దముకూడ మీం+కడ అను శబ్దముల కూడికచే నేర్పడి యుండును. మేల్— మీల్ — అను వానిలోని లకారమే నకారముగా మాఱి యుండును.

క్రొత్త+కారు=క్రొక్కారు అను మఱియొక సమాసము కలదు. ఈ రూపమును సాధించుటకుఁగాను వైయాకరణులు ప్రత్యేక సూత్రమును జేయవలసిన వారైనారు. "క్రొత్త శబ్దమున కాద్యక్షర శేషమునకుం గొన్ని యెడల నుగాగమమును గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వంబు నగు" (బాల వ్యా. సం. 38). వెనుకటి ప్రాఁత, లేఁత శబ్దము లందువలెనే దీనికి నాద్యక్షర శేషము—అనఁగా "ఁత" వర్ణ లోపమును, నుగాగమమును విధింపఁబడినవి. నుగాగమము లేని యపుడు మీఁది హల్లునకు ద్విత్వము వచ్చుటు యుండొత

విశేషము. ప్రా, లే శబ్దముల పూర్వరూపములు "పజ" "ఇళ" అని కలవనియు, వర్ణవ్యత్యయము మూలముగా నా రూపములు సిద్ధించి యుండుననియు దలఁపఁబడినదిగదా; అట్లే క్రొత్త-శబ్దమునకుఁగూడ పూర్వ రూపమేమైనఁ గలదా యని విచారింపవలసియున్నది. క్రొత్త శబ్దములోని "త" వర్ణము ప్రాఁత, లేఁత శబ్దములలోవలెనే తరువాత వచ్చి చేరిన ధాత్వంతరము యొక్క యవశిష్ట భాగమే యయియుండుననుటయే సంభావ్యమగుటచే దీని తొలి రూపము "కొర్" అని యుండఁదగును. దీనికి మఱియొక పదము పరమైనపుడు మధ్యయనునాసిక ముచ్చారణ సౌలభ్యమునకై వచ్చినచో పరన్+కెంపు=పరఁగెంపు-ప్రాఁగెంపు అయినట్లే కొర్మ్+చాయ= కొమ్జాయ-క్రొంజాయ యను రూప మేర్పడియుండును. ఊఁది పలుకవలసిన స్వరములు రెండవ్యవహితముగా నుండవుగాన అనునాసికము నడుమ రాని యప్పుడు మీఁది హల్లునకు ద్విత్వము కలుగుచున్నది. ఈ మూలముగఁ దొలి వర్ణము గురువై యూఁదబడుటయు సంభవించును. ఇట్లు కొర్కారు, కొర్గండి యను రూపములేర్పడిన పిదప వర్ణ వ్యత్యయముచే క్రొక్కారు, క్రొగ్గండి రూపము లేర్పడియుండును.

ఇఁక ప్రాఁత-శబ్దమునకు "పజ" అను మూలధాతు వితర భాషలలోఁ గనఁబడినట్లు క్రొత్త శబ్దమునకుగూడ "కొర్" అనునది మూలధాతువుగా నీ భాషలోనే గాక

యితర సన్నిహిత భాషలలోఁగాని యున్నదాయని మనము చూడవలసి యున్నది. ఈ "క్రొత్త" శబ్దమునకు మూలంబగు ధాతువే యాంధ్రభాషలోని "కొడుకు" శబ్దమునకుఁ గూడ మూల ధాతునై యున్నదని చెప్పినచోఁ గొందఱ కాశ్చర్యము కలుగకపోదు. ఆంధ్రమున "కొడుకు, కోడలు" మొదలగు శబ్దములు తమిళమునందలి "కొళంధై" (=చిన్నపిల్ల) శబ్దమునకు సంబంధించినవి. వీని కన్నిటికినీ మూలధాతువు "కుఴ"="కుఱ" యనునదే. "కుఱ" అనఁగా లేఁత—చిన్న (tender, young) అని యర్థము. దీనినుండియే తమిళమున "కుఱకన్" (=యువకుఁడు, youth) అందగాఁడు (beautiful person) స్కందుడు అనియు, కుఱకు=యౌవనము—సౌందర్యము ; "కుఱవి" 'కుఱన్దై' (=చిన్నపిల్ల—పసిపాప—Infant, babe; suckling) కుఱన్దై నీర్ (ఎళనీరు—లేత కొబ్బరికాయ నీరు), కుఱమగన్ = యౌవనవంతుఁడగు నాయకుఁడు—A youthful hero ; "కుఱవితింగళ్"=ప్రతిప చ్చంద్రుడు; కుఱవిఞాయర్=ఉదయ భానుడు; కుఱవు=లేత వయసు—youth, tender age) అను నీ మొదలగు శబ్దము లనేకములు బయలు దేఱినవి. ఈ "కుఱ" లో "ఱ" కారము "డ" కారముగను "ర" కారముగను మాఱుటకలదు. తెనుఁగులో నిది "డ" కారముగనే యుగపడుచున్నది. కావున నీ మూల రూపమే కొడుకు, కోడలు, అను శబ్దములలోఁ బొడసూపుచున్న దనవచ్చును. అందలి "ఉ" కారము "ఒ" కారముగఁ

గూడ మాఱుట మఱియొక విశేషమేగాని ప్రాచీన కాలమున నీ భాషలలోని ధాతు రూపములలో ఇకార ఉకారములు ఎకార ఓకారములుగ మాఱుచుండునని యిదివఱకె సూచింపఁ బడినది. ఇట్లు "కుఱు" అను ప్రాచీన ద్రావిడ ధాతువులోని "ఱ" కారము "డ" కారము కాఁగా కొడుకు రూపము తెలుఁగున నేర్పడును. ఇదియే తమిళమున "ర" కారముగ మాఱినది. తమిళ మళయాళము లందు "కురుత్తు" అనఁగా "మొలక" అరఁటిచెట్లు కొబ్బరిచెట్టు మొదలగువాని లేఁత మొవ్వాకు, (Sprout, white tender leaves of a tree) తెల్ల దనము (వెణ్మై) లేఁతదనము (ఇళమై) అని యర్థము. "కురుత్తోలై"=అనఁగా లేఁత తాటి మొవ్వు అని యర్థము. కురుత్తు అను దానికి అనునాసికముతోఁ గూడిన "కురున్దు" అను రూపాంతరముగూడఁ గలదు. ఈ "కురుత్తు" అను శబ్దమే తెలుఁగులో "కొఱుత్త" యై వర్ణవ్యత్యయముచే క్రొత్తయై యుండును. ఇందలి తవర్ణముగూడ వేఱు ధాతువుయొక్క యవశిష్టభాగమే గావున కొఱ్—కొర్+కొఱు=అనునప్పుడు "క్రొక్కఱు" అని మీఁదఁ హల్లునకు ద్విత్వమువచ్చినట్లై కొర్+త=క్రొత్త యైయుండును. అట్లే - కిఱ్ + కొను = క్రిక్కొను; కుఱ్+కిదము=క్రుక్కిదము(=దట్టము); కఱ్+కు =క్రక్కు ; కొఱ్+గండి=క్రొగ్గండి, కొఱ్+వన=క్రొన్నన కొఱ్+మావి=క్రొమ్మావి ; కిర్+కొను=క్రిక్కొను; మొదలగు రూపము లీ భాషలో వ్యతిపాతవిధిచే (Metathesis)

నేర్పడినవి. కెంధూళి, కెంజడలు అనునవి కూడ కెంపు+ధూళి, కెంపు+జడలు అని గాక పువర్ణమాశబ్దములోఁ జేరక పూర్వమే – అనఁగా పువర్ణ విరహితమగు "కెం" శబ్దము తోడనె గూడి యేర్పడిన సమాసములై యుండును. ఈ "కెం"అనునదే యందలి కకారము తాలవ్యాచ్చరక మగుటచే తాలవ్య చకారముగా మాఱినపుడు 'చెం' అయి "చెంగల్వ, చెందొవ"అను సమాసములలోను "చెన్ను"అని శోణార్థమున ప్రత్యేక శబ్దముగను గూడ నీ భాషలో వ్యవహారమున నగపడుచున్నది. క్రొంజాయ మొదలగు రూపములవలె నీ "కెంధూళి, కెంజడలు" అనునవి పై సూత్రములచే సాధింపఁదగినవి గాకున్నను మహాకవులచేఁ బ్రయోగింపఁబడి యుండుటచే వీనిని నిపాతలని చెప్పి వైయాకరణులు గ్రహింపవలసినవారైనారు. రూప నిష్పత్తి కేవలము తెలిసికొన వీలులేని సందర్భములలో * నిపాతలని యథాప్రయోగమున గ్రాహ్యములని చెప్పి యీ రూపములను గ్రహింపవలసి యుండునేమోగాని, యీ సంకేత మీ కెంధూళి మొదలగు సమాసముల సందర్భమున నవలంబింపవలసిన యావశ్యకత యంతగాఁ గనఁబడదు.

ఇఁక క్రొత్త శబ్దముతోడనే కూడినదైనను (క్రొత్త+కుండ)=క్రొత్తకుండ అను సమాసము "క్రొక్కుండ" అని

---

*వైయాకరణుని లక్షణమునకు లొంగని భాషలోని విశేష ప్రయోగములను "నిపాత" లను పేర నంగీకరించుట సంస్కృత వ్యాకరణ సంప్రదాయమై యున్నది.

కాలేదు. అనఁగా నట్టి రూపము భాషలో వ్యవహారమున లేదన్నమాట. ఈ క్రొత్తకుండ యను సమాసమర్వాచీన కాలమున "క్రొత్త" శబ్దము భాషలో స్థిరపడినతరువాతఁ జేయ బడిన దగుటచే నా రూపమే వాడుకలో స్థిరపడినది. కాని తొలియచ్చుమీఁది వర్ణమునకు లోపమువచ్చి మీఁది హల్లునకు ద్విత్వము రాలేదు. "క్రొక్కారు" మొదలగు సమాసములు "క్రొత్త" శబ్దముయొక్క ప్రాచీన రూపమగు "క్రొర్" అగు దానితోఁ బ్రాచీనకాలమున నేర్పడుటచే వ్యవహారమున నిప్పటికి నా రూపముననే నిలిచియున్నవి. లాక్షణికులు తమ కాలమందున్న రూపముల గ్రహించి సామాన్య లక్షణము చేయవలసిన వారగుటచే వాని నన్నిటి నొక్క సూత్రము క్రిందికిఁ దెచ్చి "క్రొత్త" శబ్దము మొదలగువానిని ప్రాఁతాదిగణమునఁ జేర్చి బహుళవిధిచే నీ రూపముల నన్నిటిని సాధింప యత్నించినారు.

క్రిఁగడుపు—ఇది క్రింది శబ్దము లోని తొలియచ్చు మీఁది వర్ణమునకు లోపము నుగాగమము వచ్చినదనుట మాత్రముచే సాధ్యము కాలేదు. సమాసములో "క్రింది" శబ్దమునందలి తొలివర్ణమునకు దీర్ఘము గలుగుటగూడ బహుళ గ్రహణము చేతనే లాక్షణికుఁడు సాధింప యత్నించి నాఁడు. ఇందలి హ్రస్వము దీర్ఘమగుటకుఁగల కారణమేమి యని మనము విచారింపవలసి యున్నది. ఆంధ్రమున నీ క్రింది శబ్దముతో సంబంధించి దీర్ఘ ఈ కారముతోఁ గూడినది

"క్రీడు" శబ్ద మొక్కటి కనఁబడుచున్నది. మేలు, కీడు శబ్దముల కీ భాషలో నిప్పటి యర్థము లాక్షణికార్థమేగాని సహజమగు శబ్దార్థము కాదు. మేలు శబ్దము మీఁదు (త—మేల్=ఉపరి, పైభాగము) అను శబ్దముతో సంబంధించినదై నట్లే, "క్రీడు" శబ్దము "కింద" (త-కీళ్=అధో భాగము) అను దానితో సంబంధించినది. ఒకని కౌన్నత్యమును కలిగించునది మేలు (=శుభ వాచకమైనది—మంచిది) కాఁగా నధః పతనమునకు గారణమై క్రిందికి లాగునది "కీడు" అయినది. కావుననే "కీడు" నకు చెడ్డది అను నర్థము కలిగినది. కీడ్వడు అనుదానికి క్రిందుపడు, తక్కువగు అను నర్థమునఁ బ్రాచీన ప్రయోగములు గలవు. మఱియు నిది తమిళ కన్నడ మళయాళములందు (దీర్ఘ) "ఈ"కారముతోఁ గూడియే యున్నది. కీళ్ అనఁగా క్రిందు అని యర్థము.(T. Place or space below, beneath, bottom; K. the state of being low, meanness, a low in-ferior base man). తమిళమున "క్రీఴ్" అనఁగా దోషము—తప్పు (Fault, blemish, defect) అనియు నర్థము గలదు. తుళు భాషలో "క్రీఴ్"అనఁగా నైచ్యము (inferiority, baseness). దీని కీ భాషలతో "క్రీళ్" అనియు, తుళు భాషలో తెలుఁగునందు వలెనే "కీడు" అనియు రూపాంతరములు కలవు. కీఱ్ జన, కీఱ్ జాతి=క్రిందిజాతి మనుష్యుడు (A low caste man, an inferior man) కన్నడ మళయాళము లందు తెనుఁగునందు వలెనే హ్రస్వాచ్చ రూపములును

గలవు. క. కెళగు రూపాంతరము. మళ. కిఱి=|క్రిందికి దిగుట (To descend). తమిళమునందలి "కిఴక్కు" అనుదాని క్రింది భాగము—నిమ్న ప్రదేశము — అని నర్థమును బట్టి తమిళదేశ ములకు నిమ్న భాగము తూర్పుదిక్కునకు ఉన్నతభాగము— అనఁగా పశ్చిమ కనుమలు పడమర దిక్కున నున్నవి గావున "కిఴక్కు" అనఁగా తూర్పు దిక్కు అనియు, పశ్చిమ దిక్కు నకు "మెర్కు" (మీఁదిదిక్కు—ఉన్నతమైన కొండలు గల దిక్కు) అనియు సంజ్ఞ లేర్పడినవి. కాని కన్నడ మళయాళ దేశములలో నీ పదములు తమిళము నందలి దానికంటె విరు ద్ధమగు నర్థమున వ్యవహారములో నున్నవి. ఏల యనఁగా పశ్చిమ సముద్రతీర భాగముననున్న మళయాళ దేశమునకు పశ్చిమకనుమలు తూర్పుదిక్కున నున్నవగును. ఆ దేశము నకు పశ్చిమదిక్కున సముద్రతీరమగు నిమ్న ప్రదేశముండు టచే నిమ్నార్థమగు "కిఴక్కు" శబ్ద మా దేశమున పశ్చిమ దిక్కును నర్థము నిచ్చునది. ఎత్తైన కొండ లా దేశములకుఁ దూర్పు వైపున నుండుటచే "మెర్కు" అనునది "తూర్పు" దిక్కును సూచించు పదమైనది. ఇట్లాయా దేశకాల స్థితు లనుబట్టి శబ్దముల యర్థము వాని సంకేతార్థములును మాఱు చుండుననుట కివి మంచి నిదర్శనములగుచున్నవి.

కిఴ్కట్టు=క్రిందికట్టు (A lower Structure)

కిఴ్కడల్ =క్రింది సముద్రము (The western Sea)

కిఴ్కెఱె=క్రింది చెఱువు (The lower tank)

కీఱ్కొంబు=క్రింది కొమ్మ (The lower branch)
కిఱ్ప్రాడు=కీడ్పడు (To be humbled, subdued)

ఈ పై రూపములలోఁ గన్నడమునను హ్రస్వేకారమే కనఁబడుచున్నను కీటెల్=క్రిందియిల్లు (A verandah) కిఱాల్ =క్రింది జాతి మనుష్యుడు (A low caste man) కీఱ్ఉటి= క్రీపెదవి (The lower lip) మొదలగు శబ్దములలో క్రీశబ్దము కూడఁ గానవచ్చుచునే యున్నది. మొత్తము మీఁద "కీఱ్" అనునదే మూలధాతువుగాఁ గనఁబడుచున్నది. ఇందలి "ఱ" అనునది శకార, డకార, రకారములుగ మాఱుచుండుటచే రూపాంతరము లీ భాషలలో నేర్పడినవి. వీనిపై పరుషాది శబ్దములు పరమైనపుడు గానవచ్చెడి యనునాసికము "పఱ" మొదలగు కొన్ని ధాతువులపైఁ జేరినట్లే, యుచ్చారణ సౌలభ్యమునకై చేరినదనియే చెప్పవచ్చును. కావుననే కీఱ్ +తు=కీఱ్ న్ తు=కీఱ్ న్దు—క్రిన్దు అనురూప మేర్పడియుండును. ఇఁక అన్యంబులకు సహిత మిక్కార్యంబులు గానఁబడియెడి నని చెప్పుటచే నింక ననేక విధములగు సమాసము లీ సూత్ర ముల క్రిందకిఁ దేఁబడినవి. వానిని ప్రత్యేకముగా గ్రహించి పరిశీలింతము.

పందొమ్మిది — ఇది పది+తొమ్మిది, అను పదముల కూడికచే నేర్పడినట్లు చెప్పఁబడినది. అనఁగా దిసర్గమునకు లోపమువచ్చి నుగాగమము వచ్చినదన్నమాట. కాని ఇది పది+ఉన్+తొమ్మిది = పదియున్దొమ్మిది. పదున్+తొమ్మిది

=పన్+తొమ్మిది=పన్దొమ్మిది యను రీతి నేర్పడెననియుఁ దలంపవచ్చును. అయితే యిది యిట్లే యేర్పడినచో భాషలో మిగుల నర్వాచీన రూపమని చెప్పవలసి యుండును. కాని, తమిళమునఁగూడ "పన్నొండు, పన్నిరండు" అను రూపములలో "పన్" అనునది "పదిన్" అనుదాని సంక్షిప్తరూపము కాక "పత్" అను మూలరూపముయొక్క రూపాంతరముగాఁ గనఁబడుచున్నదని కాల్డ్వెల్ పండితుఁడు తలఁచుచున్నాఁడు. అట్లైనచో "పందొమ్మిది" అనునది "పదిన్+తొమ్మిది" అను శబ్దముల కూడికవలన నేర్పడిన యర్వాచీన రూపము కాక "పన్+తొమ్మిది" పందొమ్మిది యని మిక్కిలి ప్రాచీన కాలపు రూపమే యని తలంపవలసి యుండును.

తొంబది—ఇది తొమ్మిది+పది శబ్దముల కూడికవలన నేర్పడినదనియు "తొమ్మిది" శబ్దములోని "మిది" లోపించి నుగాగమము వచ్చుటచే "తొంబది" యయినదనియు లాక్షణికుల మతము. తొమ్మిదిలో "మిది" లోపించి "తొం" శబ్దము మిగిలినదనినచో నుగాగమ విధానము చేయవలసిన బాధ తొలఁగెడిది. కాని ఈ సమాసము తొమ్మిది శబ్దముతో నేర్పడియుండునని తోఁచదు. తొమ్మిది శబ్ద మేర్పడక పూర్వమే "తొంబది" శబ్ద మేర్పడియుండునని యూహింపఁ దగియున్నది. ఏలయనఁగా "తొమ్మిది" శబ్దములోని "మిది" యనునదికూడ "పది" శబ్దముయొక్క రూపాంతరమే. పది అనునది పూర్వమందున్న "తొల్-తొన్" శబ్దములోని నకార

సాహచర్యముచే "మది"యై పిదప తుదినున్న ఇకారసాహచర్య బలముచే మిది యయియుండును. తొన్+పది=తొంబది కాఁగా తొంబది>తొమ్మది>తొమ్మిది అని మాఱినది. తొంబది యనఁగా నూటికి తొలిబది—(ఏకోనవింశతి అన్న రీతిగా) నూటికి వెనుకటి పది, కావున నవత్యర్థక మగుచున్నది. "పదికి తొలి సంఖ్య" యను నర్థమున "తొమ్మిది" యయినది. తమిళ కన్నడముల ఒన్బదు-ఒంబత్తు అను రూపములు కలవు. ఇవి "తొంబదు" "తొంబత్తు" అను రూపములనుండి వచ్చినవే యని తలంపవచ్చును. ఇఁక తమిళమునందలి తొంబది, తొమ్మిదివందలు అను నర్థముగల తొణ్ణూరు తొళ్లాయిరం అనునవి "త్రొళ్" శబ్దముతోఁగూడిన సమాసములుగాఁ గనఁబడుచున్నవి: ఈ సమస్త పదములలోని తొలి శబ్దము పై వానిలోవలె "తొల్" శబ్దముకాక "తొళ్"శబ్దమె యైనచో తొణ్ణూరు—(తొళ్+నూరు) తొళ్లాయిరం (తొళ్+ఆయిరం) అన్నపుడు, "తొళ్" ధాతువునకు "తొలఁచుట" కన్నముచేయుట, (cf. త. తొళ్ళు= To make a hole with any instrument); మ. తొళ్కు To bore a hole; కన్న. తొళ్లె A hollow, a hole, a cavity అను నర్థమునుబట్టి — నూటి నుండి తొలువంబడినది—నూటికి కొంత తక్కువయైనది, ఆయిరమునుండి కొంత తీసివేయఁగా నిలిచినది—అను నర్థము చెప్పుకొన వలసియుండును. మొత్తముమీఁద తెలుఁగునందలి "తొంబది" శబ్దము గాని తమిళమునందలి తొణ్ణూరు,

తొళ్ళాయిరం శబ్దములుగాని "తొమ్మిది"-ఒంబదు, శబ్దముతోఁ గూడి యేర్పడినవి కాక తొలి-తొల్, లేదా తొళ్-తొణ్, శబ్దముల కూడికవలన నేర్పడినవేయని నిశ్చయింప వచ్చును. ఆంధ్ర వైయాకరణులు "ప్రాఁతాది"-సూత్రములచే తొమ్మిది శబ్దము లోని తొలియచ్చుమీఁది వర్ణములకు లోపము చేసి "తొంబది" శబ్దమును సాధించినట్లే, తమిళవైయాకరణులు కూడ తొణ్ణూరు, తొళ్ళాయిరం శబ్దములలోని తొణ్-తొళ్ శబ్దములను సాధించుటకు ఒంబదు+నూరు—అని యుండఁగా, "ఒంబదు" లోని "పదు" శబ్దమునకు లోపము వచ్చుననియు మిగిలిన "ఒన్" అనునది "తొన్"గా మాఱుననియు, పిదప నీ "తొన్" "తొళ్"గా మాఱుననియుఁ జెప్పియున్నారు. ఒక శబ్దము యొక్క స్వరూపమును యథాస్థితంబుగ తాత్కాలిక వ్యవహారమున గల శబ్దములతో సాధించుటయే ప్రధాన కర్తవ్యముగా గలిగినఁ తాత్కాలికవ్యాకరణము లా శబ్దము యొక్క ప్రాచీనచరిత్ర నన్వేషించి వాని రూపనిష్పత్తిని సాధింప యత్నింపవు గావున, నే శబ్దమునైన నే శబ్దములోని కైన మార్చి యాయా శబ్దముల రూపనిష్పత్తిని కల్పించుటలో వెనుదీయవు. తాత్కాలికంబగు నర్థమునుబట్టి యా రూపము నేదో విధముగ సాధించుటయే తాత్కాలిక వ్యాకరణముల (Descriptive grammars) కు ముఖ్యము. ఈ విషయమును గూర్చి కాల్డ్వెల్ పండితుఁడుగూడ నిట్లు చెప్పియున్నాఁడు.

"The plan of deriving anything from anything

was evidently not unknown to the ancient grammarians of the Tamil country" Comp. Gr. Dr. Lan. p. 349.

వంజెఱఁగు—ఇది వంక+చెఱఁగు—శబ్దముల కూడిక వలన నేర్పడినదని యందురు. స్త్రీపార్శ్వ చేలాంచల మని దాని యర్థము. ఇందు 'వంక' శబ్దము "వంగు" ధాతువు నుండి యేర్పడిన కృదంత రూపము. "వంగు"అనునది వ్రాలు అను నర్థమున "వళ్" ధాతువునుండి యేర్పడియుండు నని యూహింపఁదగియున్నది. వళంగు—వణంగు అనునవి దీని పూర్వ రూపములై యుండును. వలగొను అను ధాతువు దీనికి సంబంధించినదే. కన్నడమున బళంకు, బళసు, బళ్కు, అనియు రూపాంతరములుకలవు. వీనికి వంగుట, చుట్టివచ్చుట యనియే యర్థము. (To bend, to incline, to go round, to circumambulate, etc.) తమిళ మళయాళముల వళై, వళె అనియు రూపములు కలవు. తెలుఁగునందలి బలయు (=పరివేష్టించు), వలంకు, వలను (దిక్కు, పార్శ్వము, ప్రదక్షిణము), అను రూపములు వళ్ ధాతువునుండి వచ్చినవే యైయుండును. ఇట్లు వళంగు—వణంగు అనునదియే "వంగు" ధాతువై యుండెనని తలంపవచ్చును. దీనినిబట్టి వంక+చెఱఁగు అని యుండఁగా వంక శబ్దములోని "క" వర్ణ లోపముచేతఁ గాక, వళ్—వణ్+చెఱగు అనునదే వంజెఱఁగు అయి యుండెనని యూహింపవలసియున్నది.

సంగోరు—ఇది సగము+కోరు శబ్దముల కూడిక వల ననే యేర్పడి యుండవచ్చును. సగము+కోరు=సగంగోరు

అయి రెండు గకారము లొకదానివెంట నొకటి యుచ్చరించుటలోఁ గల చిక్కునుబట్టి యొకటి లోపించుటచే సగం గోరు="సంగోరు" అయియుండును. ఒక్క యక్షరమే రెండు మార్లొక్క పదముననే యొకదాని వెంబడి నొకటి వచ్చినప్పుడుచ్చారణ సౌలభ్యము కొఱ కర్థభంగము లేనియపుడం దొకటి లోపించు టచ్చటచ్చటఁ గలదు. ఇట్టి లోపము "ఇండోయూరపియన్ భాషలలోఁ గలిగినపు డద్దానిని శబ్ద శాస్త్ర వేత్తలు 'Haplology' అని నామకరణము చేసిరి. ఉదా:—"మధూ ధుఘ"="మధుఘ", "తువీరవవాన్—తువీరవాన్." అట్లే తెలుఁగున "కంచు+చెంబు" శబ్దములు తొందరగా నుచ్చరింపఁబడినపుడు "కంచెంబు" అనియు "పెద్ద+తనము=పెత్తనము, వంగ+కాయ=వంకాయ" అనియుఁ బలుకఁబడుచుండుట మన మెఱింగినదే.

నివ్వెఱ—దీనిని 'నిండు+వెఱ' అని వైయాకరణు లర్థమునుబట్టి విడఁదీసి యున్నారు. కాని యిది నిండులోని ద్వితీయాక్షర లోపమువలన నేర్పడినది గాదనియే చెప్ప వచ్చును. ఈ భాషలో "నిండు" ధాతు వెట్లేర్పడినదో పరిశీలింపవలయును. దీని పూర్వరూప మొక రేఫముతోఁ గూడి యుండె ననుటకుఁ దమిళమున నీధాతువు నిరమ్బు (To be full) నిరప్పు (To fill) అని అకర్మక సకర్మకరూపముల వాడుకలో నుండుటయే నిదర్శనము. నిరమ్బు అను దానికి బదులు తెలుఁగున "నిండు" అనియు, నిరప్పు అనుదానికి బదులు

నింపు అనియుఁ గలవు. కన్నడమునను సమగ్రత్వ సంపూర్ణార్థములందు "నెఱె—నఱె" యను శబ్దములు కలవు. రేఫ శకటరేఫములకు వినిమయము కొన్ని సందర్భములఁ గలుగుచుండు నని యొప్పుకొనక తప్పకపోవుటచే నీ కన్నడ రూపములును "నిర్"ధాతువుతో సంబంధించినవే యని చెప్పక తప్పదు. నెఱె—అనుదానికి తమిళమున "నిఱై"అను రూపమును గలదు. దీనికి సంపూర్ణమనియే యర్థము. (To be full, complete, accomplished, full grown, mature, completely, exceedingly, fully, etc, etc.) ఆంధ్రమునను నెరపు, నెఱపు అని రెండు శబ్దములు, రేఫ శకట రేఫలతోఁ గూడినవి కలవు. నెరయు — నెఱయు అను రెండు ధాతువులకును "నిండు, నెఱవేఱు, వ్యాపించు" అను నర్థములై యున్నట్లు శబ్దరత్నాకరకారుఁడు తెలుపుచున్నాఁడు. వృత్తియందు నెరవు, నెఱవు శబ్దముల వువర్ణమునకు లోపమురాఁగా "నెర, నెఱ" అను శబ్దములు నిలుచునఁట. దీనినుండియె—సంపూర్ణమైనది (Full grown, accomplished, mature), సమగ్రమైనది—సర్వాంగ సుందరమై యుండును గావున, "నెఱి" శబ్దమునకు అందము, క్రమము, న్యాయము, అను నర్థము గూడఁ గలిగినది. దీనినిబట్టి నివ్వెఱ శబ్దము నిర్+వెఱ=నిర్వెఱ—నివ్వెఱ — అని "నిండు" శబ్దమునకుఁ బూర్వరూపముగు "నిర్" ధాతువుతోడనే యేర్పడియుండు నని నిశ్చయింపవచ్చును.

నెత్తటి=నెటి + తటులు—అని శబ్ద రత్నాకరము. నెత్తటులనఁగా పెద్ద యలలని యర్థము. "చదలేటి నీటి నెత్త టుల జనించు క్రొన్ననరువు దండముల్తై" లక్ష్మి—౨ ఆ, నెట్+తరులు—నెత్తరులు అగును.

నెన్నడుము—ఇదియు నెటి-నెట్+నడుము అను శబ్దముల కూడికచే నేర్పడినదే. ఇక్కడ సంపూర్ణమైన లేదా అందమైన నడుమన్నచో—కృశత్వమె దాని యందమునకు లక్షణముగా గ్రహింపఁబడుటచే నెటి—అనఁగా అందమైన యను నర్థమున నీ శబ్దము నడుముతో సమాసమును బొందినదని తలంపనగును. నెమ్మది — నెట్ + మది (పూర్ణ మనస్సు) = నెమ్మది. నెవ్వగ—నెట్ + వగ=సంపూర్ణమైన వగ-విశేషమగు వగ—అతి దుఃఖము అని యర్థము వచ్చును. వీనిలో రేఫము తరువాతి హల్లుతో నెనయుటచే ద్విత్వము గలిగినది. ఇది యీ భాషలో సామాన్యముగా జరుగుచుండు మార్పే. పెక్కు ధాతువులలోఁగూడ నీ మార్పగపడుచున్నది. ఉదా: వర్+చు=వచ్చు, పుర్+చు=పుచ్చు, మెట్ (ర్)+చు=మెచ్చు, తెర్+చు=తెచ్చు.

సమాసవృత్తిలో అది, అవి శబ్దముల అకారమునకు లోపము కలుగును. నా + అది = అన్నప్పు డది శబ్దము తొలుత నా వస్తువన్న యర్థమునే సూచించినను, తరువాత వ్యవహార పరిపాటినిబట్టి అమహదర్థకైకవచన సూచకము మాత్రముగా గ్రహింపఁబడి, "ది" యనుదానిచేతనే యీ

ప్రయోజనము గలుగుచుండుటచే 'అ' కారము లోపించి "నాది" యయినది. క్రియావిశేషణముపై సర్వనామము చేరి, చేసినవాఁడు అనియె మొదటనున్నను "డు" ప్రత్యయము మాత్రమె మహదర్థకైకవచన సూచకమగుచుండుటను బట్టి "వ" కారలోపము వచ్చినను అర్థమునకు హానికలుగక-"చేసిన వాఁడు" అను సమాసరూపము "చేసినాఁడు" అను క్రియా రూపముగా నేర్పడుట తటస్థించినదిగదా. అట్లే, చేసిన+ వాడను = చేసినాడను, చేసినాను, చేసిన + అది = చేసినది, చేసినయవి-చేసినవి etc. వచ్చును+అది=వచ్చునది అనియె గాని—వచ్చది యగుట లేదు. ఇది భాషలో నతిప్రాచీన రూపము. "వచ్చును" అనునదే విశేషణరూపముగ గ్రహింపఁబడుటచే నజాది శబ్దములు పరమైనపుడు "న" కారము నకు లోపము వచ్చుటలేదు. 'వచ్చెడిది' యనునది "వచ్చెడు" అనుదానిపై సంబంధార్థద్యోతక "ఇ" కారము చేర్పఁబడు టచేఁ గలిగిన "వచ్చెడి" అను దానికి "అది"—చేర్పఁబడి నపుడు అకారము లోపించుటచేత నేర్పడినది. ఒక్కయుదంత తద్ధర్మార్థక రూపములలో మాత్రమే తుది "న" కారము నిలిచియుండుట విశేషము. అది యా రూపముయొక్క ప్రాచీనతకు నిదర్శనమగుచున్నది.

"భయపడు" (భయము+పడు) మొదలగు శబ్దముల లోని తొలి పదముయొక్క ముపర్ణ మీ పదబంధమున లోపించినదా లేక యవి ముపర్ణ మాశబ్దమున లేని కాలమున

కూర్పఁబడిన ప్రాచీనరూపములా యను సందేహము కలుగక మానదు. సంస్కృత ప్రాతిపదికలు—అనఁగా భయ, వృక్ష, సూత్ర, వన, భంగ మొదలగునవియే తొలి కాలమున నీ ద్రావిడ భాషలలోఁగూడ ప్రాతిపదికలుగా గ్రహింపఁబడి నట్లున్నవి. ఇప్పటికిని కన్నడమున భయ, వన, వృక్ష మొదలగునవియే ప్రాతిపదికలు. ఆంధ్రమునఁ గాలక్రమమున 'ము' వర్ణముతోఁగూడిన రూపము వెలసి యుండును. దీనినిబట్టి మువర్ణసహిత రూపము లర్వాచీనములనియు, మువర్ణ రహితములు అనుస్వారరహితములును వీనికంటె భాషలో ప్రాచీనములనియుఁ దలఁపవలసి యున్నది. కన్నడమునను భయదిన్ద, భయవాద, భయకాటి, భయగొళ్ మొదలగు రూపములతో పాటు భయంగొళ్, భయమ్బడు మొదలగు రూపములు కూడ కలవు. కాని యనుస్వారరహితరూపములకే ప్రాచుర్య మున్నట్లగపడుచున్నది. భయపడు, భంగపాటు మొదలగు వాని సామ్యముననే "సూత్రపట్టినట్లు" మొదలగు ప్రయోగములు వెలసియుండును.

చూడుము+నన్ను = చూడునన్ను—అని మధ్యమ పురుష మువర్ణకంబునకు లోపము వచ్చుటకుఁ గారణ మది మొదటి నుండియు నచ్చుట లేకుండుటయే. ఈ భాషలలో ధాతువే విధ్యర్థక మధ్యమ పురుషైకవచన రూపముగాఁ గూడ బ్రయోగింపఁ బడుచున్నది. చూడు అను ధాతువునకు విధ్యర్థక మధ్యమ పురుషైకవచనము చూడు అనునదే. అట్లే—

| | |
|---|---|
| కొట్టు | కొట్టు |
| చెయ్ | చెయ్ (చెయ్యి) |
| తాకు | తాకు |
| వెడలు | వెడలు |
| వెలుగు | వెలుగు etc. |

ధాతువునకు మధ్యమపురుషైక వచనమున "ము" వర్ణము చేర్చు నాచారము తరువాతి కాలమున నేర్పడినది. కావున ప్రాచీన సంప్రదాయమునుబట్టి మువర్ణము లేకయే చూ ధాతు వా యర్థమును బోధించుచుండుట సహజము. అచ్చుపరమైనపుడు సంధి గలుగుటచే చూడుమనియె అని మకార మగపడుచున్నది. 'చూడు' అను ప్రాచీనరూపమున కచ్చుపరమైనపుడుగూడ సంధి జరుగవలసినదే. అట్టి రూపము లిటీవల మువర్ణాంతరూపములు బయలుదేరిన వెనుక ప్రచారమునుండి తగ్గినను క్వాచిత్కముగాఁ గనఁబడుచునే యున్నవి. కావుననే "ఆడిదె నీదు పందెము, భవచ్ఛిత్తేప్సితంబెద్ది చెప్పనినన్", ఇత్యాది ప్రయోగంబు లగపడుచున్నవి. వ్యతిరేక మధ్యమ "ము" వర్ణంబునకు లోపంబు గలుగుటకుఁ బైని మధ్యమ పురుష "ము" వర్ణ లోపము విషయమునఁ జెప్పినదే కారణము. "ము" చేరినపిదప నమ్మకుము+ఇట= నమ్మకుమిట యను రూపముగూడ నేర్పడును. అయితే యిచ్చట మధ్యమ పురుషైక సర్వనామరూపము నీవు—ఈవు అని "వు" వర్ణాంతమై యుండఁగా "ము" వర్ణము వచ్చు

టకుఁ గారణ మేమి యను ప్రశ్న కలుగక మానదు. ఈ "ము" వర్ణము బహువచన రూపములోని "ము" వర్ణమే యని తలంపనగును. మొదట బహువచనమున ఉమ్ చేర్పఁ బడుచుండెడిది. ఉదా : నడు+ఉమ్=నడువున్ – నడువుము. తొలుత నేకవచనమున "చూడు" అని ధాతురూపమే వాడుకలో నుండఁగా, మువర్ణాంత రూపము బహుత్వమును సూచించునదై యుండి కాలక్రమమున "చూడుఁడు" అను "డు" వర్ణాంతరూపము బహువచనమున నేర్పడిన పిదప నిది గౌరవార్థముగ నేకవచనమునఁ బ్రయోగింపఁబడుట తటస్థించి యుండునని యూహింపఁదగియున్నది.

విధ్యర్థకములగు నితర భాషారూపముల నించుక పరిశీలించినచో దీని తత్త్వము కొంత తేటపడఁగలదు. తెలుఁగులో వలెనే తమిళకన్నడములలోఁగూడ కేవల ధాతువే విధ్యర్థమున నేకవచనరూపమై వ్యవహారములో నున్నది.

| త. | తె. | కన్న. |
|---|---|---|
| నీ–నడ | నీవు–నడు | నడె |
| నీ–చెయ్ | నీవు–చెయ్ | గెయ్ |
| నీ–పేచు | నీవు–పలుకు | నుడి |
| నీ–నిల్లు | నీవు–నిలు | నిల్ |
| నీ–వా | నీవు–రా | బా (హాల–క. బార) |
| నీ–తా | నీవు–తే | తా (హాల–క. తార) |
| నీ–ఇరు | నీవు–ఉండు | ఇర్–ఇర–ఇరు |

తమిళమున గౌరవార్థము సూచింపవలసినప్పుడు ధాతువున కొక కాలమున "ఉమ్" అనునది చేర్పఁబడుచుండుట కలదు. ప్రాచీనభాషలో "మిన్" చేర్పఁబడుచుండెను. ఉదా: చెయ్‌మిన్. ఇది ఉమ్మంతముపై "ఇన్" చేరిన రూపము కావచ్చును. బహువచనమున "గళ్" ప్రత్యయము చేర్పఁబడుచున్నది.

ఏ. నీర్—చెయ్యుమ్, చెయ్‌మిన్ = నీవు చేయుము. (Do you or thou)

బ. నీఙ్గళ్ చెయ్యుఙ్గళ్ = (Do ye) మీరు చేయుఁడు.

ఏ. నీర్_నిల్లుమ్; నిల్‌మిన్ = నీవు నిలుము. (Stand thou or you)

బ. నీఙ్గళ్ నిల్లుంగళ్ = (Stand ye) మీరు నిలువుఁడు.

దీనినిబట్టి తమిళమునఁగూడ "గళ్" అను బహువచన ప్రత్యయమునకుఁ బూర్వము "ఉం" అనునది కనఁబడుచునే యుండుటచే నది బహువచనమున మిక్కిలి ప్రాచీనకాలమందుఁ జేర్పఁబడియుండె ననియుఁ గొంత కాలమున కది గౌరవసూచకమై యేకవచనమునుగూడ సూచించునదగుటచే ప్రత్యేకముగా బహువచనమును సూచించుటకు దానిపై "కళ్" ప్రత్యయమును జేర్చి చెప్పుట వాడుకలోనికి వచ్చినదనియుఁ దలంపవచ్చును. ఆంధ్రమున నీ ఉమ్మంత రూపము—(తే+ఉమ్+ఉ=తెమ్ము, రా+ఉమ్+ఉ=రమ్ము, నడు+ఉమ్+ఉ=నడువుము, నిలు+ఉమ్ + ఉ = నిలువుము,

చేయ్+ఉమ్+ఉ=చేయుము.) తుది నొక ఉకారము నూతగాఁ గొని మువర్ణాంత శబ్దమై గౌరవార్థకమై కొంత కాలమునుండి తుదకు కేవల ధాతువువలెనే యేకత్వమును మాత్రమె బోధించునదైనది. వాస్తవముగా నీ "ఉమ్" అనునదే ఉత్తమ మధ్యమ పురుషలలోని బహువచనరూపములం దగపడు "మ" కారముయొక్క లేదా "ము" వర్ణముయొక్క నిజ స్వరూపము. త. ఏ(న్)—ఏమ్, నీన్—నీమ్. తె. ఏ—ఏ(ను)—ఏము, నీ(వు)—మీా(రు). తక్కిన క్రియారూపము లన్నింటి కంటెనుగూడ నీ భాషలలో విధ్యర్థకరూపము లతిప్రాచీనములు గావున మూలధాతు వేకవచనమును దెలిపినపు డీ "ఉమ్"అనున దా ధాతువుతోఁ జేరి బహుత్వమును సూచించినది. అట్లె యీా భాషలలో—నే భాషలలోనైనను—సర్వనామము లతిప్రాచీనరూపము లని తలంపక తప్పదు గావున సర్వనామరూపములలో ఏ—నే(నా), ఈ—నీ అనునవి ఉత్తమమధ్యమైక వచనములను సూచించినపుడు, వీనిపై "ఉమ్" చేరి బహుత్వమును సూచించినది. ఏ—ఏమ్, ఏము—మేమ్—మేము. నా+ఉమ్=నామ్; నీ+ఉమ్=నీమ్. మధ్య ఉకార మెట్లు జారిపోయినదన్న విషయమునుగూర్చి ప్రశ్నించుటకుఁ బూర్వము, ఈ రూపము లీ భాషలో నెంత ప్రాచీనములో యను విషయము నొకమాఱు స్మరించుట మంచిది. మొత్తము మీాఁద "ము" వర్ణము బహువచనసూచక మనుట తప్పదు గదా. తమిళాంధ్రములలో ము వర్ణాంతమగు విధ్యర్థక రూప

మిట్టిదై యుండ కన్నడమునఁ గూడ ధాతువును మాత్రము ప్రయోగించుటయే గాక యీ ధాతువును "మ" కారాంతముగఁ జేసి ప్రయోగించుటయుఁ గలదు. గాని యించుక భేదముకలదు. తమిళాంధ్రములలో శెయ్యుమ్, చేయుము అని "ఉమ్" కనఁబడుచుండ కన్నడరూపములలో నిది "ఇమ్" గాఁ గానఁబడుచున్నది.

| ఏ. | బహు. |
| --- | --- |
| గెయ్ | గెయ్యిం, గెయిం. |
| మాడు | మాడిం. |
| సమకట్టు | సమకట్టిం. |
| పోగు | పోగిం. |
| ఆరయ్ | ఆరయిం. |

ఈ బహువచన రూపములం దగపడు "ఇం" అనునది మధ్యమ పురుష బహువచన "సీం — ఈం" అనుదాని రూపాంతరమే యని కిట్టెల్ పండితుని యభిప్రాయము. మధ్యమ పురుషలోనేగాక ఉత్తమ పురుషలోఁగూడ బహువచనమునఁ గనబడుచున్న "మ" కారముయొక్క నిజస్వరూపమేమి యని విచారించినచో సముచ్చయార్థకమగు (copulative) "ఉమ్" అను దానికి సంబంధించినదనవలసినదే. ఈ "ఉమ్" అనునదే ఉన్–ఉను–ను, అను సముచ్చయార్థక ప్రత్యయముగ నివ్వడన్ని భాషలలోను విశేషముగా వాడుకలో నుండనేయున్నది. ఇదియే యతి ప్రాచీనకాలమున తాను గాక మఱియొక్కఁడును

—లేదా ఒకడుగాక మఱియొకఁడును—ఒకటితో మఱియొకటి కూడుట యను నర్థమునఁ ధాతువునకుఁ జేర్పఁబడి, రెండు చేరుటతోడనే బహుత్వ మేర్పడినది గాన బహుత్వ సూచకమగుట తటస్థించినది. మొత్తముమీఁద "చేయుము" "చెయ్యుమ్" అనునవి ప్రాచీనరూపము లనుటకు సందేహము లేదు. కాని వీనికంటె "చేయు"—"నిలు" అను రూపములు ప్రాచీనతరము లనవలయును. కావుననే తరువాత వచ్చిన "ము" వర్ణము లేని "ఉండుండుము" మొదలగు రూపము లేర్పడినవి. అనఁగా "ఉండు" అను ధాతువు మాత్రమే విధ్యర్థకరూపముగ వ్యవహరింపఁబడు సంప్రదాయమును బట్టి "ఉండు" అను ప్రాచీనరూపమునకు "ఉండుము" అను నర్వాచీనరూపము చేర్పఁబడి యుండుననుట.

# ఆగమసంధి

పూర్వపదాంత్య స్వరమును పరపదాది స్వరముతోఁ జేర్చి యుచ్చరించునపుడు డచ్చుటఁ జేరిన యచ్చుల స్వభావమును బట్టి యంతస్థవర్ణములగు యకార వకారము లుచ్చారణమునకు సహకారులై నడుమఁ జేరినఁ జేరవచ్చును. గాని యీ యచ్చులకు సంబంధింపకయే యే వర్ణములైనను నడుమ వచ్చుననుట సంభావ్యము కాదుగదా. అట్టి వొకప్పుడు గలిగినచో వేఱు కారణములేమైన నుండవలయునని యిదివఱకే చెప్పబడియున్నది. కావున పై యంతస్థ వర్ణములకు భిన్నములగు వర్ణము లే యే సందర్భముల వచ్చుచున్నవో, యా స్థలములం దవి వచ్చుటకుఁగల కారణము లేమై యుండునో పరిశీలింపవలసి యున్నది.

టుగాగమము—ఈ టుగాగమము వచ్చు స్థలములను గూర్చి వ్యాకరణ మిట్లు చెప్పుచున్నది.

“కర్మధారయంబులం దుత్తున కచ్చుపరంబగునపుడు టుగాగమంబగు. కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చుపరంబగు నపుడు టుగాగమంబు విభాషనగు.”

(బాల. వ్యా. సం. 28, 29 సూ.)

వీనినిబట్టి యీ టుగాగమము ముఖ్యముగాఁ గర్మధారయ సమాసములందు వచ్చుచున్నదనుట స్పష్టము. కర్మధారయసమాస మనఁగా విశేషణవిశేష్యభావ సంబంధము

గల రెండు పదములతోఁ జేయఁబడిన సమాసముగదా. కలుకు+అమ్ము, నిగ్గు+అద్దము అని యుండఁగా సహజముగ స్థానబలముచేతనే వానిలో మొదటిది రెండవదానికి విశేషణమై నిలిచియుండినను, దాని విశేషణత్వమును మఱింత సువ్యక్తము చేయవలయు నను భావము ప్రబలమైనప్పుడు భాషలో సామాన్యముగాఁ బ్రాతిపదికలపై విభక్తిసూచక ప్రత్యయములు (ఇవి వాస్తవముగా ప్రత్యేక స్వతంత్రపదములె గాని సంస్కృతాదు లందువలె విభక్తి చిహ్నములు మాత్రముకావని యెఱుంగునది) చేర్పఁబడునప్పుడు నడుమ వచ్చి చేరు నిగాగమాదులవలెనే "టి" అనునది యిచ్చటఁ జేర్పఁబడినది. ఈ "టి"లో నున్న ఇకారమే ప్రధానముగా సంబంధార్థమును దెలుపునదై రాముని*పుస్తకము, రాముని చేత మొదలగు చోటులఁ గానవచ్చుచున్నది. కలుకు అనునది స్థానమునుబట్టియు నర్థమును బట్టియు విశేషణమే యైనను, అర్థవ్యక్తికిఁగాను కలుకైన బాణము అని "అయిన" అను శబ్ద మిప్పుడెట్లు చేర్పఁబడుచున్నదో అట్లే 'టి' అనునదికూడ వెనుకటి కాలమునఁ జేర్పఁబడినదై యిప్పటికిని వ్యవహారములో నున్నది. ఇది నామవాచకములను విశేషణములుగాఁ జేయుటకై చేర్పఁబడిన స్వతంత్రశబ్దముల యవశిష్టభాగమే యైనను, కొన్ని సందర్భములలో విశేషణవాచక శబ్దముల

* రాముని యనునప్పుడు నిగాగమ మనఁబడు "ని" యనునది "రామున్" అనుదానిపై సంబంధార్థక "ఇ" కారము చేరుటచే నేర్పడిన రూపములనుండి విడదీయఁబడిన భాగమైయున్నది.

పైఁ గూడ జేర్పఁబడుచు వచ్చినది. సరసము+అలుక అను దానిలో స్థానమును బట్టి సరసతకు సంబంధించిన యలుక యనియే యర్థమగును. (ఉదా. వనముత్రోవ-పేము బెత్తము) కాని సరసము అను శబ్దముయొక్క విశేషణత్వమును వ్యక్తము చేయుటకు పాము మొదలగు ప్రాచీన బువర్ణాంత శబ్దముల సాదృశ్యమున దీని తుదిహల్లు గూడ పరుషముగాఁ జేయఁబడుటచే సరసపుమాట అను రూపము వ్యవహారము లోనికి వచ్చుటయు మఱికొంతకాలమున కొపవిభక్తిక టి వర్ణముగూడ దేశ్యపదముల సామ్యముచేఁ జేర్పఁబడుటచే సరసపుటలుక అను రూపముకూడఁ గలుగుటయుఁ దట స్థించినది.

కర్మధారయేతర సమాసములయందుఁగూడ నీ టుగాగమము వచ్చినను, అది యా సమాసములలోని రెండు పదములకు విశేషణ విశేష్యభావ సంబంధము కలదని మాత్రమే సూచించును. వేల్పు+ఆవు అనఁగా వేల్పులయొక్క ఆవు అని షష్ఠీతత్పురుష యని చెప్పినను, వేల్పులకు సంబంధించిన యావనియే యర్థము గావున "టి" అనునది వేల్పు శబ్దమునకును ఆవు శబ్దమునకును సంబంధము కలదని సూచించుచున్న దనవచ్చును. అట్లే మదపుటేనుఁగులోని టువర్ణము మదమునకు సంబంధించిన-మదముతోఁ గూడిన-యేనుఁగు అని యా పదములకుఁ గల సన్నిహిత సంబంధమును సూచించుచున్నది.

పేర్వాది శబ్దంబులపై వచ్చు టుగాగమము నిట్టిదే. కఱకు శబ్దమువలెనే "పేరు" శబ్దమును విశేషణ వాచకమే. 'పేర్' అను దీని హలంతరూపమునుబట్టి గాంబోలు పేరు+ ఉరము=పేరురము అని ప్రాచీనసమాసము భాషలో నేర్పడియే యున్నది. పెద్ద వక్షమని చెప్పినచో నర్థమగుచునే యుండఁగా నా భావమును మఱింత వ్యక్తముగాఁ జెప్పుటకు గాకు పెద్దదైన వక్షము అని యిప్పటి వ్యవహారమున మనము చెప్పుచున్నట్లే, పేరురము అను శబ్దమునందలి "పేరు" శబ్దమునకును ఉరము శబ్దమునకును గల సంబంధమును బాగుగా వ్యక్తము చేయుటకై భాషలో విశేషణత్వద్యోతక ప్రత్యయముగా నేర్పడియున్న టి వర్ణముగూడఁ జేర్పఁబడి యుండును. ఇట్లే చిరుగుటాకు, పొదరుటిల్లు అను సమాసములు భాషలో నేర్పడినవి.

ఈ "టి" అనునదిమాత్ర మిచ్చట వచ్చుటకుఁ గారణ మేమి? ఇది యొపవిభక్తిక వర్ణ మనుటలోఁ గల విశేష మేమియని యడుగవచ్చును. వాస్తవముగా నీ భాషలోని విభక్తి ప్రత్యయములు చాలవఱకుఁ బ్రత్యేకపదములే యైయుండుటచేత ప్రాతిపదికమున కీ పదములతోఁ గల సంబంధమును వ్యక్తముచేయుట కొక కాలమున అత్తు, ఇన్, అను శబ్దములు ప్రత్యేకముగాఁగాని, రెండునుగాని చేర్పఁబడుచు వచ్చినవి. వాస్తవముగా నీపై సమాసములలోని భిన్నపదముల విశేషణ విశేష్య భావసంబంధమును వ్యక్తము

చేయునది "ఇ" కారమే యనవలసియున్నది. ఈ "ఇ" అనునది తొలుత స్థలవాచకమై పిదప సంబంధార్థద్యోతకముగఁ బ్రయోగింపఁబడిన "ఇల్-ఇన్" శబ్దముయొక్క యవశిష్ట భాగము. తొలుత రెండు పదముల సంబంధమును సూచించున దగుటచే నౌపపదకమై పిదప పదమే, విభక్త్యర్థమును సూచించు ప్రత్యయముగా మాఱినపుడా నదుమఁ జేర్పఁబడు నౌపవిభక్తిక ప్రత్యయముగా గ్రహింపఁబడినది. కాలు-కాలిచేతను; ఊరు-ఊరివారు,-మొదలగువానిలో ఇకారము మాత్రమే కనఁబడుచున్నది. ఏఱు, నోరు, త్రాడు, కాడు, రెండు, మూడు, చవుడు మొదలగు శబ్దములపైఁ జేరిన "ఇ" కార మా పదాంతవర్ణములతోఁ గూడి, (ఉదా: ఏటి, నోటి, త్రాటి, కాటి, రెంటి, మూటి, చవుటి అను వానిలో) "టి" వర్ణముగా మాఱినది. కొంతకాలమున కీ పదముల తుదిని గల "టి" వర్ణమే యౌపవిభక్తిక ప్రత్యయ మని తలంచి అన్ని, ఏమి, వేయి, నాగలి, పగలు, కన్ను, ఇల్లు, మిన్ను మొదలగు పదములపైఁ జేర్చుట మొదలుపెట్టుటచే అన్నిటి, ఏమిటి, వేయిటి, నాగటి, పగటి, కంటి, ఇంటి, మింటి మొదలగు రూపములు భాషలో నేర్పడినవి.

అత్తు అను దానిపై "ఇ" చేరి అత్తి కాఁగా దానిలోని "త్తి" వర్ణముకూడ నౌపవిభక్తికంబైనది. ఉదా:- నేయి-నేయత్తి-నేతి; నూయి-నూయత్తి-నూతి. తమిళ కన్నడము లందుఁగూడ నౌపవిభక్తికముగ నామములపైఁ జేర్పఁబడిన

యీ "అత్తు" అనునది "అదు" శబ్దముయొక్క రూపాంతరమే. "మరం" శబ్దమున కౌపవిభక్తిక రూపము తమిళమున "మరత్తు" అనియు, కన్నడమున "మరద" అనియుఁ గలదు. వానినుండి విభక్తిరూపములు తమిళములో తృతీయ-మరత్తాళ్-మరత్తోడు; చతుర్థి—మరత్తిర్కు; పంచ-మరత్తిన్; షష్ఠి—మరత్తినదు; సప్త—మరత్తినిల్,-అనియు; కన్న: తృ—మరదిం, పం—మరదత్తణిం, ష—మరద, సప్త-మరదొళ్ అనియు నగుచున్నవి. తెనుఁగునందలి "నేతి, నూతి" మొదలగు నౌపవిభక్తికాంత శబ్దములం దగపడు "తి" వర్ణములోని తకారమును, మరత్తాళ్, మరదొళ్ మొదలగు తమిళ కన్నడములందలి రూపములలోని యౌపవిభక్తిక తకార దకారములు నభిన్నములే. అనఁగా నివి యీ భాషలలో నొక్క విధమగు కార్యమును సాధించుటకై ప్రాచీనకాలమునఁ జేర్పఁబడిన యొక శబ్దముయొక్క భిన్నరూపములే యనుట. "నా పుస్తకము—పుస్తకము నాయది" అని యిప్పుడు చెప్పఁబడుచున్నట్లే వెనుకటి కాలమున "అత్తు" అనునది ప్రాచీన భాషలో విశేషణత్వద్యోతకముగా శబ్దములపైఁ జేర్పఁబడినది.

ఇట్లు కర్మధారయాదులం దాగమముగా విధింపఁబడిన టకారము ఔపవిభక్తిక టివర్ణంబుతో నభిన్నంబై యాయా పదముల విశేషణవిశేష్య భావసంబంధమును దెలుపుటకుగాఁ బ్రాచీనభాషలోఁ బ్రాతిపదికలపైఁ జేర్పఁబడిన "అత్తు, ఇన్" అను శబ్దములయొక్క లుప్తశేషం బగు రూపమే యని నిశ్చయింపఁదగి యున్నది.

రుగాగమము :— కర్మధారయమందు పేదాది శబ్దముల కాలుశబ్దము పరమగునపుడు రుగాగమం బగుచున్నది; అనఁగా పేద+ఆలు అను నీ రెండు శబ్దంబులు గలిసి యొక సమాస మయినప్పుడు వాని మధ్య నొక రేఫము చేరుచున్న దనుట. పేద+ఆలు = పేదాలు అని కావలసియుండఁగా "పేదరాలు" అయినది. ఇచ్చట రేఫాగమమునకుఁ బ్రసక్తి కానఁబడదు. వెనుకటి సమాసంబులలోని "టు" గాగమము "అత్తు" శబ్దమునకు సంబంధించినదని చెప్పినట్లే యీ రేఫము సంబంధార్థమునఁ జేర్పఁబడిన యొక శబ్దముయొక్క యవశిష్ట భాగ మని చెప్పుటకైన నవకాశమేమియుఁ గనఁబడదు. ఇది "పేదవారు"అను బహువచనశబ్ద రూపాంతర మగు "పేదరు" శబ్దమునకు ఆలు శబ్దముఁ జేర్పఁగా నేర్పడిన రూపమై యుండ వచ్చును. తమిళమున పేదవాండ్రు అను నర్థమున 'పేదయర్' అను బహువచనరూపము కలదు. కావున "పేదరు+ఆలు= పేదరాలు అయి యుండవలెను.

ఇఁక కోమరాలు అను శబ్ద మొకటి కలదు. దానిని వైయాకరణులు కోమ+ఆలు అని విడదీసి, నడుమ రుగాగమము వచ్చుటచే కోమ+ర్+ఆలు=కోమరాలు ఐనదని చెప్పుదురు. కాని ప్రాచీనభాషను తరువాతికాలపు వైయాకరణులు వ్యాకరించునపు డొకొక్కచోట ననుచితవిభాగము సంభవించుచుండు ననుట కిదియొక దృష్టాంతముగాఁ గైకొన వచ్చును. ఏలయనఁగాఁ "గోమరు" అను శబ్దమే వ్యస్తముగా

భాషలో వ్యవహారమున నుండుటచేఁ బ్రాచీనకాలమున కొమసు శబ్దమునకే "ఆలు"శబ్దమును జేర్పఁగా "కొమరాలు" రూపము భాషలో నేర్పడిన దనుటకు సందేహము లేదు. ఇట్టి శబ్దముల సామ్యముచేతనే ప్రాచీనకాలమున మనుమరాలు మొదలగు దేశ్యరూపములును, జవరాలు ముద్దరాలు మొదలగు తద్భవరూపములు నేర్పడియుండును. భాషలోఁ బ్రాచీనములని తలంపదగిన యాచ్ఛికశబ్దములపై "ఆలు" శబ్దము పరమైనపుడే కొన్ని ప్రాచీనసమాసముల సామ్యముచే రేఫాదేశము కలిగి 'మనుమరాలు, గొడ్డురాలు, జవరాలు' మొదలగు రూపము లేర్పడినపుడు వానికంటె నర్వాచీనములని తలంపఁదగిన తత్సమశబ్దముల కాలు శబ్దము పరమైనపుడు "రు"గాగమం బగుటలో నభ్యంతర మేమి? కావున గుణవంతురాలు, ధీరురాలు మొదలగు రూపములుకూడ నై రూపముల సామ్యముచే భాషలో నేర్పడుట తటస్థించిన దనవచ్చును.

ఈ భాషలో సామ్యమున నేర్పడినవని చెప్పఁదగిన శబ్దములలో ద్విరుక్త టకారముతోఁ గూడినవి కొన్ని కలవు. ఇవి యామ్రేడిత సంధికి సంబంధించినవి. సామాన్యముగా భృశార్థమును సూచించుటకు శబ్దమును రెండుమాఱు లుచ్చరించుట స్వాభావికమై కనఁబడుచున్నది. సంస్కృతాది ఇండో-యూరపియన్ భాషలలోను ఇట్లు చెప్పుట కలదు. మందం మందం, బోభూయతే, జంగమ్యతే, జంజప్యతే మొదలగు రూపములు శబ్దముల ద్విరుక్తివలన నేర్పడినవే.

భృశార్థమును సూచించుటకుగా కడ శబ్దమునకు ద్విరుక్తి కలుగఁగా కడ-కడ, యని నిలిచినపుడు మొదటి శబ్దము రెండవ శబ్దమునకు విశేషణస్థానమును వహించినది. కావున నీ భాషలలోని ప్రాచీనసంప్రదాయానుసారముగా మొదటి శబ్దమందలి డకారము పరుషమై ద్విత్వమును పొందును. అప్పుడు తొలి "కడ" కట్ట యగుటచే కట్ట+కడ=కట్టకడ అను రూప మేర్పడుట తటస్థించినది. అనఁగా నీ ద్విరుక్త టకారము తొలిపదముయొక్క విశేషణత్వమును సూచించున దయ్యె ననుట. అట్లే కడు శబ్దము భిన్నశబ్దమునకుఁ బూర్వమున నిలిచినను అది విశేషణమగుటకు సూచకముగా తుది డకారము ద్విరుక్త టకారం బగుచున్నది. ఉదా: కడు+ఎదురు= కడెదురు కాలేదు—"కట్టెదురు" అని యైనది. ఇది భాషలో మిగులఁ బ్రాచీనరూపమై యుండును. ఇట్లే నడు శబ్దమున కామ్రేడితము పరమగునపుడు "నడు"లోని డకారము పరుషత్వమును పొంది నట్టయై—"నట్టనడుమ" అని యగుచున్నది. ఇట్టి డకారాంతములగు శబ్దములు విశేషణములైనపు డందలి డకారము ద్విరుక్త టకార మగుచుండుటనుబట్టి యీ భృశార్థమున ద్విరుక్తములగు నితరశబ్దము లన్నింటికినిగూడ తొలి యచ్చు మీఁది వర్ణంబుల కెల్ల ద్విరుక్తటకారమునే చేర్చుచు వచ్చిరి. ఆ పదములు 'డ'వర్ణసహితములా? కావా? యను వివేచనయే కలుగలేదు. కడు, నడు శబ్దములు 'డకార' సహితములును, రెండక్షరముల శబ్దములు నగుటచే డకార

స్థానమున వచ్చిన ద్విరుక్తటకార మా శబ్దములలో రెండవ యక్షరము లేదా తొలియచ్చుమీఁది వర్ణంబైనది. కావున వీని సాదృశ్యముచే "చివర, పగలు, బయలు" మొదలగు మూఁడక్షరముల శబ్దములలోఁగూడఁ దొలియచ్చుమీఁది వర్ణంబుల నన్నిటిని లోపింపఁజేసి వాని యన్నిటి స్థానమునను "ట్ట" వర్ణమును నిలిపిరి. "కట్టకడ" "నట్టనడుమ" అని చెప్పుచున్నాముగదా! (బయలు బయలు) బట్టబయలు, పట్టపగలు, చిట్టచివర అని యెందుకుఁ జెప్పఁగూడదను భావముతోఁ బైవాని సాదృశ్యమునుబట్టి జనులు వ్యవహరించుటచే నేర్పడినవేగాని వాస్తవముగా వీనిలో ద్విరుక్త టకారము వచ్చుటకవకాశమే లేదు. కాబట్టి 'కట్టకడ' 'నట్టనడుమ' అను రూపములలో కడు, నడు శబ్దములనుబట్టి ద్విరుక్తటకారము సహజముగా వచ్చినదనియుఁ దక్కినవానిలో నిది సహజము కాదనియుఁ గావుననే సాదృశ్యజ (Analogical) మనియు నిశ్చయింపఁ దగియున్నది.

ఆమ్రేడితము పరమగునపుడు గలుగు విభక్తిలోపము చ్చారణవేగమునఁ గలుగవచ్చును. తుది శబ్దమునందలి విభక్తియే యా సమాసగతమగు మొదటి శబ్దమునకు నా సమాసములోని యితర శబ్దములకుఁ గల సంబంధమును వ్యక్తము చేయుచునే యుండును. గావున నచ్చట విభక్తి ప్రత్యయ ముండినఁగాని యర్థమునకు భంగము కలుగు నను భయము లేదు. "అప్పటి కప్పటికిన్" అనునది తరువాతి

కాలమున భాషలో బయలుదేరిన రూపము కావచ్చును. ఊరూరు, అక్కడక్కడ, అను పదబంధము లేర్పడిన పిదపనే వీనిపై విభక్తిప్రత్యయములు చేర్పఁబడి, "ఊరూరన్" "అక్కడక్కడకు" అను రూపము లేర్పడియుండు ననియుఁ దలంపనగును. "ఇంటింటన్" అనునది మాత్ర మాపవిభక్తి కాంతమగుటచే "ఇంటన్+ఇంటన్" అని యుండఁగా నుచ్చారణ వేగమున సంధి జరిగినదని చెప్పక తప్పదు. ఇల్లిల్లు రూపముకూడ భాషలోఁ బ్రసిద్ధమై వ్యవహారమునఁ గలదు. (ఉదా:—గోకుల మిల్లులు దప్పకుండ లక్ష్మీతతి గ్రుమ్మరున్" భాగ.) "ఇంచించుక" "నానాడు" శబ్దములలో శబ్దాంత్యభాగములే లోపించినవి. నాడు, నాడు కలసి యొక్క పదమైనపుడు రెండవ పదస్వరూపము మొదటిదానినిగూడ స్ఫురింపఁజేయుచునే యుండును. మరియు నొక పదమునందలి తొలి యక్షరముపై స్వరమూఁదినపుడు తరువాతి యక్షరములు తేల్చి పలుకఁబడుటచే నది మఱియొక పదముతోఁ జేరినపు డవి క్రమముగా లోపించుచుండును. మొత్తముమీఁద నీ శబ్దములు ఇంచుక+ఇంచుక, నాడు+నాడు అను సంపూర్ణ శబ్దములు కలసి యుచ్చారణవేగముచేఁ బూర్వ శబ్దాంత్యాక్షరము జాఱవిడవఁబడుటచే నేర్పడినవనియే తోఁచుచున్నది.

అందదుకు ప్రభృతులు:—కాని "యందదుకు" ప్రభృతులు మాత్ర మిట్టివని తలంచుట కవకాశ మగపడదు. కావున నే వాని రూపనిష్పత్తిక్రమమును గూర్చి చెప్పక "యథా

ప్రయోగంబుగ గ్రాహ్యంబులు" అని వైయాకరణులు చెప్పి యున్నారు. అనఁగా నివి భాషలో మిగులఁ బ్రాచీనరూపము లగుటచే వీనియందలి భాగములను విడఁగొట్టి చూపుటకు వైయాకరణులకు సాధ్యము కాలేదన్నమాట. "అందదుకు" శబ్దమును గ్రహింతము. నాడు+నాడు అని ద్విరుక్తి కలిగి నపుడు మొదటి పదము సంత్యాక్షరమునకు లోపము వచ్చిన దని చెప్పినట్లుగా "అందదుకు" శబ్దములోని తొలి "అదుకు" శబ్దము తుదివర్ణము లోపించినదని తలంచినచో అదుకు+ అదుకు "అదదుకు" అని కావలసినదేగాని అందదు కెట్లయి నదో చెప్పుట కవకాశము కలుగుట లేదు. "అదుకు+అదుకు" అందదుకు ఎట్లయినదో తెలిసుకొనుటకుఁగా దీని ప్రాచీన స్వరూపము నితర భాషలలోఁ గొంతవఱ కన్వేషించి చూడ వలసి యున్నది. కన్నడ భాషలో "అతుకు" అను శబ్దము తెలుఁగునందలి యర్థముననే కలదు. "అదుకు, అతికు" అనియు రూపాంతరములు కలవు. తెలుఁగునందువలె కన్న డమునందును "కు" వర్ణ విరహితమగు "అత్తు" అను రూపాం తరము నొకటి కలదు. ఈ 'అత్తు' అనునది "అఱు" ధాతువు యొక్క భూతార్థక విశేషణముగాఁ గనఁబడుచున్నది. "అఱు+తు=అఱుతు, అఱుత్తు" "అత్తు". తమిళమునఁగూడ "అఱుత్తు" అనుదానికి దృఢీకరణము—గట్టిగా నొత్తుట (to press) అను నర్థము కలదు. తెనుఁగునందును "అత్తు" అనునది అత్తుకొనుట=ఒకదానితో నొకటి అత్తి (కలిపి),

యుండుట అను నర్థమున వ్యవహారములో నున్నది. తమిళము నందలి "అఱుత్తు" అను సకర్మకరూపమునకు అకర్మకరూపము "అఱుందు" అని కలదు. దీనియర్థము (to press) గట్టిగాఁ గలియుట, బిగియుట. ఈ "అఱుందు" అనుదానికంటె "కు" వర్ణాంతరూపము భాషలోఁ దరువాతిది కావచ్చును. కావున "అఱుందు+అదుకు=అందు + అదుకు = అందదుకు" అను రూపము సిద్ధించును. దీనినిబట్టి వీని కన్నింటికిని మూల మగు ప్రాచీన ధాతువు "అఱు" అనియు, దానికి "అఱుందు, అందు" అను రూపములు ప్రాచీనకాలమున గలవనియు నీ సమాసమందలి తొలిరూప మద్దానిని సూచించుచున్నద నియుఁ దలంపవలసియున్నది.

ఇఱ్ఱింకులు :—ఇదియు మిగులఁ బ్రాచీనకాలమున నేర్పడినదే కాని "ఇంకు+ఇంకు" అను శబ్దముల కూడిక మాత్రముచేతనే యేర్పడినదై యుండదు. ఇంకు + ఇంకు శబ్దములే కూడినచో మొదటిపదములోని "ంకు" అను వర్ణమునకుబదులు ఱ్ఱ కారాగమము వచ్చుటకుఁ గారణమేమియుఁ గనఁబడదు. ంకు, ఱ్ఱ గా మాఱినదనుట కవకాశమే లేదు గదా. కావున మొదట నీ శబ్దములోనే "ఱ" కారముండి యుండవలయును. "ఇఱుకు" అను శబ్దమునకును సాక్షాత్సంబంధ మిప్పు డగపడుట లేదు. కాని పరిశీలించినచో నీ రెండు నొక్కటే యని మనము గుర్తింపలేకపోము. వీని యర్థమునఁ గూడఁ గొంత పోలిక, సంబంధము లేకపో లేదు. "ఇఱుకు"

ధాతువునకు సంకుచితత్వ మర్థము ; ఒదిఁగి యుండుట—ఒత్తుడు పడుట అనియును గలదు. ఇట్లొదిగి, ఒత్తుడుపడి యుండి యత్యల్పస్థల మాక్రమించి తుదకా స్థలమున లీనమై రూపు మాసిపోవుటయే "యింకుట" అగుచున్నది. కావున ఇఱుకు, ఇంకులకు అర్థసంబంధము కలదు. ఇఱుకు ధాత్వర్థభావము— మఱికొంత ఇఱుకట మెక్కు వయై—"ఇంకు" ధాత్వర్థమైనది. విశేషముగా ననఁగా రూపుమాసిపోవు నంతగా ఇఱుకుకొని పోవుటయే ఇంకిపోవుట. "ఇంకు" ధాతువు సామాన్యముగా సీరింకుట, ద్రవపదార్థము "ఇంకిపోవుట" అను నర్థములోనే వాడుకలో నున్నను, ఇట్టింకు అను రూపమునుబట్టి "ఇఱుకు కొనిపోవుట" అను నర్థమునఁగూడ భాషలోఁ బ్రయోగింపఁ బడియున్న ట్లగపడుచున్నది. ఇట్లు "ఇంకు" ధాతువుయొక్క పూర్వస్వరూపమునే గాక తొలి యర్థమునుగూడ నీ శబ్దము మనకు సూచించుచున్నదివలెనే యున్నది. భాషలో నీ శబ్దము ప్రయోగింపఁబడిన సందర్భములఁ గొన్నిటిని చూతము.

"ఎవ్వాఁడు వింధ్యాద్రి నిట్టింకు లింకించె?" నను శ్రీనాథుని భీమేశ్వరపురాణ మందలి ప్రయోగమున వింధ్యాద్రి నిట్టింకు లింకించుట యనఁగాఁ గ్రిందికి, భూమిలోనికి నిఱుకుకొని పోవునట్లుగాఁ జేయుట—అణఁచివేయుట అనియే యర్థము.

"మంకెనపువ్వుమీఁది యళిమాడ్కి నృపాధరపల్లవాధరా లంకృతియైన దంతపదలాంఛనముం గని కన్నుఁగోనలం

దంకురితంబులైన దరహాసలవంబులు పద్మనేత్ర యి
ట్టింకులు చేసెఁ బత్మ్యముల యీఁబుమి గాటుకచిమ్ముచీఁకటిన్.

అను నైషధ ప్రయోగమున నణఁచె-కనఁబడకుండు నట్లు చేసె ననియే యర్థము. కావున "ఇంకు" శబ్దమునకు "నీళ్లింకుట" అను నర్థమే వ్యవహారమున స్థిరపడినను, ఇట్టింకులు అను ప్రాచీనపదము "ఇఱుకు" ధాత్వర్థమును సూచించు చున్నదనుటలో సందేహ మక్కరలేదు. అయితే "ఇఱుకు-ఇంకు ఎట్లయిన" దని ప్రశ్న; అనఁగా నిందలి యనునాసిక మెట్లు వచ్చినదనుట. కన్నడమున ఇఱుకు ధాతువు ఇకారోకార మధ్యమమై అనునాసికముతోఁగూడఁ గూడియున్నది. ఇఱంకు, ఇఱింకు, ఇఱుంకు అను రూపము లందు గలవు. దీనికి ప్రేరణార్థకమగు "ఇసు" చేర్పఁబడినప్పుడు ఇఱికిసు, ఇఱుంకిసు, ఇఱుకిసు రూపము లేర్పడుచున్నవి. ఈ రూపములన్నియు నాంధ్రములో వాడుకలో లేకపోయినను, ప్రాచీన కాలమునుండి కన్నడమునఁ గనఁబడుచున్న యనునాసికముతోఁ గూడిన రూపములే ఇంకు ధాతువులోని యనునాసికమునకు మూలకారణములని నిశ్చయింపవచ్చును. ఇఱంకు, ఇఱెంకు, ఇఱుంకు శబ్దములలోని మధ్య ఱకారము జాఱిపోవుట చేతనే "ఇంకు" రూపము సిద్ధించినది. ఇంకు ధాతువునకుఁ దొలి రూపము ఇఱుంకు, లేదా ఇఱింకు అని చెప్పగలిగి నప్పుడు అతిశయముగా ఇఱింకుటలు, ఇట్టింకులై యుండు ననుటకు సందియము లేదుగదా. దీనిసిబట్టి "ఇంకు" ధాతువు

భావలో నేర్పడిన పిదప, ఇంకు+ఇంకు అనియుండఁగాఁ ద్రాఁతాదులలోవలెఁ దొలి పదమునందలి తొలి యచ్చు మీఁది వర్ణంబులకు లోపంబును, పిదప ద్విరుక్త టకారాగమ మందును వచ్చి యీ రూప మేర్పడి యుండదని నిశ్చయింప వచ్చును. దీని నిష్పత్తిక్రమమును సాధించుటలో నది తాత్కాలికవ్యాకరణ మవలంబించు పద్ధతి గాని చారిత్రక పద్ధతికాదు. ఇప్పటి "ఇంకు" లో "ట"కారము కనఁబడ కున్నను, "ఇట్టింకు" లోఁ గనఁబడుచుండుటయే ప్రాచీన కాలమున నిదియొక టకారముతోఁగూడి "ఇటింకు" అను రూపమున నుండె ననుటకు నిదర్శన మగుచున్నది. కావున ఇట్టింకు శబ్దములోని "ట" కారము ఇంకు ధాతువునకు మూలమైన, ప్రాచీనంబగు "ఇటింకు" ధాతువును సూచించు చిహ్నముగా గ్రహింపఁదగును.

ఇల్లిగ్గులు :— ఇది ఇగ్గులు+ఇగ్గులు అను శబ్దముల కూడికచే నేర్పడినదని శబ్దరత్నాకరము చెప్పుచున్నది. "మిక్కిలి వెనుక కొఱగుటలు" అని దాని యర్థము. (శబ్దరత్నాకరము.)

"లొల్లియగు వగల ద్రొక్కన
నిల్లిగ్గులు గాఁగవచ్చు హృదయములోనన్
మల్లాడియగు మదనుఁడు
మెల్లన గూర్చుండెఁ దాల్మి మినుమినుకనఁగన్."
ఉ. హరి. 5. ఆ.

"ఇస్గ" శబ్ద మెట్లేర్పడినదో ముందు విచారింపవలెను. "ఇస్గు" ఈఁగు శబ్ద రూపాంతర మని శ. ర. కారుఁడు. "ఇగ్గ మ్రొగ్గనీడ్చె" అనఁగా వెనుకకొఱఁగునట్లును, ముందు మోకరించున ట్లీడ్చెనని యర్థము.

"ఇగ్గెడు వెన్కకుం బయికి నీడ్చినఁ బైటఁ దోలంగఁ జేయఁ గేలొగ్గెడు."

విజయ. 2. ఆ.

ఇక్కడ "ఒఱగుట" యని యర్థమఁట.

" ఈఁగి కరులు ఘీంకృతు లొనరించె
గ్రాఁగిన యసురల గతి నబ్బురింకె."

రామా. యుద్ధకాం.

ఇగ్గు అనునది 'ఈఁగు' ధాతువుయొక్క రూపాంతర మని చెప్పినను 'ఇల్లిగ్గులు' శబ్దములోని ద్విరుక్త లకార స్వరూప మెట్టిదో మనకుఁ దెలియవచ్చుట లేదు. ఇది మఱి యొక మూలధాతువునుండి యేర్పడి యుండవలయును. అది యేదై యుండునని విచారింతము. ఇగ్గు ధాతువును బోలినదే "ఒగ్గు" ధాతు వీ భాషలో గలదు. అది ఒఱగు శబ్దభవమై యుండును. ఒఱగునకు వంగు, వ్రాలు అని యర్థము. "ఒగ్గు"=మొనయు, (వల) పఱచు, చాచు, ఒడ్డు. వ్యవహారమున నించుక భేదమగపడుచున్నను, మూలార్థ మొక్కటియే. వల యొగ్గుట యనగా వల క్రిందవ్రాలునట్లు చేయుటయే

యగును. చెవి యొగ్గి విన్నాఁడు అనియుఁ గలదు. ఇట్లు ఒఱగు—ఒగ్గు అయినట్లే, ఎఱఁగు — ఇఱఁగు = ఇగ్గు అయియుండవచ్చును. ఎఱఁగు—అనఁగాఁ దిగుట. ఉదా: "ఎఱఁగిన యప్పెను వ్రేగున విఱుగుటయును" (bend low). దండప్రణామం బాచరించునపుడు మనుజుఁడు క్రిందికి వంగి భూమిపై వ్రాలుట సంభవించును. గావున "కేవలము క్రింగికి దిగు" అను నర్థము గల "ఎఱఁగు" శబ్దము—దండప్రణామం బాచరించు, నమస్కరించు అను నర్థము గలదైనది. ఆంధ్రమున నీ ధాతువు ఎ కారాదియై యున్నను, తమిళ కన్నడములయం దికారాదియై ఇఱంగు అను రూపమున గనఁబడుచున్నది. దీనికి దిగుట, క్రిందికి వచ్చుట అను నర్థములే కలవు. "ఇఱి" యను మూలధాతువునుండియే తెలుఁగున డిగు, దిగు అను రూపము లేర్పడినవి. ఇది తుళుభాషలో "ఇళి, ఇలి" యను రూపములు గలదై యున్నది. ఇఱియజాఱు అనఁగా క్రిందికి జాఱుట (to slip down) అని యర్థము. (ఉదా: క. ఇఱియ బీఱు, ఇఱియనూకిసు—క్రిందికి పడుట, త్రోయుట) ఇఱికె= దిగుట (descent, degraded condition) ఇఱకు—ఇఱుకు (to cause to go down, to lower, to go down, to incline) క్రిందికి దిగుట, దింపుట. ఇట్లు ఇఱంగు, ఎఱఁగు, ఇఱకు మొదలగు శబ్దములన్నియు నొక్క ధాతు కూటమునకుఁ జేరినవే యనుట స్పష్టము. తుళు భాషలో ఱ—ఱ, లకు బదులుగా "ళ" కారముగూడఁ గనఁబడుచుండుటచే ఇళిగు, ఇలిగు రూప

ములుకూడ నొకప్పుడు వాడుకలోనుండి పీనినుండి "ఇగ్గు" రూప మేర్పడియుండు ననవలసి యున్నది. అప్పుడు ఇళిగు– ఇగ్గులకు క్రింది కొఱగుట యను నర్థము కలుగును. అత్యంతము నొఱగుటలు, అను నర్థమున ఇలిగు+ఇగ్గు చేరుటచే 'ఇల్లిగ్గులు' అను రూపము ప్రాచీనకాలమున నేర్పడియుండును. ఈ ఇళిగు, ఇగ్గు ధాతువులు రెండునుగూడ నిప్పటి వ్యవహారమున నంత రించియే పోయినవి. భృశార్థమున వచ్చినను, మఱి యే యర్థ మున వచ్చినను నిట్టి పదకూటములలో నొకటి ప్రాచీనరూప మును, మఱియొకటి దానినుండి యేర్పడిన యర్వాచీన రూపము నయి యుండుననుటకు మఱికొన్ని నిదర్శనములను గూడ జూపవచ్చును. ఈ గణములోనే "మిఱుమిట్లు" అను శబ్దమొకటి కలదు. దీనిని "మిట్లు+మిట్లు" అని వైయాకర ణులు, నిఘంటుకారులునుగూడ విడఁదీసినారు. కాని 'మిట్లు' శబ్ద మెట్లు వచ్చినదని పరిశీలించినచో దీనికి రూపాంతరము 'మిఱ్ఱు' అనునది యీ భాషలోనే కనఁబడుచున్నది. 'మిఱ్ఱు' అనఁగా నున్నతభూమి, ఔన్నత్యము అని యర్థము.

"ఏమీ పార్థుఁడు నీవు దండిమగలై యీ వచ్చుకౌరవ్య సం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం బెద్ద మిఱ్ఱెక్కి మి
మ్మేమెల్లన్ వెఱగంది చూచెదముగాక ... ..."

భార. ఉద్యో. 3. ఆ.

"మిఱ్ఱుపల్లంబునై మెలఁగంగ" భార. ద్రో. 2 ఆ.

ఈ "మిఱ్ఱే" మిట్టయైనది. 'ఱ' కారద్వయ సంయోగము

'ట్ర' యని పలుకఁబడు నాచార మీ భాషలలోఁ గలదని గమనించి యున్నాము. మిక్కిలి మిట్టలు గొనుట యను నర్థమున ప్రాచీనమగు "మిఱు" శబ్దము, దాని రూపాంతరమగు "మిట్టు" శబ్దముతోఁగూడి "మిఱుమిట్లు" అను శబ్ద మేర్పడి నది. మిఱు మిట్లయినట్లే ఱకారద్విత్వముతోఁగూడిన చిఱు, కుఱు మొదలగునవి చిట్టి, కుట్టి మొదలగు టకారద్విత్వ రూపముల నీ భాషలో నిలిచియుండుట విశేషము. కన్నడ మున "మిట్టు" అనియే కలదు. దీనికి ఎత్తైన ప్రదేశము, కొండ (rising or high ground, a hill) అని యర్థము. తమిళమున "మిఴల్"—విఴల్ అనునది గొప్పతనమను నర్థమునఁ గలదు. మిడుకు, మీటు, మిట్టు, మిట్టిపడు మొదలగు శబ్దములన్నియు నీ ధాతువునకు సంబంధించినవే. "మెఱమెచ్చు" శబ్దముకూడ నిట్లే ప్రాచీన నవీన రూపముల కూడికచే నేర్పడినట్లున్నది. మెఱ అనునది ధాతువు, దీనికి "చు" చేర్పఁగాఁ మెఱచు—మెచ్చు, అయినది. మెచ్చుట యనఁగా ఎదుటివానిని తాను జేయు ప్రశంసచే మెఱయునట్లుచేయుట. మెఱయునట్లుగాఁ జేయుచు మెచ్చుకొనుట—మెఱమెచ్చు అగును.

చెల్లాచెదరు = చెదరు+చెదరు అని శబ్దరత్నాకర కారుఁడును, వైయాకరణులును దీనిని విడఁగొట్టినారు. కాని యీ పదబంధమున భృశార్థమును దెలుపుటకుఁగాఁ జేరిన శబ్దములు రెండు నొక్క మూలధాతువుయొక్క భిన్న రూపములు గాక సమానార్థకములేయగు భిన్న ధాతువులుగాఁ గనఁ

బడుచున్నవి. 'చెదరు' అనుదాని పూర్వరూపము కన్నడ భాషలో నిలిచియున్న "కెదఱు" అనునదై యుండును. తాల వ్యాచ్చరకములగు పదాది కకారములు గల పెక్కు శబ్దము లితరభాషలలో తాలవ్య చకారాదులుగ మాఱిపోయినను, కన్నడ భాషలో మాత్రము కకారముతోఁ గూడిన రూపములే నిలిచియున్నవి. కెదఱు—కెదఱ్ ధాతువున కా భాషలో చెదరఁగొట్టుట, చల్లుట (to be scattered about, to disperse) అనియే యర్థము. ఈ ధాతువు తెలుఁగులోవలెనే తమిళమునను చకారాదియై యున్నది. త. చెదఱు—చెదరు; మళ. కేదఱు. దీనినిబట్టి చెదరు+చెదరు అన్నచో భృశార్థమున తొలిపదమున ద్విరుక్త లకారము వచ్చుటకుఁ దగిన కారణమేమియు నీ ధాతుస్వరూపమునుబట్టి యగపడుట లేదు. కావున మొదటి శబ్దము దీనితో సమానార్థకమై లవర్ణముతోఁ గూడిన మఱియొక శబ్దమై యుండును. ఆంధ్రమున "చెల్లు" ధాతు వొకటి కలదుగాని దాని కీ యర్థము లేదు. కాని "చల్లు" ధాతువునకు "వికీర్ణత"యను నర్థమున్నను పై శబ్దము చకారముమీఁద ఎత్వముతో గూడిన "చెల్లాచెదరు" గాని "చల్లాచెదరు" కాదు. కావున నీ భాషలో చెదరఁజేయు (scatter) అను నర్థముగల "చల్లు" శబ్ద మెత్వముతో నెప్పుడైన గూడియున్నదేమో విచారింపవలసి యున్నది. కన్నడమున "చెల్లు" ధాతువే కలదు. దీనికి "వికీర్ణత్వమే" (to scatter about.) "చల్లుట" యనియే యర్థము. దీనికి

రూపాంతరము "చెలంకు". సామాన్యముగా నీ ద్రావిడ ధాతువులలోని యాది ఇకార-ఉకారములు ఎకార-ఒకార ములుగా మాఱుచుండుట కలదు. కావునఁ దెలుఁగున 'చెల్లు' ధాతు వీ యర్థమున లేకున్నను నీ భాషలోని "చిలుకు" ధాతు వీ "చెలంకు" ధాతువుయొక్క రూపాంతరము లేదా మూల రూపమై యుండునని యూహింపవచ్చును. ధాన్యము మొద లగువాని విషయమున "చల్లుట" అను శబ్దమును బ్రయోగించి నను నీరు మొదలగువానిని చిలుకుట యనియే వ్యవహరిం తుము. కావున కన్నడమునందలి "చెలంకు" అను ధాతువును, ఆంధ్రమందలి చిలుకు శబ్దము నభిన్నములే కావచ్చును. దీని రూపాంతరమే యగు "చెల్లు" శబ్దమున కీ యర్థమునఁ బ్రయో గము లేదు. కాని "చెల్లాచెదరు" అను ప్రాచీనసమాసములో నీ "చెల్లు" శబ్దము కనఁబడుచున్న దనవచ్చును. చెల్లునట్లుగా —వికీర్ణమగునట్లుగా—చల్లఁబడునట్లుగా "చెదరుట" "చెల్లా చెదరు" అగును. ఇట్టి పదబంధము సమానార్థకములగు రెండు భిన్న పదముల కూడికచే నేర్పడిన ట్లూహింపఁ దగి యున్నది.

తుత్తునియలు :—తునియలు + తునియలు = తుత్తుని యలు—అని శబ్దరత్నాకరము. తుణ్ణు, తుని, తునక, తుమ్పర, తునుము, తునుగు, తునియ మొదలగు ననేకములగు శబ్దము లనుబట్టి చూడఁగా "తున్" అనునది మూలధాతువుగాఁ గనఁ బడుచున్నది. తమిళ కన్నడములలోఁ గూడ త: తుణి,

తుణికై (తె. తునక) తుండు, తుణై, క. తుణక, తుణుకు, తుణ్ణు, తున్తుల్, తున్తులు (spray, a drop) తువల్ (spray) అను రూపము లీ ధాతువునుండి యేర్పడినవే గలవు. తున్ +తునియ=తున్తునియ యయియుండును. పూర్వానునాసికము పరమందలి పరుష తకార సాహచర్యమున తకారముగా మాఱిపోయినది. తుత్తుమురు = తుమురు+తుమురు అనియే వైయాకరణులు దీనిని విభాగించినను ఇదియు తున్+తుమురు అని యొక ప్రాచీనరూపముయొక్కయు, నొక యర్వాచీన రూపముయొక్కయు కూడికచే నేర్పడినదే యని తలఁపవచ్చును. తుమురు అనఁగా "పొడి" యని శబ్దరత్నాకరకారుఁ డర్థమును జెప్పియున్నాఁడు. అర్థమునఁ గించిత్ భేద మున్నను, దీనికి "దుమ్ము" శబ్దముతో సాజాత్యసంబంధము కలదు. ఈ "తుమురు" శబ్దముయొక్క సహజరూపము లేదా ప్రాచీన రూపము "తుఱుము" అయి యుండునని యూహింపనగును. తుఱుము, తుఱుముట, తుఱుము (పీట) అను శబ్దములు ఖండించుట, పొడిపొడిగాఁ జేయుట యను నర్థమున నీ భాషలోఁ గలవు. తుఱుము శబ్దమే వర్ణవ్యత్యయముచే "తుమురు" అయి యుండును. "తుమురే" — తుఱుమై యుండరాదా ? యను ప్రశ్న కలుగక మానదు. కాని యితర ద్రావిడభాషలలోని శబ్దములతోఁ బోల్చి చూచినచో తుఱుమే మూలరూపమని పొడకట్టక మానదు. తమిళ కన్నడములఁగూడ తురుము, "దుమ్ము" శబ్దములతో నభిన్నములగు త. "తుమ్బు", కన్న

తుమ్బు, దుమ్బు రూపములు "ధూళి" (dust) అను నర్థము ననే గలవు. ఈ భాషలలో "తుటి" యను ధాతు వొకటి కనఁబడుచున్నది. దీనికి పాదాఘాతము, కాలితోఁ ద్రొక్కి ముక్కలు ముక్కలుగాఁ జేయుట యనియే యర్థము. కాలి తోఁ ద్రొక్కియున్నప్పుడు తెలుఁగులోని "త్రొక్కు" ధాతువు యొక్క మూలస్వరూప మేదో మనకు విశదమగు చున్నది. త్రొక్కు, తొక్కుకాఁగా ఇదియే ధాతువని తలంచు చున్నామేగాని ఇందలి "క్కు" అనునది ప్రత్యవయవము కాక మొదటి ధాతువునకుఁ జేర్పఁబడిన మఱియొక ధాతువు యొక్క లుప్తశేషంబగు రూప మని మనము గ్రహించుట లేదు. కావున "త్రొక్కు" ధాతువులోని రేఫము సహజ ముగా మూలధాతువునకుఁ జెందినదే యనియు, నది "తుఱి" లేదా "తొఱి, తొటి" అనుదానికి అగు–అక్కు చేర్చుట వలన తొఱుక్కు, తొఱుక్కు, త్రొక్కు అనియు, రేఫము లోపింపఁగా "తొక్కు" అయినదనియు తొఱుక్కు, త్రొక్కు అనియు, రేఫము లోపింపఁగా "తొక్కు" అయినదనియు గ్రహింపవలసి యున్నది. కన్నడమున "తుటి" యను ప్రాచీన రూపమున నగపడుచున్న (తుటి పాదసంఘట్టనే–శబ్దమణి దర్పణం) యీ ధాతువు తమిళమున "తుగై, తువై" యనియు, తెలుఁగున "త్రొక్కు" "తొక్కు" అను రూపములను బొంది యున్నను, మళయాళమున "తొఱై" యనియు, తుళుభాషలో "తుర్" అనియు "ఱ" కార రేఫము లంత

ముందుఁ గలదయి యున్నది. ఈ "తుటి" లేదా "తుటు" ధాతువు నుండియే "తుటుమ్బు" తుమ్బు, తుమ్బు, దుమ్ము మొదలగు రూపములు ధూళి అను నర్థమున నా యా భాషలలో బయలుదేరినవి. కన్నడమున "తొట్టుటి" అనురూపము భృశార్థమునఁ గలదు. మిక్కిలిగా త్రొక్కుట యని యర్థము. "తుటుమ్బు" శబ్దమే తుటుమ్మై, తుముటు అను రూపమును దాల్చినది. (ఉదా :—శణము ; సునామ్బు—సున్నము ; ఇరుమ్బు—ఇనుము, పామ్బు—పాము, మొ॥) పాదముతో త్రొక్కుట—పొడిపొడిగాఁ జేయుట యను నర్థము గలిగిన యీ ధాతువు తెలుఁగులో దేనితోనైనను—అనఁగా నితర సాధనములతోఁ గూడ పొడిపొడిగా లేక ముక్కలుగాఁ జేయుట అను నర్థమును సూచించునదైనది. కావుననే తుటుముకీట అనియు, దానితో ముక్కలుగాఁ జేయబడిన కొబ్బరి "కొబ్బరి తుటుము" అనియుఁ జెప్పుట తటస్థించినది. "తుటుము" ధాతువునుండియే "తునుము" ధాతు వేర్పడి యుండును. "తుట్-తున్‌టు — తును" అగును. తురుమ్బు శబ్దమునుండియే 'దుమ్ము' శబ్ద మేర్పడి యుండును. దీనిని బట్టి తుట్-తున్+తుటుము = తుత్తురుము ఐ, వర్ణవ్యత్యయముచే "తుత్తుమురు" అను శబ్ద మేర్పడినదని తలంపఁదగి యున్నది. ఇఁక దుమ్బు, దుమ్ము శబ్దములు ధూళి శబ్దభవములగుట కవకాశమున్నదా యను విషయము తజ్ఞులు పరిశీలింతురు గాక!

నుగాగమము :—ఇఁక నాగమరూప సంధికార్యము లలో నుగాగమ మొకటి. ఉదంతతద్ధర్మార్థక విశేషణముల కచ్చు పరమైనపుడు గలుగు నుగాగమమును గూర్చి, యది తద్ధర్మార్థక క్రియారూపములకు సంబంధించిన నకారమే గాని ప్రత్యేకముగా సంధిలో వచ్చినది కాదని యిదివరకే తెలుపఁ బడియున్నది. ఈ "చేయున్" అను ఉన్నతరూపము తమిళము నందలి "శెయ్యుం" అను ఉమ్మంతరూపమువలెనే ప్రథమ పురుషలో కాలభేదము, లింగభేదము లేక ప్రయోగింపఁబడు టనుబట్టి యీ రెండు నభిన్నములే యని తలంపఁదగియున్నది. కన్నడమునందుఁగూడ కాలాదిభేదమును సూచింపక అన్ని కాలములలోను, లింగములలోను బ్రయోగింపఁదగి, యతి ప్రాచీనరూపములుగా గ్రహింపఁబడుచుండిన "గెయుగుం" వంటి గుమంతరూపములు గొన్ని కలవు. కావున నీ ఉమ్మంత రూపము తద్ధర్మార్థకమైన, అనఁగా ధాత్వర్థమును మాత్రము సూచించు క్రియారూపముగాఁ బ్రాచీన ద్రావిడభాషలో నుండెనని తలంపనగును. ప్రాచీనతమిళమునందలి 'శెయ్యుందు' అను రూపమును, తెనుఁగునందలి "చేయుదు (ను), చేయుదు (వు)" మొదలగు ఉత్తమ మధ్యమ పురుషలలోని మూల రూపములు నీ గుమంత రూపమునకు సంబంధించినవై యుండును. అనఁగా "శెయ్యుందు" అనుదానినుండి యేర్పడిన తమిళమునందలి "శెయ్యుందు" అనుదానిని బోలి "చేయుం దును, చేయుందువు" అను రూపములుగూడఁ దెలుఁగున

నొకప్పు డుండియుండు ననుట. ఇట్లు భాషలో నతిప్రాచీన మని చెప్పఁదగిన శెయ్దుం—శెయ్యుం — చేయున్ — చేయును, అనునది క్రియారూపముగనే గాక విశేషణముగఁగూడ వ్యవహరింపఁబడినపుడు దీనిపై నజాది శబ్దము చేరఁగా చేయున్+అతఁడు = చేయునతఁడు అను రూప మేర్పడినది. తరువాతి కాలమున హలంతశబ్దములు పరమైనపుడు తుది నకారము జాఱిపోవుటచే "చేయు" అనునదే విశేషణరూపముగా గ్రహింపఁబడినది. అచ్చులు పరమైనపుడు వానితోఁ గలిసి కొన్ని పదబంధములందు భాషలో నిలిచియున్న నకారమును సాధించుటకై వైయాకరణులు నుగాగమ విధానమును చేయవలసిన వారైనారు.

షష్ఠీ సమాసమునం దుకారాంతఋకారాంత శబ్దముల కచ్చు పరమగునపుడుగూడ 'ను'గాగమం బగుచున్నది. రాజు+ఆజ్ఞ, శంభు+ఆనతి—అని యుండఁగా నడుమ నుగాగమము వచ్చి "రాజునాజ్ఞ, శంభునానతి" యైనదని ప్రక్రియ. ఈ నుగాగమ మొక్క ఉకారాంతములమీఁదను ఋకారాంతముల మీఁదను మాత్రమే వచ్చుచున్నది గాని తక్కిన వానిపైఁ గనఁబడదు. "రామ" వంటి అకారాంత శబ్దముల షష్ఠీవిభక్తి రూపము "రాముని" యని యగుచున్నది. రాముని+ఆజ్ఞ అని యుండఁగా, ఇకార మక్కరలేకయే సంబంధార్థము వ్యక్తమగు చుండుటచే "రామునాజ్ఞ" అను రూప మేర్పడును. లేదా ఇకారాకారములుగూడి ఆ అను

ధ్వనితో వ్యవహరింపబడి యుండును. దీని సాదృశ్యము చేతనే "రాజు" మొదలగు ఉకారాంత శబ్దములు నుగాగమమును గ్రహించుట తటస్థించినది. కేవలము స్థానబలము చేతనే పూర్వశబ్దము విశేషణ మగుటనుబట్టి, "రామునిబాణము"—అనుటకు బదులుగా "రాముబాణ" మన్నట్లే రాజు+అల్లుడు అని యుండఁగా రాజునల్లు డనియేగాక "రాజల్లుడు – గట్టు రాజల్లుడు" అను రూపములు గూడ భాషలో నేర్పడినవి. ముపర్ణాంత శబ్దములపై నీ "ను" గాగమ మంత విశేషముగా వాడుకలో నున్నట్లగపడదు. ఉదా:–'గోకుల మిల్లిలు దప్పకుండ' 'నిర్జరోత్తమ బింబం బొప్ప', 'రాకుమాఁగు మొగమందము'. 'గోకులము నిల్లు' అనునదంత వ్యవహారప్రచురమైన రూపముగాఁ గనఁబడదు: తెల్ల, నల్ల, వెల్ల మొదలగు శబ్దము లదంతగుణ వాచకములుగా గ్రహింపఁబడినను వీని మూలరూపములు తెల్, నల్, వెల్ మొదలగు హలంతశబ్దములే యైయున్నవి. వీనిపై అగు ధాతుజన్య క్రియావిశేషణ రూపంబగు "అన–అన" అనుదానిని జేర్చుటచే "తెల్లన, నల్లన, వెల్లన" అను రూపములేర్పడినవి. ఉదా: కన్న–తెల్లనె, నల్లనె, బెళ్లనె. వీనిపై మరల నౌపవిభక్తిక "ఇ" కారము చేర్చిన రూపములు తెల్లని, నల్లని అనునవి. వీనికంటె నర్వాచీనములు తెల్లన+తనము=తెల్లన్‌దనము–తెల్లందనము అయి యుండును. పువర్ణముపై పరుషము పరమైనపుడు రెండుపరుషముల నుచ్చ

రించుటలోఁ గల చిక్కును పోఁగొట్టుటకు నుగాగమము గలుగుచున్నది. పుంపులకువలెనే ఉదంత స్త్రీ సమంబులకు తనము శబ్దము పరమగునపుడు గలుగు నుగాగమముకూడ నుచ్చారణ సౌలభ్యముకొఱకై యేర్పడియుండును. సొగసు+తనము=సొగసుందనము.

తలంబ్రాలు, చిగురుంగైదువు—మొదలగు సమాసములు తలను (బోయు) ప్రాలు=తలంబ్రాలు అనియు, చిగురు కైదువు (గాఁగలవాఁడు) చిగురుఁ గైదువు—చిగురుంగైదువు అనియు నేర్పడినవి. ఈ సమాసములు భాషలో నర్వాచీనములై యుండును. తలంబ్రాలు అనుచోట అలుక్సమాసముగా గ్రహించిన సరిపడును. చిగురుఁగైదువు అనుచోట చిగురు+కైదువు అని యుండఁగా రెండవపదము పరుషాదియైనప్పుడు ప్రాచీనభాషలో దానికి ద్విత్వమో లేదా పూర్వమనునాసికమో గలుగుట సంప్రదాయముగా నున్నది గాన ననునాసికము గలిగియుండును. ఉదా: త. విళంగాయ్—తె. వెలక్కాయ.

సమాసములలో పూర్వోత్తరశబ్దముల నడుమ జరుగు సంధికార్యములను మఱికొన్నిటిని పరిశీలింతము. "చేత తోడ వలనల కిత్వంబు సమాసంబులందగు"—సమాసములలో చేత, తోడ, వలనలు పూర్వపదములైనపుడు వాని కిత్వము గలుగునని చెప్పఁబడినది. ఇక్కడ లక్షణకర్త "చేయి, తోడు, వలను" శబ్దములను గ్రహింపక "చేత, తోడ, వలన" లను

టచే విభక్తి ప్రత్యయమునుగా గ్రహింపఁబడుచుండిన "చేత, తోడ, వలన" శబ్దములను గ్రహించుటయే యాతని యుద్దేశమై యుండుననుటకు సందేహములేదు. దీనినిబట్టి ప్రమతాంతములగు తృతీయా , పంచమీ ప్రత్యయములకే అనఁగా నవి రాముని చేతన్, రామునివలనన్ అని ప్రాతిపదికములపైఁ జేరియున్నపుడే వీని కిత్వము రావలసియుండు నన్నమాట. ఈ "ఇ" కారము ఔపవిభక్తి కేకారము లేదా సంబంధార్థకేకారమే. ఇది ప్రత్యేకశబ్దములగు చేయి, వలను అనువానికిఁ జేర్పఁబడుట న్యాయ్యము గాని, కరణార్థకము అపాదానార్థకము నగు చేతన్, వలనన్ అనువానికిఁ జేర్పఁబడినదనుట యుక్తముగాఁ గనఁబడదు. అనఁగా నీ "ఇ" కారము విభక్తి ప్రత్యయములపైవచ్చిన దనుటకంటె "చేయి, తోడు, వలను" శబ్దములపై వచ్చినదనుటయే న్యాయ్యము. చేత, తోడ, వలన లిప్పుడు విభక్తిప్రత్యయములుగా గ్రహింపఁబడుచున్నను వాస్తవముగ నివి అన్నంతము లగు స్వతంత్రశబ్దములే. ప్రాచీనకాలమున (అనగా చేత, వలనలు విభక్త్యర్థమును సూచించుటకుఁ బదములపైఁ జేర్పఁబడని కాలమున) ప్రాతిపదికపైఁ జేర్పఁబడిన స్థలవాచకమగు "అల్" "అన్" శబ్దమే సప్తమ్యర్థమును సూచించునదై యుండఁగా మఱికొంతకాలమున కీ యన్నంత శబ్దములే తృతీయా పంచమ్యర్థములనుకూడ సూచింపవలసి వచ్చినపు డొక్క "అన్" శబ్దమే యిన్ని యర్థములను సూచించుటలో నా యా భావములు

సువ్యక్తము గాకపోవుచుండుటచేఁ గొంబోలు నాయర్థము లను వ్యక్తము చేయుటకుఁగా "చేయి, వలను" శబ్దములను సహాయముగఁ గొని, వీని నా ప్రాతిపదికలకుఁ జేర్చుట యేగాక, వీనిపై నా ప్రాచీన సప్తమ్యర్థకమగు "అన్" అనుదానిని గూడఁ జేర్చి చెప్పఁదొడంగిరి. "అది"శబ్దము నుండి సప్తమ్యర్థమున "దానన్" అను శబ్ద మేర్పడినది. "దానన్" అనఁగా "ఆ స్థలమున — దానియందు" – అని యర్థము. తరువాతికాలమున నిదియే కరణాపాదానార్థము లందుఁ గూడఁ బ్రయోగింపఁబడుట తటస్థింపఁగా, అనఁగా దానన్ – దానిసహాయమున, దానిమూలమున, దాని దగ్గర అను నర్థభేదమునుగూడ సూచింపఁదొడఁగినప్పుడు, "చేయి" ముఖ్య కరణార్థక మగుటచేతను, "తోడు" సహాయార్థక మగుటచేతను, "వలను" సమీపస్థలార్థక మగుటచేతను, కరణార్థ సహాయార్థా పాదానార్థములను సప్తమ్యర్థమునుండి వేఱుపఱచి వ్యక్తపఱచుటకై ప్రాదిపదికముల కీ శబ్దములఁ జేర్చుట తటస్థించి యుండును. వీనిని మాత్రమేగాక వీనిపై మరల "అన్" ప్రత్యయమునుగూడఁ జేర్పఁదొడగిరి. ఇట్లు అది + అన్ = దానన్ – కాఁగా దాని చేయి+అన్=దాని చేతన్, దానితోడన్, దానివలనన్ అను తృతీయా పంచ మ్యర్థక శబ్దము లేర్పడినవి. మఱియు చేయు, తోడు, వలనుల కిప్పటికిని భాషలో ప్రత్యేకప్రయోగము కలదు. నీ చేతి ప్రోపు అనియేగాక కేవలము "చేయి" శబ్దమునుండి "చేతి

దెబ్బ" అనుదానిని "కాలిప్పండు" అన్నట్లుగనే ప్రత్యేక ముగాఁ బ్రయోగించుచునే యున్నాము. "తోడ మాటాడ కునికి" అనుచో తోడ శబ్దమునకు విభక్తిప్రత్యయముగాఁ గాక వ్యస్తముగఁగూడ ప్రయోగము గలదనుట సుప్రసిద్ధమే. ఆ వలనికిఁ బోయి యని, వలను శబ్దమునకుఁగూడ ప్రత్యేక ప్రయోగము కలదు. సంబంధార్థకమగు నీ "ఇ" కారము ఔపవిభక్తిక ప్రత్యయములుగాఁ జెప్పఁబడిన "ఇ, టి, తి" ల లోని ఇకారమేగాని వేఱు గాదు. ఇవి యొక శబ్దమునకు మఱి యొక శబ్దమునకుఁ గల సంబంధమును సూచించునవై పూర్వ శబ్దమును విశేషణముగాఁ జేయుటకై చేర్పఁబడునవే గావున, విభక్త్యర్థములను సూచించు ప్రత్యయములపైఁ జేర్పఁబడె ననుటలో నర్థములేదు. కాని యిచ్చట విభక్తిప్రత్యయము లని తలంపఁబడుచుండినవి వాస్తవముగా ప్రత్యయములు గాక స్వతంత్రపదములే యగుటచే, వీనిపై మఱియొక శబ్దము చేర్పఁబడినపుడు వీని కా పదముతోడి సంబంధమును సూచిం చుటకుగా ఔపవిభక్తిక ఇకారమును జేర్చుట తటస్థించినది. నీ చేతి ప్రోపు – అనఁగా నీ హస్తమూలమునఁ గలుగు సహాయ మనియే వాస్తవార్థము. వానివలని నేరము – వాని వైపునకు సంబంధించిన నేరము (a mistake on his part). నోటిమాట, ఊరివారు, నేతిచెంబు మొదలగు పదములలో నగపడు నౌపవిభక్తిక ఇ కారాదులే సంబంధార్థకములై చేయి, తోడు మొదలగు శబ్దములపైఁగూడ గనపడుచున్నవి.

"నాయందలి" కరుణ అన్నప్పుడు 'అలి' గాగమమని చెప్పఁబడినదానిలోఁగూడ "సి" యౌపవిభక్తిక యికారమే పొడసూపుచున్నది. కాని ఇది యీ భాషలోని ప్రాచీన సంప్రదాయము నొకదానిని మాత్రము సూచించుచున్న దన వచ్చును. ప్రస్తుత మీ భాషలో సప్తమ్యర్థక ప్రత్యయముగా నున్న "అన్" అనునది "అల్" అను స్థలవాచక శబ్దము యొక్క రూపాంతరమే యని యిదివరకు సూచింపఁబడినది గదా. ఈ "అలి" గాగమములో నిప్పుడు "అన్" గా మాఱి పోయిన "అల్" అనుదానియొక్క సహజరూపము భాషలో నిలిచియుండుట తటస్థించినది. తెలుఁగులో "అల్" శబ్దము "అన్"గా మాఱిపోయినను కన్నడమున నిప్పటికి నిది "అల్లి" అను సప్తమ్యర్థక ప్రత్యయముగా నిలిచియే యున్నది. ఉదా: మరదల్లి, అవదల్లి మొదలైనవి. వానియందలి అనునప్పుడు వానియందు+అల్+ఇ—అని "అందు" అను స్థలవాచకశబ్దముపై మరల "అల్" అను ప్రాచీనరూపము సప్తమ్యర్థమునసే చేర్పఁబడిన పిదప దానిపై సంబంధార్థక 'ఇ' కారము చేర్పఁబడినది. తమిళమున "మరత్తినిల్" అన్నప్పుడు 'ఇల్' శబ్దముయొక్క రూపాంతరమే యగు "ఇన్" అనుదానిపై మరల సప్తమ్యర్థమున "ఇల్" చేర్పఁబడినట్లే, అనఁగా 'ఇన్' ఔపవిభక్తిక ప్రత్యయమును, 'ఇల్' సప్తమ్యర్థక ప్రత్యయము నైనట్లే తెలుఁగులో "అల్"యొక్క రూపాంతరమే యగు అన్—అందు అనునది సప్తమ్యర్థక ప్రత్యయమైన తరువాత

దానిపైఁ జేరిన "అల్" అను దాని కీ భాషలో ప్రచారము తగ్గిపోయి కొన్ని ప్రాచీనరూపములలో మాత్రమే కనఁబడి నప్పుడీ "అలి"అనున దొక ప్రత్యేకాగమముగా గ్రహింపఁ బడుట తటస్థించినది. "అలి" శబ్దస్వరూపమును మనము గుర్తింపఁ గలిగినప్పుడీ యాగమముయొక్క ప్రవృత్తి నిమిత్తము తెలియవచ్చుటచే నీ సూత్రముతో పనియే లేకపోవును. "అల్" అను సప్తమ్యర్థద్యోతక శబ్దము లేదా ప్రత్యయమీ భాషలో లోపించినను, ఈ "అలి" గాగమ రూపమున భాషలో క్వాచిత్కముగాఁ గనఁబడుచుండుటచే నిది యీ భాషయొక్క ప్రాచీనచరిత్రకు సంబంధించిన యొక చిహ్నముగా (Historic survival) దలంపఁబడదగి యున్నది. "అందు" శబ్దముపై వలెనే "ఇందు"అను దానిపైఁగూడ నీ యాగమము కలుగును—ఇందలి జనులు. ఎందు అనుదానికి వైకల్పికముగాఁ గలుగుచున్నది—ఎందలివారు, ఎందువారు. అందు మొదలగువానిపై, "అల్" అనునదేకాక "ఉల్" (=లో) కూడ ప్రాచీనకాలమునఁ జేర్పఁబడుచుండె ననుటకు "అందుల, ఇందుల" అని భారతాదులందును, శాసనములందును గల ప్రయోగములే నిదర్శనములు. అందు+ఉల్+అ. అల్ పై ఇ చేరినట్లే ఉల్ పై 'అ' అనునది విశేషణార్థకద్యోతకమై చేరి "అందుల" అయినది. "అలి"తోఁ గూడిన రూపముల కంటె ఉలతోఁ గూడిన రూపములు భాషలోఁ బ్రాచీనములుగాఁ గనఁబడుచున్నవి.

# ఆదేశ సంధి

## — గసడదవాదేశ సంధి —

ఇఁక గసడదవాదేశ సరళాదేశాది కార్యములు కొన్ని సందర్భములలోఁ గలుగుచున్నవి. ప్రథమమీఁది క, చ, ట, త, ప లు–గ, స, డ, ద, వ, లగుటయు, ద్రుతముపై వచ్చు పరుషములు సరళములగుటయు నక్షరసావర్ణ్యమునకు సంబంధించిన మార్పులే యని తలంపవలసి యున్నది. వాఁడు+కొట్టె అనునప్పుడు "కొట్టె" అను శబ్దము నాదియందున్న పరుష కకారము సంహితలో "వాఁడు" శబ్దముతోఁ జేర్చి పలుకఁబడినపుడు—అనఁగా "వాడు కొట్టె" అని యేకముగా నుచ్చరింపఁబడినపుడు కకారము పదమధ్యమున రెండచ్చుల నడుమనున్న పరుషధ్వని యైనది. ఆ కారణముచే, నఁగా పూర్వోత్తర స్థానములందు నిలిచిన యా నాదవర్ణముల సాహచర్య బలముచే దీనికి నించుక నాదత్వ మబ్బినది. స్వరముల నడుమనున్న పరుషాక్షరములను తేల్చి పలుకుట సహజమగుటంజేసి యవి తత్తత్ స్థానీయములగు నూష్మవర్ణములు (fricatives) గ నుచ్చరింపఁబడుచుండుట యీ భాషలలోని ప్రాచీనసంప్రదాయమున కనుగతంబుకూడ నై యున్నదన వచ్చును. ఏలయనఁగా నీ కారణముచేతనే గావలయు సామాన్యముగాఁ దమిళమున క, చ, ట, త, ప యను వర్గాది పరుషాక్షరములు స్వతంత్రముగఁ బదాదిని వచ్చినపుడు పరుష

వర్ణములుగనే పలుకఁబడుచుండియుఁ బదమధ్యమున వచ్చి నప్పుడు, ద్విత్వము నొందిన తప్ప, అవి కొంచెము మృదు త్వము నొంది తత్తత్స్థానీయములగు నూష్మవర్ణములుగ పలుకఁబడు చుండుట తటస్థించుచున్నది. ఇట్లూ భాషలో స్థానమునుబట్టి యేర్పడిన యీ యుచ్చారణభేదము పరుష ములను దేల్చి పలుకుట మూలముగా నేర్పడినదే యైనను, గాలక్రమమునఁ గొన్ని వర్ణములకు నాదత్వమునుగూడఁ గలిగించి సారళ్యము నాపాదించుటకుఁ గారణమై పరిణమిం చినది. వాస్తవముగా నివి కొంత సారళ్యము నొందినవే (soften) గాని యన్నియు సరళములైనవని చెప్పుటకు నవ కాశము లేదు. కావుననే యిది గ, స, డ, ద వాదేశమైనది గాని సరళాదేశము కాలేదు. "చ, ప" లు—"జ, బ" లుగాఁ గాక "స, వ" లుగాఁ బలుకఁ బడుటనుబట్టియే యిది కేవల సరళవర్ణముల యాదేశము కాదనియుఁ బదమధ్యమునందు గలుగు నుచ్చారణలాఘవమును బట్టి యేర్పడిన మార్పే యనియు నిశ్చయింపఁదగి యున్నది. తమిళమునం దీ ధ్వను లిట్లే పలుకఁబడుచుండుటయుఁ బై వాదమున కుపబలకం బగు చున్నది. ప్రాచీన భాషలో శవర్ణ సకారములే లేవు. కావు ననే తమిళమున చకారమే యొకప్పుడు పరుషముగను, సామా న్యముగాఁ దన్త్యస్థానీయమగు నూష్మముగనుగూడఁ బలుకఁ బడుచుండును. స్థానభేదమునుకూడ నక్కఱలేకయే ప్రాత లోని చకార ముచ్చారణమున శకార మగుచుండును.

"చెయ్‌దాళ్" (=చేసినది) శెయ్‌దాళ్ అని పలుకఁబడును. "చప్పై" అని వ్రాయఁబడిన శబ్దము "శ[1]ప్పై" అని పలుకఁబడును. అవాచ్యం — అవాచ్చియం, అవాశియం అగుచున్నది. ఇట్లే చంకం (సంఘం)—శంగం; పేచు—పేసు; పచి—పశి. ద్విత్వము కలిగినపుడు మాత్రము "చ" వర్ణముగనే పలుకఁబడుచున్నది. తొడర్చ్చి—"తొడర్చి" అనియే పలుకఁబడును. టకార అకారముల తరువాతను గూడ "చ" కారముగనే పలుకఁబడును. మాట్చ్చమై (excellence) "ముయర్చ్చి" (effort) అను శబ్దములలో చకారముగనే పలుకఁబడును. సకారము పదాదిని పరుష (పకార)ముగను, పదమధ్యమున నూష్మ[1]పకారముగనే వ్యవహారమునం దగపడుచున్నను (ఉదా: చప్పై అనునది—శప్పై అని పలుకఁబడుచున్నను) కొన్ని శబ్దములలో [1]పకారముగాక వకారమగుచున్నది. ఉదా: త. పాపం—పావం. ఇఁక 'క' కార "త" కారముల విషయమునఁగూడ నా భాషలో నిట్టి యుచ్చారణ భేదమే యగుపడుచున్నది. పదాదియం దివి పరుషాక్షరములుగనే పలుకఁబడుచున్నను, పదమధ్యమున నవి కొంత యూష్మత్వమును, లేదా సరళత్వమును, జెందుచున్నవి. "కణ్" అనునది పరుషాదిగఁ బలుకఁబడుచుండుట స్పష్టమే. "పకల్" అనునది "పక్హల్" (pachel) అను రీతిగనో లేదా "పగ్హల్" అనునట్లుగనో (paghel) పలుకఁబడుచున్నది. ఇది తెలుఁగున "పగలు" అనియే యైనది. "పకై"

అనునది "పహై"(pahei) అని యుచ్చరింపఁబడుచున్నది. తె-పగ. "తవ్వై" పరుషాదిగనే యుచ్చరింపఁబడుచుండ "పాతం" అని పరుష తకారముతో వ్రాయఁబడుచున్న శబ్దము "పాత్తాం" (patham) అని పలుకఁబడుచున్నది. ఇది వాస్తవముగా సంస్కృత "పాద" శబ్దమేయైనను, ఈభాష లోఁ గేవల సరళ "ద" కారముగఁ గాక యూష్మ తకార ముగఁ బలుకఁబడు చుండుట విశేషము. సంస్కృతములో "వ్యాఘ్రపాత్" అను దానిలో పదాంతమున పరుషమై నిలి చిన "త" కారము అజాది ప్రత్యయము పరమైనపుడు కేవల సరళమగుటచే "వ్యాఘ్రపాదా" మొదలగు రూపము లేర్పడు చుండెనే గాని, తకార మూష్మత్వము నొందుచుండుటలేదు. సంస్కృత సంబంధము విశేషముగాఁ గలిగిన తెలుఁగు భాషలో నీ పదమధ్య కకార తకారములు కేవల సరళములు గనే–అనగా పగలు, పగ, పాదము అనియే వ్యవహరింప బడుచుండినను, తమిళమున నిప్పటికి నవి "క్హా" "త్హా" అని యూష్మత్వముతోఁ గూడిన వానివలె పలుకఁబడుచుండుట సుప్రసిద్ధమే. కావున నీ యుచ్చారణ ప్రాచీనభాషాసంప్ర దాయసిద్ధ మనియు, నిట్లు పదాదిని పరుషములుగఁ బలుకఁ బడు వర్ణములే పదమధ్యమున నజ్మధ్యస్థములగుటచేఁ గొంత తేల్చి పలుకఁబడుచుఁ గాలక్రమమునను సంస్కృతభాషాసం సర్గమును బట్టియుఁ గేవల సరళములుగఁగూడ నుచ్చరింపఁ బడుచు వచ్చినవనియు, నీ కారణముచేతనే యాదికాలమున

సీభాషలలో నొక్క పరుషవర్ణములకు మాత్రమే లిపిచిహ్నము లేర్పడియుండె ననియు, నిప్పటికిని తమిళభాషలో నా ప్రాచీన సంప్రదాయమే నిలిచి యుండ, సంస్కృతభాషాసంసర్గప్రాబల్యముచే నాంధ్రకన్నడలిపుల యందు సరళవర్ణములకుఁగూడఁ బ్రత్యేకచిహ్నములు బయలుదేరిన వనియు నూహింపఁదగి యున్నది.

తమిళమునందును క, చ, ట, త, ప లు వర్గానునాసికములకంటెఁ బరమైనపుడు పదమధ్యమందలి వర్ణములవలెఁ దేల్చి పలుకఁబడుటగాక, కేవల సరళములుగనే పలుకఁబడుచున్నవి. ఉదా—"చఙ్కం"—అని వ్రాయఁబడిన శబ్దము "శఙ్గం" అనియు, మఞ్చళ్—మఞ్జళ్ అనియు, కణ్టమ్—కణ్డమ్—అనియు, చాన్తమ్—శాన్దమ్ అనియు, అమ్పు—అమ్బు అనియు నుచ్చరింపఁబడుచున్నవి. ఈ భాషలో పదాది నెప్పుడును సరళవర్ణ ముచ్చరింపఁబడకుండినట్లే పదమధ్యమున ద్విత్వవర్ణమున కేగాని పరుషోచ్చారణము లేదు. అనునాసికము తరువాత సరళవర్ణోచ్చారణమే గాని పరుషవర్ణోచ్చారణ మిటీవల గనఁబడదు. ఇంపు, కంపు, అంపు మొదలగు శబ్దములు కొన్ని తెలుఁగున కనఁబడుచున్నను నిట్టివి తమిళమున లేవనియే చెప్పఁదగును. ఇంపు—తెలుఁగులోనే ఇంబు, ఇమ్ము కూడ నైనది. కావున ననునాసికముపైఁ బరుషవర్ణోచ్చారణము గాని, పదాదిని సరళవర్ణోచ్చారణము గాని ప్రాచీన ద్రావిడ భాషాసంప్రదాయము కాదని చెప్పుట కవకాశ

మేర్పడుచున్నది. ఆ భాషలో స్థానమునుబట్టియే పరుష సరళ భేద మేర్పడుచుండుటంబట్టి వర్గప్రథమాక్షరము, చరమాక్షర మును మాత్రమే వర్ణమాలలోఁ జేరినవి.

ఇంతకు ననునాసికముపైఁ గలుగు సరళవర్ణోచ్చారణ మునకును, బదమధ్యమున నజ్మధ్యస్థం బగు పరుష వర్ణము యొక్క సరళోచ్చారణమునకును లేదా లఘుతరోచ్చారణ మునకును గొంత భేదమున్న దని మనము బాగుగా గుర్తింప వలసియున్నది. పకల్–పక్వాల్; పాతం–పాత్వాం; పేచు–పేశు; పాపం–పావం,–అని పదమధ్యస్థ పరుషముల నూష్మలుగనో, లఘుతరవర్ణములుగనో పలుకునట్టి ప్రాచీనసంప్రదాయమే యీ గసడదవాదేశసంధికి మూలమని చెప్పవచ్చును. ఇట్టి మార్పు దేశ్యశబ్దములలోఁ గలుగుటయే సహజము. తెలుఁ గుల మీఁది సాంస్కృతిక పరుషముల విషయమునఁ గలుగదని యిటీవలి నైయాకరణులు చెప్పిరి. కాని యట్టివి ప్రాచీన శాసనములలోను, భారతాదులలోను గనఁబడుచునే యున్నవి. అవి ప్రాచీనదేశీయ సంప్రదాయానుసారములే యగును. సంస్కృతవర్ణసమామ్నాయమున పరుషసరళభేదము పద మందలి యా యా వర్ణముల స్థానమునుబట్టి యేర్పడినదిగాక సహజమై యుండుటనుబట్టి పరుషాది శబ్దము సమాస మధ్య గతమైనంత మాత్రమున సరళముగా నుచ్చరింపఁబడుట తటస్థింపదు. "వాడు + కంసారి" అను శబ్దములు "వాఁడు గంసారి"యని యుచ్చరింపఁబడుచో నా సంస్కృతశబ్దస్వరూ

పము విషయమున సందేహము కలుగుట కవకాశము కలదు. కావుననే యీ దేశభాషాసంప్రదాయము సంస్కృతశబ్దము లపై కంతగాఁ బ్రాఁకలేదు. ద్రావిడభాషలకు సహజమై చిరకాలమునుండి వచ్చుచున్న యీ సంప్రదాయము, సహజ సంబంధము లేని సంస్కృతభాషాశబ్దముల కన్వయించుట కవకాశము లేదనియే వైయాకరణులును నిషేధించిరి. కాని వ్యవహారపరిపాటిని బట్టియు, ననేక శబ్దములు తత్సమములై భాషలో మిళితములై యుండుటనుబట్టియు నీ కార్యమున కవ్యవస్థ గలిగినది. కావుననే యీ యాదేశమునకు బహుళత్వము గలిగినది.

ఈ గసడదవాదేశము తెనుఁగున ప్రథమ మీఁదను, ద్వంద్వసమాసములోను మాత్రమే కనఁబడుచున్నది. అనఁగా నచ్చటమాత్రమే నిలిచి యున్నదనుట. ద్వంద్వసమాస ములో నున్నను వాస్తవముగాఁ బ్రథమమీఁదననియే ఫలి తార్థము. ఏల యనఁగా ద్వంద్వసమాసములోని తొలిపద మెల్లపుడును బ్రథమలోనే గదా యుండుట తటస్థించును. కావున వాస్తవముగా నీ రెంటికిని విశేషభేదము లేదనవచ్చును. విశేష మేమనఁగా రెండు భిన్నశబ్దములు కలసి యొక్క సమాసమైనపుడేగాక (ఉదా. కాలుసేతులు, తల్లిదండ్రులు, ఊరువల్లెలు మొద) కేవల సంహిత కలిగియున్న రెండు విడి పదము లుచ్చరింపఁబడినపుడు గూడ రెండవ పదమందలి యాదిమవర్ణ మూఁది పలుకవలసిన యావశ్యకత లేనప్పు

డద్దాని లఘుతరోచ్చారణము కారణముగా గసడదవాదేశము కలుగుచున్నది. కావుననే కళలైన క్రియలపైఁగూడఁ గలుగుచుండుట. రాదు+కదా= రాదుగదా. కళలు కాని క్రియలు ద్రుతాంతములు లేదా అనునాసికాంతములు అగుటచే నా సరళానునాసికమే తరువాతి పరుషమును సరళముగ మార్పఁ గలదు. ఇవిగాక మఱికొన్ని సందర్భములందుఁ గూడ నీ యాదేశము కలుగుచున్నదని మఱికొందఱు చెప్పి యున్నారు. మఱికొందఱు అందు కొన్నిటిని మాత్రమే యంగీకరించిరి.

"కాకుసంబోధనావ్యయకర్మధార
యంబుల నచేతనంబుల నగు వికల్ప
మన్నియె మును ముద్దరాజు రామన సులక్ష్య
ములు వినము కాకుసంబోధనలకు భర్గ."—తిమ్మకవి.

మొత్తమున నిది బహుళమే యనఁదగును. అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు అనునవి ద్రుతాంతములు గాక ప్రథమాంతములుగ గ్రహింపఁబడుటం జేసి యీ కార్యము జరుగుటలో చిక్కేమియు లేదు. తాను, నేను శబ్దములు ప్రాచీనకాలమున ప్రథమాంతములుగనే అనఁగా కళలుగనే గ్రహింపఁబడినవి. కావుననే "ఏను విడప డిగియెద" నను భారతాది ప్రయోగములు కొన్ని కనఁబడుచున్నవి. కాని యివి యనునాసికాంతము లగుటచే వీనిపై నిలిచిన పరుషములు వ్యవహారమున సరళము లగుచుండుటనుబట్టి తరువాతివారు వీనినిగూడ ద్రుతప్రకృతికముల క్రిందఁ జేర్పవలసినవారైనారు.

కళలపై వచ్చిన పరుషములు ద్రుతముపై వచ్చినపుడు సరళములైనట్లుగా సరళత్వమును బొందుటలేదు. పదాది పరుషములకంటె పదమధ్యవర్ణముల కుచ్చారణలోఁ బ్రాధాన్యము తగ్గుచుండును గావున, వానికంటె సులభోచ్చారణ కనువగునట్లుగా నివి మార్పు చెందినవి. అనఁగా నొక విధమగు నూష్మలు (fricatives) గా మాఱిన వన్నమాట. అట్లు మాఱినపిదప వీనిలోఁ గొన్ని కాలక్రమమున సరళవర్ణములే యగుట తటస్థించినది. కకారము పదమధ్యమున "క్హ" అని పలుకఁబడినదై పిదప "గ" కారమైనది (ఉదా: ఇఁక—ఇక్హ=ఇఘ—ఇహ, ఒకటి—ఒక్హటి—ఒహటి; ముఖము, మొఖ్హము — మొహము మొ॥) "చ" కారము "శ" వర్ణముగా బలుకఁబడి తెలుఁగులో "స" కారమైనది: "ట" కారమునకు సరియైన యూష్మవర్ణము లేకపోవుటచేఁగాబోలు మొదట "ట్హ" అని పలుకఁబడి తరువాత "డ" కారమైనది. "ప" కారము తేల్చి పలుకఁబడినపుడు దంత్యోష్ఠ్యమే యగు నంతస్థ వకారమైనది. ఇట్లు క, చ, ట, త, ప లు—గసడదవ లైనవి.

ఈ భేదమునుగూర్చి అనఁగా కళలపై పరుషములు గ స డ ద వ లగుట, ద్రుతప్రకృతికములపై సరళములగుట యను భేదమునుగూర్చి కాల్డ్వెల్ పండితుఁడు సువ్యక్తము చేసినట్లగపడదు. అనఁగా తెలుఁగులో గ, స, డ, ద, వ లగుటలోఁ గల విశేషమును వ్యక్తముచేయక ద్వంద్వసమాస

ములలో నీ ద్రావిడభాష లన్నిటిలోను గూడ నీ పరుషములు మృదుత్వమును జెందుననియు (soften), అట్లే తెలుఁగులో ద్రుతాంతములపై సరళములగు ననియుఁ జెప్పినాఁడు.* దీనిని బట్టి ద్వంద్వసమాసములలోఁ బదముపై నిలిచినపుడును, మిగిలిన చోటుల ద్రుతమునకుఁ బరమైనపుడును, పరుషాక్షరములకుఁ గలుగు మార్పొక్కటియే యని యాతఁడు తలంచి నట్లగపడుచున్నది. గ, డ, ద ల విషయము మాత్రమే గ్రహించి యాతఁడట్లు చెప్పియుండును. చ, ప, లు, స, వ లగుటనుగూర్చి యాతఁ డంతగా గమనించి నట్లగపడదు. చ, ప లు, జ, బ లు గాక, ద్వంద్వసమాసములోను గళలస్సైనను స, వ, లగుటనుబట్టి యా పరుషములలోఁ గలిగిన మార్పు (softening)—అనఁగా గొంత మార్దవమును బొందుట యని చెప్పిన చెప్పవచ్చునుగాని, ఈ softening అనుదానికి సరళవర్ణముగా మాఱుటయే యని యర్థము చెప్పి

* "All the Dravidian dialects agree in softening the initial surd of the second member of *Dvanda* compounds; but with respect to compounds in which words stand to one another in case relation, e. g. substantives of which the first is used adjectivally or to qualify the second, Telugu pursues a different course from Tamil. The rule of Telugu is that when words belonging to Druta class, including all infinitives are followed by any word commencing with a surd consonant, such consonant is to be converted (as in Dvanda Compounds) into its soft or sonant equivalent."

నఁగాని తక్కిన వర్ణములగు క, ట, త ల విషయములో దీని నన్వయించుటకు వీలులేదు. ఏల యనఁగా క, ట, త లు కళ లపై నిలిచినపుడును, ద్రుతముపై నిలిచినపుడును గూడ గ, డ, ద అను సరళములుగనే మారుచున్నట్లిప్పటి స్థితినిబట్టి కనఁబడుచునే యున్నదిగదా. దీనినిబట్టియే క, చ, ట, త, ప లు ద్వంద్వ సమాసములో వలెనే ద్రుతముపై సరళము లగుచున్నవని (Sonant equivalents) చెప్పినాఁడు. కాని యీ రెండు సందర్భములందుఁ గల భేదము నాతఁడు వివ రింపఁదలఁచిన ట్లగపడదు.

పైని కాల్డ్వెల్ పండితుఁడు చెప్పిన వాక్యములో మఱి యొక విషయముకూడ మనము గమనింపవలసి యున్నది. ద్వంద్వసమాసములలోఁ దక్క తక్కిన తత్పురుషాది సమాస ములలో నుత్తరపదము పరుషాది యైనపుడు కలుగుమార్పుల విషయమునఁ దెలుఁగు తమిళమునుండి వేఱు మార్గమును బట్టినదని తెలిపియున్నాఁడు. యత్కించి ద్భేద మున్న మాట వాస్తవమే. కాని పరిశీలించినచో నివి యవలం బించిన ప్రధానపద్ధతి (Principle) యందు మాత్రము సాదృ శ్యము కలదని తెలియకపోదు. ఏల యనఁగాఁ దమిళమున విభక్తి సమాసములలోను, పూర్వపదము విశేషణ మైనపు డును, నుత్తరపదాది యందలి పరుషము ద్విత్వమును బొందును గాని ద్వంద్వసమాసములందువలె మృదుత్వమును బొందుటలేదు. పులి+తోల్ అనునది "పులిత్తోల్" అగును

గాని "పులిదోల్" అని మాత్రముకాదు. తెలుఁగునఁగూడ ద్విత్వము లేకున్నను సరళాదేశము మాత్రము కలుగుటలేదు. ద్వంద్వమునను ప్రథమపైని పరుషములు కొంత మృదుత్వమును బొందుట, పూర్వపదము విశేషణమై యుత్తరపదము ప్రధానమైనపు డవి పరుషములుగనే యుండుట యను నవి యీ రెండు భాషలకును సమానమే. విశేషణసమాసములలోఁ బరుషము ద్విత్వమును బొందుటమాత్రము తెలుఁగున లేదు. ద్వంద్వమున తల్లి+తండ్రి="తల్లిదండ్రులు" కాఁగా, తల్లి (యొక్క) పాలు అను షష్ఠీ సమాసమున తల్లివాలు లేదా తల్లిబాలు అని కాక "తల్లిపాలు" అని పరుషస్వరూపమే నిలిచినది. అనఁగాఁ దమిళమున ద్విత్వమువలనఁ గలిగిన ఫలితమే యిచ్చట పరుషాక్షరము మాఱిపోకుండుటవలనఁ గలిగిన దన్నమాట. అట్లే పులి+తోలు="పులితోలు" అనియే గాని "పులిదోలు" కాలేదు.

కన్నడభాషలో పదవిధియందు క త ప లు, గ ద బ లగుచున్నవి. కాని యచ్చటను నీ కార్యము బహుళమే.

"ఇరె వర్గప్రథమంగళ్
పరదొళ్ చటవర్గముఱెయె, తమ్మ తృతీయా-
క్షరమక్కుం పదవిధియొళ్
పరిహరిసల్బారదల్లి బహుళస్థితియం."

(శబ్దమణిదర్పణం 65.)

చ ట వర్గములు తక్క తక్కిన వర్గముల ప్రథమాక్షరములు పదవిధియందు అనఁగా సమాస విధియందు బహుళముగా తృతీయాక్షరములగును.

ఉదా :—పటిగన్నడం, గతెగోసాడు, బాఁయ్‌దెఱె, కణ్బొలనాగె.

ఈ గ, ద, బా దేశ మీ భాషలోఁగూడ "తలెకట్టు, బెసెకోల్, ఏడుపంది" మొదలగు చోటులఁ గల్గుటలేదు. రేఫపూర్వక మయినపుడు కూడ గదబాదేశము రాదు.— "వర్గప్రథమానాం తృతీయా సమాసోత్తరపదాదౌ. నాదిష్ట రేఫాత్ చటవర్గయోశ్చ." ఉదా:— మాఱు+కొరల్ = మార్కొరల్: మాఱు+తలె=మార్తలె; మార్ + పడె = మార్పడె; కడుచాగి; ఉరచల్లి; పొసటొప్పిగె, మాణిక టెక్కె. (కర్ణాటభాషాభూషణం—సం. 28, 29, 30) కాని పకారము వకారమగుటకూడఁ గలదు.

"స్వరయరలేభ్యో బహుళం వః పవర్గస్య."

(క. భా. భూ—సంధి 31)

విశేషమేమనఁగా నాంధ్రమునందువలె నొక పకారమే గాక యీ భాషలో "ప" వర్గంబంతయు బహుళముగ నైనను "వ" కారముగ మాఱుచున్నది. ఉదా :—పొస+పెసర్ =పొసవెసర్ ; ఎళ+బిదిర్ =ఎళవిదిర్ ; కల్ + బాళె= కల్వాళె ; పుల్ + మనె=పుల్‌వనె ; నీర్ + పావు=నీర్వావు.

బహుళగ్రహణముచే "నడుబెను, కెమ్ముగిల్" మొదలగు చోటుల నాదేశము రాలేదు. ఇట్టి వీ ద్రావిడభాషలో బహుళముగనే గలుగుచున్నను "తల్లిదండ్రులు" మొదలగు రూపములవలె సంస్కృతమందు "మాతాబితరౌ" "పాణిబాదం" "తత్ భలం" మొదలగు రూపములే యేర్పడుట కవకాశము లేదు. గావున నిది యీ భాషలలోని సహజసంప్రదాయములలోఁ గల భేదమునే సూచించుచున్న దనవచ్చును.

సరళాదేశసంధి :—అనునాసిక మంతమందు లేని శబ్దములపై అనఁగాఁ గళలపైఁ బరుషాక్షరములు బహుళముగా 'గసడదవ' లగుచుండ ననునాసికాంత శబ్దములపై వచ్చు పరుషములు సరళంబగు ననునాసిక ధ్వనితోఁడి సాంగత్య బలమువలన నిత్యముగా సరళవర్ణము లగుచున్నవి. పూచెను + కలువలు = పూచెను గలువలు అని యుండఁగాఁ దుదినున్న నుకారమునకు బిందు సంశ్లేషములు విభాష నగునని సూత్రకారుఁడు తెలుపుచున్నాఁడు. అనఁగా "పూచెను గలువలు" "పూఁచెఁగలువలు" "పూచెంగలువలు" "పూచెన్గలువలు" అను రూపములుకూడ నీ భాషలో నున్నవనుట. "పూచెను" అను నుత్వవిశిష్టరూపమే యిప్పుడు భాషలోఁ బ్రసిద్ధమై యుండుటచే, దీనినే తొలి రూపముగా గ్రహించి దీనిలోని తుది యుకారము లోపించుటచే సంశ్లేషము కలుగుచున్న దని వైయాకరణులు తలంచుట సంభవించినది. కాని యీ భాషలలో నజంతరూపమే యర్వాచీనరూపమై యుండుననుటకుఁ

దగిన నిదర్శనము లిదివరకే చూపఁబడినవి. కావున 'పూచెన్' అను హలంతశబ్దముపై "కలువలు" అను శబ్దము నిలిచి నపుడు, ఏ సూత్రవిధానము నక్కఱలేకయే నకార కకారము లకు సంశ్లేషము గలిగి "పూచెన్గలువలు" అనురూపము సహజముగనే యేర్పడుచున్నది. ఈ రూపముకూడ వ్యవహారపరిపాటిని బట్టి చూచినను భాషాసంప్రదాయమునుబట్టి చూచినను స్థిరపడు నవకాశ మగపడదు. నకారము వర్గానునాసికముగ మాఱి "పూచెఙ్గలువలు" అనురూపమే సిద్ధమై యుండుట సహజము. తమిళమున సాధారణముగా వర్గానునాసికమే వ్రాయఁబడుచుండును. "చెన్(o)గలువ" అను శబ్దముచ్చారణలో "చెఙ్గలువ" యనియే వ్యవహరింపఁ బడుట సర్వవిదితమే. సంస్కృతమున హల్ పరమైనపుడు పదాంత మకారము మాత్రమే యనుస్వార మగుచున్నది. ప్రాకృతాదులందు వలెనే యీ భాషలోఁగూడ వర్గాను నాసికము లనుస్వారములగుట తటస్థించి యుండును. ఇట్లు "పూచెఙ్గలువలు" "పూచెంగలువలు" ఐనది. అనునాసిక స్థానీయమగు నీ యనుస్వార మూఁదఁబడని యప్పు డా స్థితిని దెలుపుటకై యర్ధబిందు వ్యవహార మాచరణలోనికి వచ్చి యుండును. ఇప్పటికిని తమిళమునందును, తెలుఁగున వ్రాయబడిన వెనుకటి తాటాకు వ్రాతప్రతులయందును "పూచెఙ్గలువలు" "వాణ్డు—వీణ్డు—పోణ్డు" అను రీతిని వర్గాను నాసికములతోఁ గూడిన రూపములే విశేషముగాఁ గానవచ్చు

చున్నవి. కావుననే యనుస్వారముతోఁగూడిన రూపము లీ భాషలో నర్వాచీనములుగాఁ బరిగణింపఁదగియున్నవి. దీనిని బట్టి ద్రావిడభాషాసంప్రదాయసిద్ధమైన రూపము "ప్రాఙ్జ లువలు" అనునది మాత్రమే యని గ్రహింపఁదగును.

సంస్కృతమునందును పూర్వపదాంతమందలి యను నాసికము పరుషవర్ణము పరమైనపుడు తద్వర్గానునాసికముగా మాఱుట కలదు. ఉదా: "త్వమ్ + కరోషి = త్వఙ్కరోషి, తాన్ + ఛినత్తి = తాంశ్ఛినత్తి, చక్రిన్ + త్రాకసే = చక్రిఁస్త్రాకసే. కాని ద్రావిడభాషలోవలె పూర్వానునాసికసాహచర్యముచే నిచ్చటి పరుషములు సరళములు కాలేదు.

ఆంధ్రభాషలో నిట్లు ద్రుతముపై నిలిచిన పరుషములు సరళము లగుటయేగాక, యా ద్రుతముపై సరళములు నిలిచి నచో ద్రుతమునకే లోపము కలుగుచున్నది. ద్రుతముపై సరళము నిలిచిననుగూడ పూర్వద్రుతము పరవర్ణముయొక్క వర్గానునాసికముగా మాఱుటయే వాస్తవముగా జరుగవలసిన మార్పు. కావున వచ్చెన్ + గోవులు = అనునది "వచ్చెఙ్గోవు" లనియై "వచ్చెఙ్గోవు" లని యగును. "ప్రాచెంగలువలు" అను దానియందు వలెనే బిందువు వచ్చి "వచ్చెంగోవులు" "పాడెం గంధర్వుఁడు" అనియుఁ గావచ్చును. అనునాసిక మాది పలుకఁబడని యప్పుడు పరమందు నిలిచినది మాదేశ సరళమైనచో తొలుత నిది పరుషమే యని సూచింపవలసిన యావశ్యకత కలదు గావున నచ్చటి యనునాసికస్థానమున వర్ణ

బిందువు నిలుపుట యావశ్యకమైనది. సరళస్థిర వర్ణములు పరమైనపుడు ద్రుతము లోపించినను వాని స్వరూపమును గుఱించి సందేహించు నావశ్యకత యుండదు. కావుననే సరళ స్థిరంబులు పరమగునపుడు ద్రుతలోపమే సిద్ధించునని చెప్పఁబడి యుండును. అనఁగా ననునాసికస్థానీయమగు ననుస్వారము పలుకఁబడకపోవుట ఆదేశసరళ, సహజసరళముల విషయమున సమానమే యైనను వాని భేదమును సూచించుటకై క్రమముగా నా స్థానమున నర్ధబిందులోపము లిటీవలి వారిచే గ్రహింపఁబడియుండునని తలంపవలసియున్నది.

వర్గయుక్సరళములు పరమైనపుడే ఒకానొకచో ద్రుతమునకు బిందువు గలుగునని చెప్పఁబడినను (బాల. వ్యా. 19 సంధి) సరళములు పరమైనపుడుగూడ బిందువు గలుగుచునే యున్నది. పూచెంగలువలు అను రూపము కలుగఁగా, "పాడెం గంధర్వుడు" "వచ్చెం ధాత్రీపతి" యని మాత్రమేల కూడదు. సంశ్లిష్టరూపమగు పాడెన్గంధర్వుఁడు అను రూపమే, "పాడె జ్గంధర్వుఁడు" అయి "పాడెం గంధర్వుఁడు" అని యయ్యె ననుటలో చిక్కేమియు లేదు. కావుననే యట్టి రూపములును గానవచ్చుచునే యున్నవి. *వ్యవహారమును

* తెల్లమిఁగ గజడదబలును, పొల్లు నకారంబులోడఁ బొదలినయెడలం
బొల్లులై నిల్చు నొకొకచోఁ, జెల్లును నెఱసున్నలగుచు శ్రీగౌరీశా.

అని తిమ్మకవి నెఱసున్నలుగూడ నగునని చెప్పియే యున్నాఁడు. ఇందు కీ యుదాహరణములఁ జూపినాఁడు. "పుణ్యాచార భీమాంబకున్ గారాపైన తనూజు" అని పొల్లు నిచ్చుటకును,

బట్టి చూడఁగా వర్గానునాసికముతోఁ గూడిన రూపమునకే ప్రాచుర్యము గలదనియు ననుస్వారసహితరూప మర్వాచీనమనియు తోఁపక పోదు.

ప్రాచీనశాసనాదులలోని వ్రాఁతనుబట్టి చూడఁగా నీ యనుస్వారములు, పూర్ణార్ధానుస్వారములు రెండును మిగుల నర్వాచీనకాలమున వ్యవహారములోనికి వచ్చినవనియు, నిప్పుడు బిందుసహితములగు శబ్దము లనేకములు ప్రాచీనకాలమున వర్గానునాసికములతోఁ గూడియే యున్నవనియుఁ దెలియవచ్చుచున్నది. "ప్రాచీనాంధ్ర శాసనములను బరీక్షించినచో, అనుస్వారము అరుదుగను, అనునాసికములు బహుళముగను గానవగును. పూర్వకాలపు తెలుఁగు పదములయందలి హల్రూపములైన యనునాసికములే నేఁటి తెలుఁగు పదములలో ననుస్వారములుగ మాఱెనని తలంపవచ్చును." (ప్రాచీనాంధ్ర భాషాస్వరూపము - రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక.)

ఉదా: దఙ్కులపూణ్డి, జరిపిఞ్చువారు, మణ్డలికున్డు, నన్దగిరి, సమ్పన్నుణ్డు.

కొంతకాలమున కీ భాషలో ననునాసిక స్థానమున సంస్కృత సంప్రదాయానుసారముగా ననుస్వారము వచ్చి

1. "తుంగ మదువుఁ జేలఁగుచు, తంగమునకు మిగిలి యడవి దరికొను కొచ్చిచ్చుం గడచి యచటి బలములు" — ద్రోణపర్వము.
2. "అంజేదవు గాక వను చెం, తంజేరఁగ నీక యొంత తగ్గిన మిరియాలుం జొన్నల సరిగా వే" — హరివంశము.
3. "చండాంశుప్రభ చిక్కె......నీకుం డక్కెంగా" — కవులచన్ద్రము.

నది. కావుననే యిది తొలుత నా యనునాసికస్థానమున నొకబొట్టురూపమునను బిం దురూపమునను వ్రాయఁబడుచుం డెడిది:— పట్టమ్ము—పట్టంబు, పట్టబు. ఈ బిందువు నా యక్షర మునకుఁ బూర్వమున వ్రాయు నాచారము సుమారు క్రీస్తు శకము 12, 13 శతాబ్దముల ప్రాంతమున వచ్చియుండును. ఇప్పుడు దీర్ఘముపై నరసున్న గలిగిన కొన్ని పదములను ప్రాచీనకవులు నన్ని చోడాదులు నిండు సున్నతోడనే ప్రయోగించి యున్నారు. ఉదా:—

"పింగు నపార సత్వగుణ విస్ఫురణం బరమేశ్వరోరు
వామాంగమునందు"

కొన్ని ప్రాచీన వ్రాతప్రతులలో ననుస్వార మూఁది పలుకఁబడవలసిన చోటుల దాని తరువాతివర్ణమును ద్విత్వము కలదానినిగాఁ జేసి వ్రాయుటయు నది ఊఁది పలుకఁబడని చోట ద్విత్వము లేక వ్రాయుటయు నాచారంబై యున్న ట్లగపడుచున్నది.

క. రయమున ద్రిమ్మఁగుడు గాలము
క్రియ నెవ్వండు కంఠబిలము క్రిందికి జనక
గ్నియుం బోలె లోదహించ్చును
భయరహితా! వాని నెఱుంగు బ్రాహ్మణకులుగాన్.

ఇటీవల నూఁదఁబడని యనుస్వారస్థానమున నర్ధాను స్వారముతోఁగూడిన రూపము బయలుదేరియుండునని తలంప

నగును. అవసానంబునందు ద్రుతస్వరంబునకేని లోపంబు బహుళముగా నగుట, కొన్ని యెడల ద్రుతంబు మీఁద నకారంబు గానంబడుట యనునవి యుచ్చారణ మందలి లఘుత్వాలఘుత్వములను బట్టియు, పద్యములయందలి గణ నియమముల ననుసరించియు నేర్పడి యుండవచ్చును. అదియు నుంగాక అనునది సముచ్చయార్థక "ఉన్" అను దానిపై మరల "ఉన్" చేరుటచే నేర్పడియుండును.

అఁట, ఇఁక, చుఁడు శబ్దముల తొలిహ్రస్వంబుమీఁది ఖండ బిందువు అంట, ఇంక, చుండు—(చూడుండు) అనువాని లోని సున్న మీఁది పలుకకపోవుటచే నేర్పడినది అంట, చుండు అనునవి వాక్యాంతమున వచ్చునవగుటచే వానిపై స్వరమూఁదక సున్న పలుకుబడి యంతరించియుండును. ఇంక అనునది వాక్యాదినే వచ్చినను అర్థసందర్భమునుబట్టి ప్రాధాన్యము తగ్గినపుడు సున్న ఊఁదదు. అప్పుడు "ఇఁక" ఏర్పడును. ఉదా: ఇఁకె వెళ్లుదుమా; ఇంకా కొంతసేపుండవలె. లేదా వ్యవహారమున "ఇహ" అనురూప మేర్పడినపుడు బిందువునకు ప్రసక్తియే లేదుగదా. నుడి తొలి హ్రస్వంబు మీఁద నిండుసున్నయే గాని యరసున్న గానరాకుండుటయు దీర్ఘము మీఁది ద్రుతము నిండుసున్న గాకుండుటయు నీ మొదలగునవి యీ శబ్దమందలి స్వరమునకు (accent) సంబంధించిన విషయములుగాఁ గనఁబడుచున్నవి. సామాన్యముగా నీ భాషలో స్వరము ప్రతిశబ్దముయొక్క తొలి

యచ్చుపై నుండుటచే నది యూఁది పలుకఁబడుచుండును. కణ్+దోయి=కందోయి, చెందొవ, కెందమ్మి మొదలగు సందర్భములలో కన్ను, చెన్ను, కెన్ మొదలగు తొలిపదములు తరువాతి పదముతోఁ గలిసినపుడు తొలిపదములో మొదటనున్న స్వరమునకును, రెండవపదము తొలివర్ణము మీఁదనున్న స్వరమునకును నడుమనున్న "న్" లేదా అను స్వార ముచ్చారణమునఁ గొంత వ్యవధానము కల్పించుచున్నది. అట్టి యేకమాత్రా వ్యవధానమైనను లేక యే స్వరములతోఁ గూడిన రెండు వర్ణముల నొకదాని వెంబడి మఱియొక దాని నుచ్చరించుట సులభసాధ్యముకాదు. ద్రుతముగాని, సున్నగాని లోపించినచో నట్టి వ్యవధానము పోయి యుచ్చారణ కష్టతర మగును. అట్టిచో నుడి తొలి హ్రస్వముపైని గల యనునాసికము పలుకఁబడకుండుట సంభవింపదు. అనఁగా నడుసున్న కాదనుట. దీర్ఘముమీఁది యనునాసికము లేదా తత్ స్థానీయమగు సున్న యుచ్చారణ వేగమున లోపించినను దీర్ఘము సహజముగ రెండుమాత్రలు కలదగుటచే నుచ్చారణమున స్వరమూలకమగు చిక్కేమియుఁ గలుగదు. కావుననే "మూండు–మూఁడు, వాండు–వాఁడు, వీంగు–వీఁగు" మొదలగు రూపము లేర్పడినవి. తాను–తాన్ + చదివె = తాను జదివె, తాఁజదివె; నేను–నేన్ + చెప్పితి = నేను జెప్పితి, నేఁ జెప్పితి – అని యగునేగాని, తాను, నేను శబ్దములపై సంశ్లేషము రాదని "తాఙ్జదివె" "నేఙ్జెప్పితి" యను

రూపములు వైయ్యాకరణులచే నిషేధింపఁబడినవి. తాన్, నేన్, శబ్దములు సహజములుగ నకారాంతములే యగుటచే వీనికిఁ బరుషాది శబ్దములు పరమైనపుడు; వీని సాహచర్యమునఁ బరుషము సరళము కాఁగా, నవి రెండును గలసి తాన్జదివె, నేన్జెప్పితి నను రూపములు తొలుత భాషలో నేర్పడి యుండనే లేదనుటకుఁ గారణ మగపడదు. దీర్ఘము మీఁది యఱసున్న నిండుసున్న కాదను మతము బయలు దేరి "తాంజదివె" "నేంజెప్పితి" అను రూపములును నిషేధింపఁబడుటకుఁ గారణ మీ భాషలో శిష్టవాఙ్మయ మేర్పడి, దానికి లక్షణము చెప్పఁబడిన కాలమున కా రూపము లంతరించుటయే యని తలంపనగును. సామాన్యముగా నీ భాషలో ద్రుతస్థానమున వచ్చిన యనునాసికమో, యనుస్వారమో తేల్చి పలుకఁబడుటచేతనే గదా దాని స్థానమున నఱసున్న వచ్చుచున్నది. తాన్, నేన్ శబ్దముల తుది ననునాసిక మగపడుచునే యున్నది. ఇది తరువాత నిలిచిన సరళవర్ణముతోఁ గూడక యనుస్వారముగఁ గూడ మాఱకయే, "తాఁజదివె" నను రూపములోని యఱసున్న యేర్పడినదనుట కవకాశమే లేదుగదా. కావున దీనికిఁ బూర్వములగు రూపములు రెండును భాషలోఁ జిరకాలము క్రిందటనే యంతరించుటచే వీరీ నియమము చేసిరని చెప్పవలసియున్నది. తాము (తామ్) మేము (ఏమ్—యమ్) శబ్దములలోని "మ" కారమువలె నిదియుఁ బ్రథమా విభక్తికి సంబంధించిన దని తలంపఁబడి

యుండినచో సరళాదేశమే వచ్చుట కవకాశముండదు. సరళాదేశమునకు బదులుగా గ స డ ద వాదేశము రావలసి యుండును. అప్పు డర్ధానుస్వారమునకును బ్రసక్తియే లేకుండును. ఈ "తాను, నేను" శబ్దములును, అందు, ఇందు, ఎందు శబ్దములవలెనే * ప్రాచీనకాలమున కళలుగనే యుండి, ప్రాచీనపాఠములను పరిశీలింపని తరువాతి పరిష్కర్తలచే ద్రుతప్రకృతికములుగ గ్రహింపఁబడుటం జేసి సరళాదేశాది కార్యములకు లోనై యుండును. కూచిమంచి తిమ్మకవి

---

* "అచ్చు భారతములో 'ఎందుఁ బోయితివి' అని 'ఎందు'కు పరమందు అరసున్న, దానికి పరమందు గజడదబాదేశములుం కనబడుచున్నవి. కాని వ్రాతప్రతులలో 'అందు, ఇందు, ఎందు' కళలుగాను, వాటికి పరమందున్న క చ ట త ప లకు గసడదవాదేశము రావలసినట్లుగాను పాఠములు కనబడుచున్నవి. శాసనములలో కూడా తాటాకు పుస్తకములలో ఉన్నట్టే మూలమందు పాఠములున్నా, పరిష్కృతపాఠములు అచ్చుపుస్తకములలోని తప్పుపాఠముల ననుసరిస్తున్నవి. యుద్ధమల్లుని శాసనమందు 'ఇందు ప్రత్యక్షమై' అని మూలమందుండగా 'ఇందుఁ బ్రత్యక్షమై' అని పంతులవారు దిద్దినారు. కొణిదెన శాసనమందు "తమ్ముండు ప్రతాపమున" అని మూలమందున్నా, 'తమ్ముఁడు ప్రతాపమున' అని పరిష్కృతపాఠమందున్నవి. అచ్చు భారతములో కూడ అక్కడక్కడ ప్రాచీనసంప్రదాయము కనబడుతున్నది. — (చూ. విరాట. 111-28 ఆనందముద్రణము — ఉద్వేజనమున్ వ్రాఁకి). కొణిదెన శాసనమందు మూలములో ఆదేశములు యథావిధిగా ఉన్నవి. 'ముల్లోకవిభుండు సక్రి' అని కృతికర్త వ్రాసినది తప్పుగా నిరాకరించి 'ముల్లోకవిభుండు చక్రి' అని పంతులవారు దిద్దినారు."—రాజరాజు కాలమందున్న తెలుగుభాష,—రా. రా. న. ప. సంచిక, పేజి 126.

మొదలగు లాక్షణికు లీ విషయమును గూర్చి వెనుకఁ దడ
వియే యున్నారు.

"విదితముగఁ దాను నేనను
పదములు ప్రథమలయి నాంత పదములగుటఁ దాఁ
జదివెను నేఁ జదివితి నని
వదలక యిరుదెఱఁగు బలుకవచ్చు మహేశా."

అని చెప్పి ఏను శబ్దముపై సరళాదేశము రానియందు
లకు భారతోద్యోగపర్వ ద్వితీయాశ్వాసములోని యీ క్రింది
పద్యమును లక్ష్యముగా సర్వలక్షణ సారసంగ్రహమునం
దాతఁడు చూపెను.

"ఏ చెప్పిన పెద్దలు ద్రో
ణాచార్యులు మొదలుగాఁగ ననికొల్లనివా
రై చన్నవారలం గాని
యే చక్కంబెట్టువాఁడ నే పాండవులన్."

కాని యర్వాచీన వైయాకరణులు "ఏను" శబ్దము
ద్రుతాంతంబను తలంపుగలవారగుటచే ప్రాసలోని "చ"
కారము పరుషత్వమును నిలుపుటకుగాఁ బూర్వమందలి "ఏ"
కారమును ప్రశ్నార్థక 'ఏ'కారముగాఁ జేసి, రెండవ 'ఏ'కార
మునకు యతిప్రాసముల చిక్కు దగులదు గావున, నది ద్రుతాంత
మగు నుత్తమపురుష సర్వనామ మనియుఁ జెప్పి, తమ
వాదమును నిలువఁబెట్టుకొనిరి. ఇట్లే మఱియొక సందర్భమునఁ

గూడఁ జేసిరి. భార. శల్య. 2 ఆశ్వాసమున నీ క్రింద పద్యమున వ్రాతప్రతులలోని పాఠమునుబట్టి "ఏను" శబ్దము ప్రథమాంతముగా — లేదా కళగా గ్రహింపఁబడిన దనుట కవకాశ మేర్పడుచున్నది.

"క. కవదొనలును గాండీవము
నవల నిడం బనుపు ముందఱ అరదము డిగు మే
ను విదప డిగియెద శుభకర
మవు నివ్విధ మిట్లు సేయుమనుఁడు నతండున్."

ఇచ్చట "ముందఱ అరదము డిగు మేను విదప డిగియెద" నని కృష్ణుఁ డర్జునునితోఁ జెప్పిన సందర్భమున, "ఏను" శబ్దముపై "ప" కారమునకు "వ" కారాదేశము వచ్చుటను బట్టి "ఏను" అనునది కళగా గ్రహింపవలసియున్నది. కాని యిది ద్రుతాంతంబనువారు "ఏన విదప డిగియెద" ననుపాఠమును గల్పించినారు. కృష్ణుఁ డర్జునుని "ముందఱ డిగు"మని "ముందఱ" శబ్దము నుచ్చరించి చెప్పినపిదప, ఏన—నేనే పిదప డిగియెద నని యవధారణార్థక "అ" కారమునుగూడ వేయవలసినంత యావశ్యకత కనఁబడదు. రథము కాలిపోవనున్నదను విషయము తెలిసినవాఁడు గావున న ట్లనియెనని సమాధానము చెప్పవచ్చును గాని, కృష్ణార్జునుల కెవరు ముందఱ దిగుట యను విషయమున వాదమేమియు నున్న ట్లగపడకుండుటచే, నీవు కాదు నేనే పిదప దిగియెద నని యాతఁడు నొక్కి చెప్పవలసినంత యావశ్యకత కానరాదు. కావున

నట్టిచో పాఠభేదములను గల్పింపవలసినంత యావశ్యకత లేదు. మేము శబ్దమువలెనే "నేను" శబ్దముకూడ నొకప్పుడు ప్రథమాంతముగను, కళగను గ్రహింపఁబడి యుండవచ్చు నని తలంచుట కవకాశ మేర్పడుచున్నది.

తక్కిన భాషలలో లేని యీ కళా ద్రుతప్రకృతికవిభాగ మీ భాషలో ప్రత్యేకముగా నేర్పడుటకుఁ గల పరిస్థితు లెట్టివో యించుక పరిశీలింపవలసియున్నది.



# కళా ద్రుతప్రకృతిక విభాగము

ఈ భాషలోని శబ్దములన్నియు నొక నకారము లేదా ద్రుత మంతమందుఁ గలవి, లేనివి యను రెండు భాగములలోఁ జేరవలసిన వగుట యొక గొప్ప విశేషముగాఁ గనఁబడు చున్నది. ఇతర ద్రావిడభాషలలో, నింక నితరములగు హల్లులు పదాంతమందు వచ్చునవై యున్నను, నీ భాషలో నొక నకారము పొల్లు తక్క తక్కిన హల్లులు పదాంతమం దుండ వని యీ విభాగమునలన సూచింపఁ బడుచున్నది. వారల్, మీరల్ మొదలగు కొన్నిశబ్దము లగపడుచున్నను, అవి "వారలు, మీరలు" అను "లు" వర్ణాంతశబ్దముల రూపాంతరములై కొన్ని సందర్భములలో మాత్రమే వ్యాకర ణముచే సాధింపఁ బడినవై వచ్చునవే గాని సహజప్రాతిపదిక ములుగా వైయాకరణులచేఁ బరిగణింపఁబడవు. అనఁగా నీ భాష లోని శబ్దములన్నియు నకారాంతములో అజంతములో యై యుండవలయు నన్నమాట. ఇతర ద్రావిడభాషలలో వివిధ హలంతములుండఁగా, నీ భాషలోమాత్రము నకారాంతములు తక్క మిగిలిన హలంతశబ్దము లేల లేకపోయిన వను ప్రశ్న కలుగక మానదు. ఒకకాలమున ప్రాచీనభాషలోనే హలంత శబ్దములన్నియు నుచ్చారణ సౌకర్యము కారణముగా తుది నొక యచ్చును గ్రహించి యీ భాషలో నజంతశబ్దములైన ట్లగ పడుచున్నది. ఈ తుదియచ్చు సామాన్యముగా ఉకార

మగుటచే నీ భాషలోని పెక్కు శబ్దము లుకారాంతములగుట తటస్థించినది. సంస్కృత హలంతశబ్దములు నింక నన్యభాషా పదములుగూడ నిట్టి మార్పునే పొందియుండుటం జేసి యీ భాషలో నీ యలవాటెంత బలవత్తరమై యుండెనో వ్యక్తం బగుచునే యున్నది. (ఉదా: వాక్—వాక్కు, అప్—అప్పు, సంపత్—సంపత్తు, కణ్—కన్ను, పల్—పల్లు, విన్—విన్ను, మణ్—మన్ను, రోడ్—రోడ్డు, మొ॥) ఇట్లాంధ్ర మజంతభాష యైనదని చెప్పవచ్చును. కాని సామాన్యముగా శబ్దముల తుది హల్లులపైఁ జేరిన ఉకార మా హల్లులతోఁ గలిసి శబ్దభాగమే కాఁజొచ్చినను, విభక్తి క్రియావ్యయాదులలోఁ గొన్నిటిఁ జేరిన అన్, ఉన్, మొదలగువాని యవశిష్టభాగమగు నకార ముపై వచ్చిన యుకారము తఱచుగా లోపించుచుండుటం జేసి యట్టి పదములు నకారాంతములై భాషలో నిలిచి యుండుట తటస్థించినది. ఈ నకారము మఱియొక శబ్దము యొక్క యవశిష్టభాగమేయైనను దాని మూలార్థము భాషలో విస్మృతప్రాయ మగుటచేతను, లేదా యది రూపాంతరమును బొంది గుర్తుపట్ట వీలులేకుండుటచేతను, అది శబ్దాంతమున నున్నను లేకున్నను శబ్దార్థమందు భేదమేమియుఁ గలుగక సులభముగ జాఱవిడువఁబడుచుండుటచే నది ద్రుతమనియు నిది యంతమందుఁ గల శబ్దములు ద్రుతప్రకృతికము లనియుఁ జెప్పఁబడుచున్నవి. ద్రుతమనఁగా ద్రవించిపోవునది —జాఱిపోవునది. అవసానంబున నిది యుచ్చారణలాఘవమును

కారణముగా లోపించినను అజాదిశబ్దములు పరమైనపుడు నిలుచుచునే యుండెను. నిలిచియున్నప్పు డది యుచ్చారణ సౌకర్యమునకుగా నడుమఁ జేరిన ట్లెంచఁబడుటయు సంభవించినది. కాల్డ్వెల్ పండితుఁడు ద్రుతనకార మీ భాషయందు సంహితలోఁ బ్రకృతిభావమును దొలఁగించి, యుచ్చారణ సౌకర్యమును బెంపొందించుటకుగాఁ జేర్పఁబడు వర్ణములలో నొక దానినిగాఁ దలంచియున్నాఁడు. సాధారణముగా రెండచ్చులనడుమ నుచ్చారణసౌకర్యమునకుఁగా నంతస్థ వర్ణములును, సులభముగ నుచ్చరింపఁదగినవియు నగు యకార వకారములు, ఇ, ఈ, ఎ, ఏ లపైని, ఉ, ఊ, ఒ, ఓ లపైని (ఒకప్పుడు అకారముపైని గూడ) వరుసగా సంధ్యక్షరములుగా (glides) వచ్చుననుట యుచ్చారణ పరిపాటిని బట్టియు, వాని సావర్ణ్యమును బట్టియు సమంజసమై కన్పట్టునేగాని, రెండచ్చుల నడుమ వానిలో నే దానికి నెట్టి సంబంధమును లేని దంత్య నకార ముచ్చారణ సౌకర్యమునకై వచ్చిన దనుట యెంతమాత్రము యుక్తియుక్తము కాదు. కావున నిది సహజముగ శబ్దగతమో లేదా యొక శబ్దము తుదిఁ జేర్పఁబడిన మఱియొకదాని యవశిష్టభాగమో యై యుండవలయును. తిన్నగా+ఏగెను=తిన్నగా+న్+ఏగెను= తిన్నగానేగెను అను దానిలోని "న" కారమును, వైయాకరణు లాగమములని చెప్పిన పొద+ఇల్లు=పొద+ర్+ఇల్లు= పొదరిల్లు, సుందరురాలు అను సందర్భములందలి రేఫమును,

కటకటమ్ము—అనుదానియందలి టకారమునేగాక, పదుగురు, ఆరుగురు — అనువానిలోని "గ" కారమును, పదకొండు (పది+క్+ఒండు?) లోని "క" కారమును గూడ నుచ్చారణార్థము వచ్చిన వనియే కాల్డ్వెల్ పండితుఁడు చెప్పియున్నాఁడు. అట్లే కన్నడములో "మాడిద" అన్నప్పుడు మాడి+అ అని యుండఁగా నా రెంటి నడుమ నున్న (మాడి+ద్+అ) దకారముకూడ నుచ్చారణ సౌకర్యమునకై చేరినదనియే యాతని యభిప్రాయమై యున్నది. ఇ, ఉ ల పైని యకార వకారములు సంధ్యక్షరములుగ వచ్చుట సహజముగాని పరుషాక్షరములగు కకార టకార దకారములుచ్చారణమునకు సహాయపడుటకు నడుమఁ జేరు ననుట సంభావ్యముకాదు. భాషలోని కొన్ని ప్రాచీనపదబంధములను వైయాకరణులు తమ కాలమున నిలిచియున్న శబ్దస్వరూపమునుబట్టి విడఁగొట్టఁగా నడుమ మిగిలిన యీ ప్రాచీన పదబంధములలోని వర్ణముల నాగమములుగా గ్రహించి యీ రూపనిష్పత్తిని సాధింతురు. కాని యీ భాషలను, భాషారూపములను నితరభాషారూపములతోఁ బోల్చి, వాని చరిత్ర నన్వేషింపఁ దలపెట్టిన కాల్డ్వెల్ పండితుడుకూడ నీ వర్ణములుచ్చారణార్థము వచ్చి చేరినవే యని తలఁచుట యాశ్చర్యకరమైన విషయము. వీని మూలరూపములేవో, యవి యచ్చటి కెట్లు వచ్చినవో యని యాతఁడు బాగుగఁ బరిశీలింపకపోవుటచే నట్లు తలంచియుండును. పొదరిల్లు మొదలగు

వానిలోని రేఫము పూర్వశబ్దగతమే గాని యుచ్చారణసౌక ర్యమునకై చేర్పఁబడిది గాదనుట "పౌదరు" శబ్దమే మన కగపడుచుండుటను బట్టి సువ్యక్తమేగదా. ఇట్లే "సుందరు రాలు" మొదలగు తత్సమశబ్దములపై "ఆలు" శబ్దము చేర్చుటచే నేర్పడిన రూపములు రేఫాంతములగు నేవో కొన్ని. దేశ్యశబ్దము లాలు శబ్దముతోఁ గూడినపు డేర్పడిన రూపముల సామ్యముచే నేర్పడి యుండుననియు "తేనెటీగ" "కటకుటమ్మ" మొదలగువానిలోని 'ట' కారము పూర్వశబ్ద ముల విశేషణత్వమును స్ఫుటముచేయుటకుగాఁ బ్రాచీనకాల మునఁ జేర్పఁబడిన సహాయశబ్దముయొక్క యవశిష్టభాగ మనియుఁ నిదివరకే సూచింపఁబడినది ఇఁక "పదకొండు" లోని "క" వర్ణము "పదు" శబ్దముపైఁ జేర్పఁబడిన 'ఒకండు' శబ్దమునకు సంబంధించిన "క" వర్ణముగాని "పదు+ఒండు" అని యుండఁగా నుచ్చారణసౌకర్యమునకై నడుమ చేర్పఁ బడినది కాదు. ఇట్లే 'తిన్నంగాన్" అను దానిలోని "న" కారముకూడ తిన్నన+అగన్—కాన్, అని పూర్వశబ్దమునకు సంబంధించినదేగాని యుచ్చారణార్థము వచ్చినదికాదు. తిన్నగన్ అనుదానిలోని "అన్" అనునది "దానన్" "చేతన్" "లోపలన్" ఇత్యాది శబ్దములం దగపడుచున్న సప్తమ్యర్థద్యోతకస్థలవాచక శబ్దమే. దీని పూర్వరూపము "అల్—అల్లి" అనునది కన్నడమున సప్తమీ ప్రత్యయముగా గ్రహింపఁబడుచున్నది. ఈ రీతిగా చేయంగన్, చేయఁగాన్,

తిన్నంగన్ — తిన్నఁగాన్, అనునవే గాక, చేతన్, దాని రూపాంతరమగు చేన్, తోడన్ = (తోడు + అన్), దాని రూపాంతరమగు "తోన్" వలనన్ (వలను+అన్), లోపలన్ (లోపలు+అన్), లోన్, (ఉళ్+అన్) లోనన్ (లోన్+అన్) అని విభక్తిప్రత్యయములుగా గ్రహింపఁ బడుచున్న యివ న్నియు నీ "అన్" శబ్ద మాత్రమందు గలవగుట చేతనే నకా రాంతములగుట ద్రుతప్రకృతికములగుట తటస్థించినది గాని వీని కజాది శబ్దములు పరమైనపుడు "న" కార ముచ్చారణ సౌకర్యమునకై వచ్చి చేరుట లేదు. మా+ఇల్లు, 'మాయిల్లు' అన్నపుడు పరమందలి ఇకారమును బట్టి "య" అనునది సంధ్యక్షరముగాఁ జేయుచున్నట్లే, తిన్నఁగా నేగెను అను దానిని తిన్నఁగా+ఏగెను అని విడఁదీసినపుడు నడుమనగపడు "న" కారము పై సందర్భమున "య" కారము వచ్చిన స్థానముననే వచ్చినట్లగపడును గావున, దానివలెనే యిదియు నుచ్చారణసౌకర్యమునకై వచ్చినదే యని కాల్డ్వెల్ తలంచి యుండును.

నామవిభక్తులలోని "చేతన్" మొదలగునవి కొన్ని అన్ అనునది చేర్పఁబడుటచేతనే ద్రుతప్రకృతికము లయ్యెనని చెప్పఁబడియెఁగదా. ఇఁక షష్ఠీప్రత్యయముగాఁ దెనుఁగున గ్రహింపఁబడుచున్న 'కు' అనునది ద్రుతప్రకృతికమెట్లయ్యెనో తెలిసికొనవలసి యున్నది. 'కి' అనునది, "కు" అనుదాని రూపాంతరమే. ఇకారాంత ప్రాతిపదికలపైఁ జేర్పఁబడినప్పుడు

వానియందలి తుది యికార సాహచర్యబలముచే "కు"–"కి" అయినది. కి, కు, యొక్క, లో, లోపల అనునవి సామాన్యముగా షష్ఠీవిభక్తి ప్రత్యయము లని యాంధ్రవ్యాకరణములలోఁ గొన్ని చెప్పుచుండె నేగాని వాస్తవముగా నివియన్నియు షష్ఠ్యర్థమును సూచింపవు. పలయనఁగా "శేషేషష్ఠీ" యను సంస్కృత వ్యాకరణ సంప్రదాయమునుబట్టి షష్ఠీవిభక్తి సంబంధార్థమునే ముఖ్యముగా సూచించుచున్నది. ఈ ప్రత్యయములలో "యొక్క" అనునది మాత్రమే ప్రధానముగా సంబంధార్థమును సూచించునది. కి, కు అనునవి రెండును "వాని కిత్తును" మొదలగు సందర్భములలో సంప్రదానకర్తతోఁ గలిగిన సంబంధమును సూచించుచుండుటచే సంబంధార్థమును గూడ సూచించు ననవచ్చును. చతుర్థీవిభక్తి ప్రత్యయముగా "కొఱకు" అనునది ప్రయోజనార్థకమగు "కొఱ" శబ్దమునకు "కు" చేర్చుటచే నేర్పడిన దొకటి కలదు. కొఱ=ప్రయోజనము, కొఱకు=ప్రయోజనమునకు, ప్రయోజనము అగునట్లుగా, కలుగునట్లుగా అని దీని యర్థము. వాని ప్రయోజనమునకు అయి లేదా అగునట్లుగా నుద్దేశింపఁబడి యియ్యఁ బడినదే కావున "వానికయి" యియ్యఁబడినది కూడ నైనది. ఇట్లు "కొఱకు" వలెనే "కయి" (కు+అయి) అనునదికూడ చతుర్థీవిభక్తిప్రత్యయ మైనది. "అయి" అనునది "అగు" ధాతువునుండి యేర్పడిన భూతకాలికాసమాపక క్రియ గావున నది ద్రుతాంతము కాలేదు. ఇకారాంతమై

నిలిచినది. 'కొఱకు' 'కయి' లు రెంటిలోను "కు" అనునదే ప్రధానభాగము. అయినను "కొఱకు, కయి" లను చతుర్థీ ప్రత్యయములనుగా గ్రహించి "కు" ప్రత్యయమును షష్ఠిక్రింద వైయాకరణులు చేర్చినారు. లో, లోపల అనునవి స్థలవాచకములగుటచే సప్తమ్యర్థకములే యైనను షష్ఠిలోనే చేర్పఁబడినవి. కావున నిటీవల వ్యవహారములోనికి వచ్చిన "యొక్క" అనున దొక్కటే వీనిలో ప్రధానముగా షష్ఠ్యర్థద్యోతక మన పలసి యున్నది.

"విప్రునకు గోవు నిచ్చినాఁడు." అనఁగా తనయొద్ద నున్న, తన సొత్తగు గోవు విప్రునిది అగునట్లుగా నిచ్చినాఁ డన్న సందర్భమున వచ్చిన "కున్" అనునది దానక్రియతోడనే సంబంధించియున్నది. విప్రుని (ది)+అగుం (అట్లు ఇచ్చినది) విప్రునకుఁ ఇచ్చినదైనది. సంప్రదానార్థ సంబంధమును వ్యక్తము చేయుటకుగాఁ బ్రాచీనకాలమున దానిపైఁ జేర్పఁబడిన "అగు" ధాతువుయొక్క ఉమ్మంతరూపంబగు "అగుం" "అక్కుం" అనుదాని యవశిష్టరూపమే యీ కున్ అనునది. క్రియాసాతత్యసూచకముగా ధాతువులపై ప్రాచీన కాలమున "ఉం" చేర్పఁబడుచుండెను. ఇవి కాలభేదమును సూచింపకపోవుటచేత తద్ధర్మార్థకము లైనవి. పదాంత మకార మీ భాషలలో నకారముగ మాఱుచుండుట సహజమే. "అగుమ్" లోని తుది "మ" కార మితరభాషలలో జాఱిపోయి యుండును. రామన్+అకుం (అగుం) రామనకుం

=రామునకున్ అయినట్లే, తమిళమున అవన్+అక్కుం= అవనక్కుం = అవనుక్కుం అని కావలసినదే. కాని తుది యనునాసికము జాఱిపోవుటచే "అవనుక్కు" "ఎనక్కు" ఇత్యాదిరూపము లేర్పడియుండును.

ఈ భాషలో నాన్ – యాన్ – అనుదానికి – "ఎన్" అనియు, నీన్ అనుదానికి నిన్ అనియు, తాన్ అనుదానికి తన్ అనియు విశేషణత్వద్యోతక రూపములు (Possessive forms) కలవు. వీనిపై మరల "అగు" ధాతురూపమును జేర్చుటవలన ఎన్+అక్కుం, నిన్+అక్కుం = ఎనక్కుం, నినక్కుం–అనునవి "నా(కు) సంబంధించినది–నా(యొక్క)ది–అగునట్లుగా," "నీ(కు) సంబంధించినది–నీ(యొక్క)ది అగు నట్లుగా" అను నర్థమున నేర్పడుచున్నవి. తెనుఁగున నస్మ ద్యుష్మదర్థక విశేషణరూపములు దీర్ఘాచ్చుతోఁ గూడియే యుండుటంజేసి (నా, నీ) "అక్కుం" లోని అకార మగ పడుటలేదు. (నా+అకుం=నాకున్, నీ+అకుం=నీకున్) కాని యాత్మార్థకమగు "తాన్" శబ్దమునకు విశేషణరూపము "తన్" అగుటచే దీనిపై "అకుం" అనునది చేర్పఁబడినపుడు "తన్+అకుం=తనకుం–తనకున్" అనుదానియందు "అగు" లోని అకారముకూడ స్పష్టముగఁ గనఁబడుచునే యున్నది. ఇట్లు తెలుఁగున షష్ఠీప్రత్యయములలోఁ జేర్పఁబడిన సంప్రదానార్థక "కు" వర్ణ మకారపూర్వకమనియుఁ గావుననే యది "అగుం" శబ్దముయొక్క యవశిష్టభాగమనియు నిశ్చయింపఁ దగి యున్నది.

ఇంకను విభక్తిప్రత్యయములలో ద్రుతాంతంబులై యున్నవి 'అందు' అను సప్తమీ ప్రత్యయము, "ను" అను ద్వితీయా ప్రత్యయము గలవు. "అందు" అనునది స్థలవాచక మగు "అల్" అనుదాని రూపాంతరమగు "అన్" అనుదాని నుండి కాలక్రమమున నేర్పడిన రూపము. (ఇల్, ఇన్, ఇందు, ఎల్, ఎన్, ఎందు) "అన్" అనుదాని చివర నుచ్చారణ సౌకర్యమునకై యొక ఉకారము చేరి దానిపై నూఁతపడి నపుడు "అన్ను" అను నుచ్చారణము ప్రబలియుండ తుది వర్ణము నొత్తి పలుకు సందర్భమున నొకప్పు డనునాసిక ద్వారము మూఁతపడుటచే నా దంత్యానునాసికము తరువాత నొక దంత్య సరళ వర్ణము బయలుదేరుట తటస్థించినపుడు "అందు" అను శబ్ద మేర్పడి యుండును. ఇట్లే ఇందు, ఎందు మొదలగునవియు నేర్పడినవి. కన్నడమున "అల్" మొదలగు వాని "ల" కారము "న" కారముగా మాఱకపోవుటచే అల్లి, ఇల్లి, ఎల్లి శబ్దములలో నది కనఁబడుచునే యున్నది. మొదట (అల్) "అన్" అనునదే సప్తమీప్రత్యయమై యుండెడిది. దానన్, చేతన్, నోటఁ మొదలగు నన్నంత రూపములే సామాన్య దేశ్యశబ్దముల సప్తమ్యర్థకరూపములు. "పంట గొఱికె" అన్నపుడు "పంటియందు" కొఱికినది-'పంటిచేతను' గొరికినదని కూడఁ జెప్పఁదగియుండుటచే నది తొలుత సప్తమ్యర్థకమై కొంతకాలమునకుఁ దృతీయార్థకమగుట తటస్థించినది. సప్తమీ తృతీయలకు గల భేదమును సువ్యక్తము చేయుట

కుఁగాఁ దరువాతి కాలమున సప్తమికి "అందు" చేర్పఁబడుచు వచ్చినది. ఈ "అందు" అనునది "అన్" అనుదానికంటె నర్వాచీనరూప మగుటచేతనే నోటన్, పంటన్, చేతన్ అను వానివలెనే నోటందు, పంటందు, చేతందు అని చెప్పుట కవకాశము కలుగలేదు. నోరు, పన్ను, చేయి శబ్దములకును, ఈ అందు శబ్దమునకును గల సంబంధము వ్యక్తమగునట్లుగా నిది యా శబ్దముల సంబంధార్థక (possessive) రూపములపైఁ జేర్పఁబడినది. కావుననే నోరు-నోటి-నోటియందు, పన్ను-పంటి-పంటియందు, చేయి-చేతి-చేతియందు ఇత్యాదిరూపము లేర్పడినవి. నోటన్, పంటన్, చేతన్ అనువానికి నోటి యందు, పంటియందు, చేతియందు అను నర్థము ప్రాచీన సంప్రదాయమును బట్టి కలుగుచునే యున్నది. కాని యిటీవలి కాలమున "అందు" తోఁ గూడిన రూపములకు సప్తమ్యర్థము నను, అన్ తోఁ గూడిన రూపములకుఁ గరణార్థమునను, సప్త మ్యర్థమునను గూడ వ్యవహార మేర్పడినది. "అందు" అనునది వాస్తవముగా "ఉ" కారాంత శబ్దమే గావున ద్రుతప్రకృతిక మగుటకుఁ గారణము లేదు. అన్నంతరూపముల సామ్యముచే నిదియు ద్రుతప్రకృతికమై యుండునని యూహింపఁ దగి యున్నది. "సమాసంబున యందు" 'అనిమిషనాయకత్వమున యందభిషక్తుఁడవై,' "మానుగ దైవంబున యందు బౌరుష మునన్"—అను నీ రీతి ప్రయోగములలో నకారముపై "అందు" గూడ, జేర్పఁబడుటను బట్టియే "అన్" "న" అను

వానికంటె 'అందు' సప్తమ్యర్థక ప్రత్యయముగ మిగుల నర్వాచీనకాలమున వాడుకలోనికి వచ్చినదని తలంపనగును. 'న' అనునది "అన్" అనుదాని రూపాంతరమే యగును. లేదా "దానన్" మొదలగు కొన్ని ప్రాచీనములగు సప్తమ్యర్థక శబ్దములనుండి "నన్" అనుదానిని సప్తమీ ప్రత్యయముగా విడదీయుటచేతనైన నేర్పడియుండును.

ద్వితీయావిభక్తి ప్రత్యయము 'ను' అనునదిమాత్రమే. ని, ను, ల, కూర్చి, అనున దిటీవలి పాఠము. కూర్చి అనునది "కూర్చు" ధాతువునుండి యేర్పడిన భూతకాలికాసమాపక క్రియారూపమగుట స్పష్టము. దానియందలి తుది "ఇ" కారము భూతన్యాన చిహ్నమగుటచేతను, దానిపై నొక నకారము వచ్చు నవకాశము లేకపోవుటచేతను, అది యజంతముగను, కళగను గ్రహింపఁబడుచున్నది. "ల" అనునది ద్వితీయాప్రత్యయము కాదు. ఇది లువర్ణాంత బహువచన శబ్దముల విశేషణార్థద్యోతకరూపము. ఏలయన నిది తక్కిన విభక్తు లన్నిటిలోనుగూడ బహువచనమునఁ బొడసూపుచునే యున్నదిగదా, (ఉదా: రాములచేత, వనములయందు, మొ॥) కావున ని, ను లను మాత్రమే ద్వితీయా ప్రత్యయములనుగా గ్రహింపవలసియున్నది. వీనిలో "ని" వర్ణము "ను" అనుదానికి రూపాంతరమేగాని వేఱుగాదు. హరి+ను—అని యుండఁగాఁ బూర్వమందున్న ఇకార సాహచర్యబలముచే 'ను' అనునది "ని" గా మాఱినది. కావున వా సహజముగా

"ని" అనుదానిని గూడ ప్రత్యేకము ద్వితీయా ప్రత్యయముగా గ్రహింపనక్కఱ లేదు. ఇఁక మిగిలిన "ను" అనునది ద్వితీయా ప్రత్యయమై ద్రుతాంతం బెట్లైనదో పరిశీలింపవలసి యున్నది.

ఇది యీ భాషలోని సర్వనామరూపముల సామ్యముచే నేర్పడియుండు నని నా యభిప్రాయము. సామాన్యముగా నీ ద్రావిడభాషలన్నిటిలోను 'నాన్, నీఁ, తాన్" అను నుత్తమ మధ్యమాత్మార్థక సర్వనామముల ప్రథమావిభక్తిరూపములు దీర్ఘాచ్చులతోఁ గూడియున్నవి. వీని సంబంధార్థక రూపములు (Possessive or inflexional forms) లేదా విభక్తి ప్రత్యయములు పరమగునపుడు వీనిరూపములు తమిళ కన్నడ మళయాళములలో ఎన్, నిన్, తన్ అని హ్రస్వాచ్కము లగుచున్నవి. (ఉదా: త. నాన్-ఎన్; ఎన్+ఐ = ఎన్నై, ఎన్+ఆల్=ఎన్నాల్, ఎన్+ఒడు=ఎన్నోడు, నీఁ—నిఁ; నిఁ + ఐ= నిన్నై, నిన్+ఆల్ = నిన్నాల్, నిన్ +ఒడు= నిన్నోడు, తాన్—తన్; తన్+ఐ=తన్నై, తన్ + ఆల్= తన్నాల్, తన్ + ఒడు=తన్నోడు. మొ||) ఈ భాషలలో— అనఁగా తమిళ కన్నడములలో—నీ సర్వనామములకుఁ బ్రథమేతర విభక్తి పరమైనపుడు తదంగము హ్రస్వాచ్కంబై యుండుట నియతముగనే కనఁబడుచున్నది. కాని తెలుఁగున మాత్ర మట్లు లేదు. ఈ భాషలో నీ సర్వనామముల ద్వితీయా రూపము మాత్రము తక్కిన భాషలలోవలెనే హ్రస్వాచ్కంబై

యున్నదిగాని, తృతీయాదివిభక్తిప్రత్యయములు పరమైనపుడు మాత్ర ముత్తమ మధ్యమపురుష సర్వనామాంగములు హ్రస్వాచ్కములై యుండక దీర్ఘాచ్చుతోఁ గూడినవిగనే నిలిచినవి. కాని వీని తుది నకారము మాత్రము జాఱిపోవు చున్నది. (ఉదా: ప్ర—నేన్ (ఏన్) ద్వి—నన్, తృ—నా చేతను పం—నావలనను, స—నాయందు. ప్ర—నీ (న్), (నీవు) ద్వి—నిన్ ; తృ—నీచేతను, పం—నీవలనను, స—నీయందు) తమిళము నందువలె ఎన్నై, ఎన్నాల్, నిన్నై, నిన్నాల్—అని ద్వితీయా తృతీయలం దంగ మొక్కరీతిగ లేదు. ఇఁక నాత్మార్థక సర్వ నామాంగము తెలుఁగున ద్వితీయలో నేగాక తక్కినభాషలలో వలెనే, మిగిలిన విభక్తులలోఁ గూడ హ్రస్వాచ్కంబే యగు చున్నదిగాని (ఉదా: తాన్; ద్వి—తన్), తృతీయాదులలో—నాచేతను, నీచేతను—అనువానివలె తాచేతను, తావలనను అని గాక తుది నొక విశేషణార్థద్యోతక "అ" కారమునుగూడ గ్రహించుచున్నది. అనఁగా "తాచేత" అని గాని 'తన్‌చేత' అని గాని కాక, "తనచేత" యను రూపముగలిగినది. ఏదెట్లై నను నిచ్చట మనము ముఖ్యముగా గమనింపఁదగిన విషయ మేమనఁగా నాన్, నీన్, తాన్ అను సర్వనామప్రాతిపదికలు తెలుఁగులో నేను, నీవు, తాను అనురూపములు గలవై ద్వితీయా విభక్తిలో నన్ నిన్, తన్ అను రూపములను, తృతీయాదులలో తద్భిన్నంబగు నా, నీ, తన, యను రూపము లనుబొందియున్న వనుటయే. అనఁగా తమిళ కన్నడాదులలో

ప్రథమేతర విభక్తులలోని యంగ మొక్కరూపమే కలదై యుండ తెనుఁగున ద్వితీయాంగమునకును తృతీయాదుల యందలి యంగమునకును భేద మేర్పడుట తటస్థించినది.

నన్, నిన్, తన్, అను శబ్దములు కాలక్రమమున తుది నొక ఉకారము నూఁతగాఁగొని నన్ను, నిన్ను, తన్ను, అని యైనపుడు, వీనికిని తక్కిన విభక్తిరూపములకును గొంత భేద మగపడుచుండుటను బట్టి, వీని తుదినున్న "ను" వర్ణము తక్కిన విభక్త్యంగరూపములలోఁ గనఁబడకుండుటచే నిది ద్వితీయాచిహ్న మని తలంచి దానిని ద్వితీయాప్రత్యయముగా విడదీసియుందురు. సర్వనామ రూపములలో ద్వితీయా చిహ్న మనుకొని విడదీసిన యీ "ను" వర్ణకము నితరశబ్దము లపై గూడఁ జేర్చి వ్యవహరింప మొదలిడిరి. ఆదికాలమున, నిప్పటికి నమహత్తులలోఁ బ్రథమాద్వితీయలకు భేదమే లేదు. సర్వనామరూపములలో నైనను వాస్తవముగ ద్వితీయా విభక్త్యర్థబోధక మే మాత్రమును గాక సహజముగ శబ్దగతమే యైయుండిన యీ "న"కారమే యుచ్చారణసౌకర్యమునకై వచ్చిచేరిన యొక "ఉ" కారమును జేర్చికొని, కాలక్రమమున నీ భాషలో సర్వసామాన్యమైన ద్వితీయావిభక్తిప్రత్యయమై స్థిరపడుట తటస్థించినది. ఇట్లు వాస్తవముగా సర్వనామశబ్దగత మేయై, తరువాతివారి యనుచితవిభాగము (mal-analysis) మూలముగా భాషలలో నేర్పడిన నువర్ణము ద్వితీయా ప్రత్యయమై శబ్దాంతరములపైఁ జేర్పఁబడఁగా నందలి తుది యుకా

రము లోపించినపు డవి నకారాంతములు లేదా ద్రుతాంతము లగుట తటస్థించినది. తుళు, కన్నడములందు ద్వితీయా ప్రత్యయము అమ్-అన్ను అనునదై యుండుటచే నిది తెలుఁగు నందలి దానితో సజాతీయంబనియే తలంపనగును.

ఇఁక క్రియారూపములలోని యుత్తమ పురుషైక వచన రూపములన్నియు నకారాంతములే యగుట సహజమే. ఏల యనఁగా నాయా ధాతువులపైఁగాని, ధాతుజవిశేషణములపైఁ గాని సర్వనామశబ్దములను జేర్చుటచేతనే యీ భాషలలోఁ గ్రియాపదము లేర్పడియున్న వనుట స్పష్టమేగదా. కావున నుత్తమపురుషక్రియల తుది నేకవచనమున నుత్తమపురుషైక వచన రూపమగు "నాన్"-"ఏన్" అనుదానికి సంబంధించిన "న"కారము పొడసూపుచునే యుండును. వత్తున్, వచ్చెదన్, వచ్చితిన్ అనువాని ద్రుతాంతములనుగాఁ జేసిన దీయుత్తమ పురుషసర్వనామములోని తుది నకారమే. "వచ్చెన్" అను భూతార్థక ప్రథమపురుషైకవచనముకూడ ద్రుతాంతమగుట విశేషము. తెలుఁగులో నిపుడు ప్రథమపురుషైకవచన సర్వనామరూపము "వాఁడు" అయియుండుటచేతను, "వచ్చిన వాఁడు, వచ్చినాఁడు" అను రూపములలో నీ "డు" ప్రత్యయము ప్రథమపురుషచిహ్నముగాఁ గనంబడుచునే యుండుట చేతను, "వచ్చెన్" అనురూపమున "డు" ప్రత్యయము కనఁబడక పోవుటేమి? నకార మెచ్చటినుండి వచ్చినది? యను ప్రశ్నలు కలుగక మానవు. "వచ్చెన్" అను రూప మీ

భాషలలో 'వచ్చినాఁడు' మొదలగు రూపములకంటె మిక్కిలి ప్రాచీనకాలమున నేర్పడినదగుటచేతనే యది యట్లయ్యె నని చెప్పుట కవకాశము లేకపోలేదు. అనఁగా నీ రూప మీ భాషలో ప్రథమపురుష సర్వనామము "వాఁడు" అను రూపమును బొందక పూర్వము కొంతకాలము క్రిందటనే యేర్పడి యుండుననుట. ఈ "వాఁడు" అనుదాని ప్రాచీనరూపము "అవన్" అనునది. "వచ్చి" అను భూతన్యూనరూపముపై "అవన్" అనుదాని సంక్షిప్తరూపమగు "అన్" అనుదానిని జేర్చుటచే "వచ్చి+అన్" = వచ్చియన్-వచ్చన్-వచ్చెన్ అను భూతకాలిక క్రియారూప మేర్పడియుండును. "వచ్చన్" అనుదాని స్వరూపమే యిప్పటికిని వ్యావహారికభాషలో వచ్యాఁడు, వచ్చాఁడు అను దానిలోఁ గానవచ్చుచున్నది. వచ్చి, పోయి అను భూతకాలిక రూపములపై "అన్" అనునది చేరినపుడు "పోయి+అన్" అని యుండఁగా, పరమందలి వివృతాకారసాహచర్య బలముచే "పోయి" లోని ఇకారము కొంత వివృతత్వము నొందుటచే "పోయె+అన్=పోయెన్" అనియు, నింకను వివృతమై "పోయన్" అనియు రూపముల నొందియుండును. కాని ప్రాచీనకావ్యభాషను దిద్దినవారు ఎత్వముతోఁ గూడిన రూపమునే గ్రహించి, కావ్యములలోఁ బ్రయోగించుటచే దానికిమాత్రమే ప్రామాణికత్వము సిద్ధించినది. తాటి+ఆకు, మట్టి+ఆకు అనువాని సంధిగతరూపము 'man' అనుదానిలోని వివృతమగు "ఆ"కారధ్వనితో స్వేవ

హారమున సర్వసామాన్యముగాఁ బ్రయోగింపఁబడుచుండినను, వ్రాఁతలో మాత్రము "మఱ్ఱియాకు" అని సంధిలేని రూపమే ప్రయోగింపవలయును గాని "మఱ్ఱాకు, తాటాకు" అని వ్రాయఁగూడదనియు, "మఱ్ఱాకునఁ బండెడిదొర గుఱ్ఱానికి మూఁడు కాళ్ళు" అను ప్రయోగము అపప్రయోగమనియు వైయాకరణులు శాసించుచుండుట యందఱెఱింగినదే. "లిఙ్లా ట్టుల డుఙ్జున కెను సువర్ణంబులగు" నని వైయాకరణులు శాసించినను, వ్యవహారప్రాచుర్యమునుబట్టి కొందఱు ప్రాచీన కవుల ప్రయోగములందు "పోయన్" అను అత్వావిశిష్టరూపములు కూడఁ గనఁబడుచునే యున్నవి.

శా॥ "అయ్యో నీ సుతు గ్రద్ద తన్నుకొని పోయన్ భీతి వాపోవఁగన్"

(వెంకటనాథకవి—పంచతంత్రము, 2 ఆ.)

మ॥ "అని శాపావధి చెప్పి ముద్గలుఁడు పోయెఁ బావనా లోన—"

(పం. 4 ఆ.)

శా॥ "అయ్యోన్ నాలవజాము చొచ్చెఁ దడవాయన్ వచ్చి విచ్చేయుము"

ఇట్టి రూపములు క్వాచిత్కముగానైనను గావ్యభాషలోఁగూడఁ గనఁబడుచుండుటచే నవి ప్రామాదికములనియు ననిష్టరూపము లనియు, కవి యతి కుదుర్చుకొనలేక యీ

రూపమును వాడెననియు, వైయాకరణులు వీనిని త్రోసిపుచ్చి వను, చిరకాలమునుండి యిప్పటివఱకు నీ రూపములు వ్యవహారప్రచురములై యుండుటంజేసి, భూతకాలచిహ్నమగు "ఇతు" అనుదానిలోని "ఇ" కారము కాలక్రమమున నెట్టి మార్పులను బొంది యే యే రూపములకు మూలమైనదో దీనివలన మనకు వ్యక్తమగుచున్నది. పోయి+అన్ అనునది పోయెన్, పోయన్, అను రెండు రూపములను బొందుటేగాక యీరెండవ రూపమునందలి తుది వివృతాకారము ధాతుగతమగు సంవృత ఓకారమునుగూడ వివృతముగాఁజేయ సమర్థంబగుటచే సామాన్యజనవ్యవహారమున "పాయె"—పాయ అను రూపముకూడ నేర్పడుట తటస్థించినది.

"పోవునకు దుమ్ముత్తులు మాఁజుం బరంబగు నపుడు వు లోపంబుం బొద పదలును విభాషనగు."

(బాలవ్యా. క్రియా. 98.)

అను సూత్రమును కల్పించి "పోవుదము" అనుదానికి "పొదము—పదము" అను రూపములను సాధించిన వైయాకరణులు, "పోయెను" అనుదానికి "పోయన్" అను రూపమును శిష్టవ్యవహారములోనికి వచ్చినప్పుడేల యంగీకరింపఁగూడదు? "పదము"నుండి 'ము' వర్ణలోపముచే 'పద' అనున దేర్పడినట్లే "పోయన్" అనుదానినుండి తుది "న"కారలోపముచే పోయ, "పాయ"అనునవికూడ నేర్పడినవి. మొత్తముమీద పోయెను, చేసెను అను రూపములు అవన్ శబ్దభాగమగు "అన్" అనున

వంతమందు గలవగుటచేతనే ద్రుతప్రకృతికము లైనవని నిశ్చయింపఁ దగియున్నది.

వచ్చున్, వచ్చెడున్, అయ్యెడున్ మొదలగు తద్ధర్మార్థకాశీరాద్యర్థక రూపములును, కొట్టుచున్, కొట్టుడున్ మొదలగు శత్రర్థకానంతర్యార్థక రూపంబులును ద్రుతాంతములగుట కవి యీ భాషలో "ఉమ్మం" తము లగుటయే ముఖ్యకారణము. "ఉమ్" అను క్రియాసాతత్యసూచక మగు శబ్దము భాషలో నొక శబ్దముయొక్క తుదిని జేర్పబడినచో సామాన్యముగాఁ దద్వివక్షితభావము సంపూర్తికాలేదనియు, నింక ముందుకు సాగుచున్నదనియు సూచించుచుండును. అది కాలవాచకక్రియాశబ్దములపైఁ జేర్పఁబడినపుడు ఆ క్రియ యింకను సంపూర్తి కాలేదను భావము సూచించు నను తలంపుతోఁ ప్రాచీనకాలమున నిది భావిశత్రాద్యర్థములపైఁ జేర్పఁబడుచుండెను. ఇది సామాన్యముగా భావివర్తమాన రూపముల తుది నగపడుచుండుటనుబట్టియే మనము దాని యుద్దేశమును గ్రహింపవచ్చును. భూతకాలక్రియలపై నీ "ఉమ్" అనునది యెచ్చటను జేర్పఁబడుటలేదు. "వచ్చున్" అనునది "వర్" ధాతువునకు "ఉతు" అను సహాయధాతు సంయోగముచే నేర్పడిన (వర్+ఉతు = వరుతు – వరుచు) వచ్చు అను రూపమునకు "ఉం" చేర్చుటచే నేర్పడినది. ఇది తద్ధర్మార్థకమని తలంపఁబడుచుండినను, దీనికి భావ్యర్థమే ప్రధానమై యుండుట సుప్రసిద్ధమే. భావికాలరూపము

తమిళభాషలో 'వర్' ధాతువునకు 'ఉమ్'మాత్రము చేర్చుట చేతనే యేర్పడుచున్నది. వర్ + ఉమ్= వరుమ్= వచ్చును. 'వచ్చెదున్' అనునదికూడ తద్ధర్మార్థకమే యగుట భావ్యర్థమును దానిచే సూచింపఁబడును. గావున దాని తుదినిగూడ "ఉం" అగపడుచునే యున్నది. "అయ్యెడున్" (అయి+ఎడు ఉమ్) అను రూపమువలన ద్యోతకమగుచున్న యాశీర్వచన రూపభావిఫలమే తుదినున్న "ఉమ్" వలన సూచింపఁబడుచున్న దనవచ్చును. వీని తుదినున్నది వాస్తవముగా "ఉమ్" శబ్దమేగాని యర్థములేని కేవల "న" కారము మాత్రము కాదనుటకు ఈ రూపముల కచ్చు పరమగునపుడందలి నకారము మరల "మ" కారముగ మారుచుండుటయే తార్కాణము. కావుననే "ఎడుంతల ద్రుతంబున కచ్చుపరమగునపుడు మగాగమంబగుట" యొక విశేషవిధిగా గ్రహింపబడినది. అనఁగా మొదటి ఉమ్ లోని మకారమే తరువాతి యచ్చుతో నెనసి "అయ్యెడుమనియొ" అను రూపము కాఁగా, కాలక్రమమున నా పదాంత మకారము నకారముగ మారుటచే "అయ్యెడున్" అను నకారాంతరూప మేర్పడినను, ప్రాచీనకాలము నందలి సంధిగత రూపములలో మొదటి "ఉమ్" శబ్దగతమగు "మ"కార మగపడుచునే యున్నదన్నమాట. కన్నడమునఁ గూడ నీ శత్రర్థకచిహ్నమగు "తుమ్" ఉమ్మంతమే. (ఉదా: నగుతుంబందం) ఇట్లే 'మ'కార మీ భాషయొక్క ప్రాచీనస్థితికి సంబంధించిన చారిత్రకచిహ్నమగుచున్నది. కొట్టుచున్,

అనునది హననక్రియ సంపూర్తి కాకుండుటను, కొట్టుడున్— అనునది క్రియసంపూర్తియైనను పిదప మఱియేమో జరిగినదని సూచించుటచేతను—రెండు ననసమాపకములయినవి. ఆ యసమాపకత్వమునే దాని తుదినున్న "ఉమ్" అనునది సూచించుచున్నది. ఇంక కొట్టన్, కొట్టంగ౯ అను తుమున్నర్థకములును, 'కొట్టినన్' అను చేదర్థక రూపమును "అన్నం"తములగుటచే ద్రుతప్రకృతికములైనవి. పంటియందు, చేతియందు నను నర్థముగల "పంటన్" "చేతన్" అను అన్నంత శబ్దములు, పంటన్గొఱికెను, చేతన్గొట్టెను, లన్నప్పుడు "పంటిచేత"–"చేతిచేత" అను తృతీయార్థము లేదా కరణార్థము నిచ్చుచున్నట్లే, కొట్టు—అను ధాతువుపై "అన్" చేరఁగా నేర్పడిన కొట్టన్ అనునది కొట్టుటయందు అను నర్థమునుండి, కొట్టుటకు, ఇకముందు కొట్టు నుద్దేశముతో, అను తుమున్నర్థమును; 'కొట్టిన' అను భూతకాలవిశేషణముపై అన్ చేరి 'కొట్టినన్' కాఁగా, నది కొట్టినదానియందు — అను నర్థమునుండి "కొట్టినట్టయితే" అను చేదర్థమును సూచించునవైనవి. నేను, తాను శబ్దముల తుదినున్న నకారము శబ్దగతమే. వతె ప్రభృతులలోని ఎల్లఁ (ఉదా: త. మ. ఎల్లామ్; క. ఎల్లమ్.) "ఎంతయున్, అయ్యున్, కడున్" మొదలగునవి ఉమ్మంతము అని వాని యర్థమునుబట్టియు, రూపమునుబట్టియుఁగూడ వ్యక్తమగుచునే యున్నది. మిగులన్, చాలన్, కూడన్, వెంటన్ అనునవి మిగులు, చాలు, కూడు, వెన్నంటు ధాతువులపై 'అన్'

శబ్దము చేరుటచే నేర్పడిన వనుటయు స్పష్టమే. మిగులు+అన్=మిగులన్"-మిగులుటయందు-మిగులఁగా-అని యర్థము. మీఁదన్, క్రిందన్, ఎదుటన్-అనునవి మీఁదు, క్రిందు, ఎదురు అనువానిపై స్థలవాచక "అన్" చేరుటచే నేర్పడినవే. "వెంబడిన్" అనుదాని పూర్వరూపము "వెన్ బడన్" అని యుండవలయునని యూహింపఁదగి యున్నది. లేదా వెన్+బడి (=పార్శ్వము) వెనుకప్రక్క (యందు) అను నర్థమున నేర్పడి యుండును. దీని ద్రుతాంతత్వముకూడ సందేహాస్పదము. పోలెన్ అనునది సాదృశ్యార్థకమగు పోలు—ధాతువునుండి యేర్పడినది. పోలన్=పోలఁగా అను నర్థమున అన్నంతమైయుండి, యందలి 'అ' కార మెత్వముగా మాఱుటచే "పోలెన్" అయియుండును. తమిళమున "పోల" అను రూపముకలదు. ఆధునికవ్యవహారమున నది "పోలె" అనియు జెప్పఁబడును. కన్నడమందును ఎత్వవిశిష్టరూపమున్నది గాని యీ భాషలో నది నకారాంతముగాని మకారాంతముగాని కాదు. "చంద్రంబోలె"=చంద్రునిబోలఁగా నని యర్థము. సతిసప్తమ్యర్థమున ధాతువుపై "ఎ"త్వముగలుగు సంప్రదాయము కన్నడమున నగపడుచున్నది. ఉదా: నుడియె=చెప్పఁగా; మనంగరగె=మనస్సు కరుగఁగా; గాయకంపాడె దేవం మెచ్చిదం=గాయకుఁడు పాడఁగా దేవుఁడు మెచ్చెను. పోలె అనునది పోలఁగా అను నర్థమున నెత్వమును గ్రహించి యుండును.

ఇంకన్=ఇవి+కన్: కన్న-ఇనం. తమి. ఇన్ఱు=ఇప్పుడు, ఈ దినము (This time). కన్న-ఇనితు-ఇన్తు=ఇంత (This much, this measure). ఉదా: ఇన్తనక = (Till now) ఇంత దనుక=ఇందాకా. ఇంకన్ — ఇని + కన్ (అగన్) అనఁగా ఇప్పుడు—ఈ వర్తమానకాలము కాఁగా— ఈ కాలము జరుగఁగా—ఈ కాలమైన తరువాత అని యర్థము కలుగుచున్నది.

తనుకన్=తనుకు+అన్ = తనుకన్. తనకు ధాతువు నుండియే "తాఁకు" ధాతు వేర్పడినది. అంతతనుకన్, అనఁగా "అంత— ఆకాలమును లేదా ఆ పరిమాణమును తాకఁగా—చేరఁగా; అంతకాలము చేసువఱకు—అంతవఱకు అనునర్థము కలుగుచున్నది.

ఈ అన్నంతశబ్దము లన్నియు ప్రాచీనభాషలో అల్లంతములే యనుటకుఁ దమిళ కన్నడ తుమున్నంత రూపములు పెక్కు అల్లంతములే యగుటయుఁ గర్మణ్యర్థమునఁ దెనుఁగులో వలెనే వీనిపై "పడు" ధాతువు చేర్పఁబడుచుండుటయుఁ దార్కాణమగుచున్నది.

కన్న. తానిరల్ పట్టం—నీనిరల్ పట్టమ్, కురుకులాధిపం నుడియల్=కురుపతి నుడువన్, చెప్పఁగా.

ఈ అల్లంత శబ్దములపైని "ఒడం" (=తోడన్)అను దానినిగూడఁ జేర్చి చెప్పుదురు. ఉదా: నుడియలొడం=నుడువంగా, నుడివినతోడనే. నుడియల్ పట్టం = నుడువంబడఁగా నని కర్మణ్యర్థమగును. చేయన్, పోవన్ అను నర్థమిచ్చు

శెయ్య, పోగ అను తమిళ తుమున్నర్థక శబ్దములు ప్రాచీన భాషలో అల్లంతరూపములే యైయుండును.

ఇట్లే ప్రాచీనభాషలలోని సర్వనామాంత శబ్దములు కొన్నియు, ఉమ్మంతములలోని మకారము నకారముగా మాఱుటవలనఁ నేర్పడినవి కొన్నియు, అన్నంతములు గొన్నియు, కేవల నకారాంత శబ్దములు గొన్నియు,—నివన్నియుఁ నీ భాషలో నకారాంత శబ్దములై నిలుచుటచే ద్రుతాంతశబ్దములను నొక విభాగ మేర్పడుటకుఁ గారణమైనది. తక్కిన శబ్దములన్నియు సామాన్యముగా నజంతములే యగుటచే నవి యన్నియుఁ గళలుగాఁ బేర్కొనఁబడినవి. ద్రుతమంతమందు లేకుండుటయే కళయగుటకు లక్షణముగాఁ జెప్పఁబడియుండుటచే ద్రుతాంతత్వమును బట్టియే యీ విభాగ మేర్పడినదని వ్యక్తమగుచున్నది. విశేషణముల తుదిని నకారముండదు గావున విశేషణము లన్నియుఁ గళలే. సహజముగ అకారాంతములైన గోడ, మేడ, అమ్మ, మొదలగు ప్రాతిపదికలు —ప్రథమారూపములు కళలే. ప్రథమలోని 'డు' ప్రత్యయాంతశబ్దములు, 'లు' ప్రత్యయాంతశబ్దములును, 'ఉ'కారాంతములే యగుటచేఁ గళలే. ఇవియు—ము, వు, లును గూడ వాస్తవముగా ప్రత్యయములు గావని యీవఱకే చూపఁబడియున్నది. కయి, పట్టి—ప్రత్యయములు కు వర్ణముపైఁ జేరిన అగుయొక్కయు పట్టు ధాతువుయొక్కయు క్త్వార్థకరూపములు గావున ఇకారాంతములైనవి. "యొక్క" అనునది "అగు—

అక్కు" ధాతువునుండి యేర్పడినదే యైయుండును. ఇది సం బంధమును దెల్పునదగుటచేఁ గాబోలు 'వారల' 'తన' అను వానిలోని 'అ'కారమువంటి అకారముతోఁగూడినది గాని ద్రుతాంతము కాలేదు. వచ్చిరి మొదలగు క్రియలు 'ఈర్' అను సర్వనామశబ్ద మంతమందు గల్గియై, రేఫాంతము లగుటచే ద్రుతాంతములు కాలేదు. వచ్చితిమి మొదలగు నుత్తమపురుష బహువచనక్రియల తుది నగపడుచున్న 'ఏము' (నామ్, ఏమ్) అను నుత్తమపురుష సర్వనామ బహువచనరూపములోని "మ" కారము "ఉమ్" మొదలగు శబ్దములలోని మకారము వలెనే "న" కారముగ మాఱిపోయి ద్రుతాంతము కాకపో వుటకది సహజముగ నకారాంతమై (ఏన్) యున్న యేకవచన రూపమునుండి తన విభిన్నత్వమును నిలుపుకోనఁ జూచుటయే కారణమై యుండును. పిదప ఏమ్, లోని మకారము తుది నొక టకారమును గ్రహించి, వచ్చితెము అను రూపముపొం దిన తరువాతనో లేదా యంతకుఁ బూర్వమో, వచ్చి లోని భూతకాలచిహ్నం బగు "ఇ" కారముయొక్క సాహచర్య బలముచే "ఏము" లోని యచ్చులు రెండునుగూడ "ఇ"కార ములుగ మాఱిపోయినవి. కావుననే "వచ్చితిమి" మొదలగు రూపములు హలంతములు గాని యుకారాంతములు గాని యగుట తటస్థింపలేదు.

వ్యతిరేకక్రియలలో రాను—అను నుత్తమపురుషైక వచన రూపము "వత్తును" అనుదానివలెనే ద్రుతప్రకృతికము

కావలసియున్నది. కాని యిందలి వ్యతిరేకార్థక చిహ్నము యొక్క బలముచే నువర్ణముపై గొంత యూఁతపడుట వలనఁ గాఁబోలు దానికి ప్రాధాన్యము కలిగి తుది యుకారముగాని, నకారముగాని యవసానంబునందు ప్రుతత్వమును బొందుట అనఁగా లోపించుట సంభవింపలేదు. ఈ కారణము చేతనే తుమున్నర్థకాన్నంత శబ్దముకు "రాన్" అనుదానితోఁ గలుగు స్వరూపసామ్యము కూడ వారింపబడినది. ఇఁక ఎత్తిలి, ఒత్తిలి అనున విప్పు డవ్యయములుగాఁ బరిగణింపఁ బడుచున్నను వాస్తవముగా నవి ఎత్తిలు, ఒత్తిలు,-అను ధాతువుల నుండి యేర్పడిన క్త్వార్థక క్రియారూపములే యనవచ్చును. ఎత్తిల్లు-ఎత్తిలు, అను క్రియారూపము లిపుడు భాషలోఁ గనఁబడకున్నను, 'ఒత్తిలు' ఒత్తిల్లు, ఒత్తిగిల్లు, మొదలగు క్రియలు-'ప్రక్కకొఱగు' 'అంటుకొను' అనునర్థము గలవి కనఁబడు చున్నవి. ఒక వస్తువు మఱియొక వస్తువుపై కొఱగి గట్టిగా నంటుకొనుట యను నర్థమునుబట్టి 'గట్టిగా' పట్టుగా, అను నర్థమున 'ఒత్తిలి' యనున దొక యవ్యయముగాఁ దరువాతి కాలమునఁ బరిగణింపఁబడియుండును. అట్లే 'ఎత్తిలి' అనునదియు, ఎత్తిలు-ఎత్తిగిలు అనువానినుండి ఎత్తు అగునట్లుగా — హెచ్చుగా—బిగ్గరగా — అను నర్థమునఁ దొలుతఁ బ్రయోగింపఁబడి, కాలక్రమమున దాని మూలధాత్వర్థము విస్మృతమైన పిదప నవ్యయముగాఁ బరిగణింపఁబడఁ జొచ్చియుండును. దీనికి శబ్దరత్నాకరమున,—

"ఎత్తిలి కావుకావురని యేడ్చి తదీయ పయోధరాగ్రముల్,
కుత్తుకదాఁకఁ బీల్చికొని క్రోలె"

(హరి. పూ. 5 .ఆ)

అని హరివంశములోని ప్రయోగము చూపఁబడినది. ఇక్కడ 'ఎత్తిలి' అను దానికి "గట్టిగ" నను నర్థము చెప్పబడి యున్నను, "కంఠమెత్తి యేడ్చినాఁడు-కంఠమెత్తి పాడినాడు" అని యిప్పుడు నిత్యవ్యవహారములో నున్న ప్రయోగములను బోలినదే యీ "ఎత్తిలి" యను ప్రయోగము నని మనము నిశ్చయింపవచ్చును. ఇట్టివి క్త్వార్థక రూపములే యగుటచే గళ లగుట సంభవించినది. ఈ క్త్వార్థక రూపములవలెనే వ్యతిరేక క్త్వార్థకములును గళలైనవి. కొట్టక, తిట్టక-యను రూపములలోని "క" వర్ణంబు వ్యతిరేక క్త్వార్థక చిహ్నం బెట్లయ్యె నను విషయ మించుక పరిశీలింపవలసి యున్నది. "కొట్టు" ధాతువునుండి క్త్వార్థక రూపము-చేసితిని మొదలగు రూపములలో గానవచ్చుచున్న "ఇతు"అనుదానిలోని పూర్వ భాగమగు "ఇ" కారమును మాత్రమే చేర్చుటచే నేర్పడు చున్నది. ఉదా: కొట్టు—కొట్టితిని—కొట్టి. వ్యతిరేకార్థమున— "కొట్టు" నుండి కొట్టను-కొట్టఁడు మొదలగు సంపూర్ణక్రియా రూపము లగుచున్నవి. వీనిలో ను, డు అను సర్వనామ ప్రత్యయములకుఁ బూర్వమునం దగపడుచున్న "అ"కారమే వ్యతిరేక ద్యోతకచిహ్నము. కాని "కొట్టక" అను వ్యతిరేక క్త్వార్థక రూపములోఁ గూడ కకారపూర్వక అకారమే వ్యతి

రేకచిహ్నముగాఁ గనఁబడును. గాని వాస్తవముగా నది యట్టిది గాదు. ఏలయనఁగా నిందలి "క" వర్ణము వేఱొక ధాతువుయొక్క—ప్రాయికముగా "అగు" ధాతువుయొక్క యవశిష్ట భాగమైయుండ నోపును. తక్కిన ద్రావిడభాషల లోనైన నీ కవర్ణ మగపడదు. కాని తమిళమునందలి శెయ్యాదే (= చేయక) పోగాదే (= పోవక) మొదలగు రూపములు "శెయ్యా (అ)దె, పోగా (అ)దె (= శెయ్య+అగాదె, పోవ+ అగాదె)అను మూలరూపములనుండి యేర్పడినవని యూహింప వచ్చును. చేయ (న్) కాదు, పోవ (న్) కాదు—అను వ్యవ హారము తెలుఁగున నిప్పటికిని కలదుగదా. అట్లై "చేయా గాదె – పోవాగాదె యను ప్రాచీనభాషారూపములనుండి "చెయ్యాదె, పోవాదె" యని తమిళమునను, చేయక, పోవక అను రూపములు తెలుఁగునను, (మాడాదె) మాడదె— (హోగాదె) హోగదె అను నవి కన్నడమునను బయలుదేరి యుండును. దీనినిబట్టి "చేయక" అను రూపములోని 'క' కారము "అగు" ధాతువునుండి యేర్పడిన వ్యతిరేకార్థక "అగాదు" అనుదానికి సంబంధించినదనియు "క" కారముపై గల "అ"కారమే వ్యతిరేకభావచిహ్నమనియు, నట్లది ప్రత్యే కార్థద్యోతక మగుటచేతనే పదాంతమున లోపింపకుండెన నియు నాకారణముచే నది ద్రుతాంతము కాక కళయయ్యె ననియు, నిశ్చయింపఁ దగియున్నది. ఊరక, మిన్నక అను తూష్ణీమర్థకావ్యయములు కూడ నిప్పుడు భాషలో వ్యవహా

రమునుండి తోలఁగిన ఉరు=ఉంచు – విజృంభించు; మిన్ (మించు ?)=ప్రకాశించు, అను ప్రాచీనధాతువులనుండి యేర్పడిన వ్యతిరేక క్త్వార్థకరూపములే యైయుండును. కావుననే కళలైనవి. బళి మొదలగు ప్రశంసార్థకశబ్దంబులు; అక్కట, అయ్యో అను సంతాపార్థకంబులు; అదియ, అదే అను నవధారణార్థకములు మొదలగువానిలోని తుదియచ్చులు శబ్దగతములు. ఇవి యంతమున నిలిచి యాయా యర్థములను సూచించుచున్నవి. కావున నాయా శబ్దములు నకారాంతములు లేదా ద్రుతప్రకృతికములు కాక కళలే యైనవి.

ఈ భాష చాలవఱ కజంతభాషగా మాఱిపోయి, పదాంతమందు నిలిచియున్న హల్లులలో నొక్క నకారము మాత్రమే ప్రాధాన్యము వహించిన దగుటచే నీ భాషలో ద్రుతాంతశబ్దములు ప్రత్యేక మొక తెగగా నేర్పడి ద్రుతప్రకృతికములనియు, నట్లు ద్రుతాంతములు కాని తక్కిన శబ్దములు కళలనియు నొక విభాగ మేర్పడుట తటస్థించినదని తెలియవచ్చుచున్నది.

సంహితలో ననఁగా రెండు పదముల కవ్యవహిత సాన్నిధ్యము గలిగినపుడు పూర్వపదాంత నకార మొకప్పుడుఁ వెనుకటి యచ్చులతోఁగూడ లోపించి, పరస్వరం బచ్చోట నిలుచుటయు, మఱియొకప్పుడు ద్రుతముపై సరళాదేశాది కార్యములును జరుగుటయు, ద్రుతాంతములుకాని కళలపై నొకప్పుడు సంధి జరుగుట లేదా యడాగమాదులు గలుగు

టయు సంభవించుచుండుటచేతను, నీ సంధి ప్రకరణమును చదువుకొనవలసిన యావశ్యకత యేర్పడుచున్నది. మొత్తము పైని సంస్కృతభాషలోవలె సవర్ణదీర్ఘ గుణవృద్ధి యణాదేశాది సంధికార్యము లిందు లేకుండుటచే నీ భాషలోని సంహితా కార్యములు భిన్నపద్ధతుల ననుసరించి యేర్పడిన వనుటకు సందేహములేదు. మఱియు సంధి విషయమున నాంధ్రమం దవలంబింపఁబడిన పద్ధతులే తక్కిన దక్షిణదేశ భాషలందు నగపడుచున్నవి. కాని, సంస్కృతభాషలోని సంధి పద్ధతు లగపడుటలేదు. కావున వీని సాజాత్యమును నిర్ణయించుట కిదియు నొక యాధారం బగుచున్నది.

## సంధి విషయమున నాంధ్ర తమిళ కర్ణాట భాషలకు గల సామ్యము.

1. ఈ భాషలలో పూర్వపదాంత్యవర్ణము పరపదాది వర్ణముతోఁ గలియుటయే సంధి యగుచున్నది. సంధికార్యములలో తమిళ కన్నడముల నంత్యహల్ద్విత్వము, ప్రకృతి భాగము ననునవి విశేషములు. ఆంధ్రవైయాకరణు లంత్యహల్ద్విత్వమును బ్రత్యేకవిధిగాఁ జెప్పకున్నను, "పదాహతిన్ + ఎగసి=పదాహతిన్నెగసి;సర్వమున్ + అతని=సర్వమున్నతని" అను నిట్టి కవిప్రయోగములం దంత్యహల్ ద్విత్వము కాన వచ్చుచునే యున్నది. ఇట్టి స్థలములందలి ద్విత్వ నకారము కలుగుటకుఁ గారణముతొలిపదాంతమునఁ జేరిన యొక పదము

చ్చయ "ను"కారమేగాని వేఱుగాదని కొందఱు సమర్థింప యత్నించిరి. సంస్కృతభాషలోఁగూడ హ్రస్వపూర్వకమగు పదాంతానునాసిక మచ్చుపరమైనపుడు ద్విత్వమును బొందుచుండుట కలదు. (ఉదా: ప్రత్యఙ్ + ఆత్మా = ప్రత్యఙ్ఙాత్మా, సన్ + అచ్యుతః = సన్నచ్యుతః, సుగణ్ + ఈశః = సుగణ్ణీశః మొ॥) తమిళమునఁగూడ నిట్టి మార్పు గలుగుచున్నది. ఉదా. కణ్ + ఆశై = కణ్ణాశై, ఎన్ + ఆశై = ఎన్నాశై, కల్ + అఱివు = కల్లఱివు, మెయ్ + ఆశై = మెయ్యాశై. ఇచ్చట విశేష మేమనఁగా సంస్కృతమున నొక్క యనునాసికమే ద్విత్వమును బొందుచుండగా హ్రస్వపూర్వకములగు ననునాసికేతర హల్లులును అచ్చు పరమైనపుడు ముఖ్యముగా ననుకరణమున ద్విత్వమును బొందుట తెలుఁగున గలదు. ఉదా: కింతత్ + అనియె = కింతత్తనియె, మొ॥ కావునఁ బరిశీలింపఁగా పరపదాదిస్వర మూఁదవలసియున్నపుడు వెనుక నూఁదఁబడిన స్వరమునకును దీనికిని గొంత వ్యవధానము కల్పించుటకుఁగా వెనుకటి హల్లు ద్విత్వము నొందుటయే యీ మార్పునకుఁ గారణమై యుండునని తోఁచుచున్నది.

2. కొన్ని స్థలముల సంధి కలుగకుండుట తమిళ కన్నడములందు వలెనే తెలుఁగునను గలదు. కాని సంధి లేనిచో నుచ్చారణసౌకర్యమునకై సంధ్యక్షరముగా యకారము నియమితముగాఁ గలుగుచుండునే గాని కేవల ప్రకృతి భావ మనునది తెలుఁగు భాషలో లేదు. మఱియు తమిళ

కన్నడములలో వలె వకారము సంధ్యక్షరముగాఁ దెలుఁగులో గ్రహింపఁబడుటయును లేదు.

3. ఈ భాష లన్నిటిలో నచ్చు పరమయినపుడు పదాంతమందలి అ, ఇ, ఉ, ఎ లు సామాన్యముగా లోపించి సంధి జరుగుచునే యున్నది.

4. ఆంధ్రమున వలెనే యీ భాషలలో నచ్చుకంటె పరమైన పదాది క, త, ప వర్ణములు గ, ద, వ లగుచున్నవి. కాని కన్నడమందలి విశేషమేమనఁగా ప వర్ణము బకారముగ మాఱుటయేగాక, ప, బ, మ లు మూఁడునుగూడ "వ" కారముగ మాఱుచున్నవి. ఆంధ్రమున 'చ' కారము సకారమగుచుండ కన్నడమున సకారము చకారముగా మాఱుటయుఁ గాననగును. ఇట్లే స్వల్పభేదములున్నను పెక్కువిషయములలో సామ్య మగపడుచునే యున్నది.

దీనినిబట్టి విశేషవిధులలో యత్కించిద్భేద మున్నను సామాన్యసంధిపద్ధతులలో నీ భాషల కన్నిటికిని చాల చేరిక గలదని యీ భాషాలక్షణములను సరిపోల్చి చూచినవారికి వ్యక్తము కాకమానదు. మఱియు నొక భాషయందలి లక్షణ విశేషముల నితర భాషాలక్షణములఁతో బోల్చి చూచినపుడా విశేషలక్షణములకుఁ గల కారణములు తెల్లంబగుటయు, వాని పూర్వచరిత్రము ఆయా భాషల ప్రాచీనస్థితి వ్యక్తమగుచుండుటయుఁ దటస్థించును. కావున నిట్టి చారిత్రక విమర్శ

నమువలన నాయా భాషాలక్షణవిశేషముల పూర్వచరిత్రము, వానియందలి సామ్యము, నాయా భాషలకుఁ గల సన్నిహితత్వము మొదలగునవి బయలుపడుచుండుటే గాక, వీని కన్నిటికిని మూలమగు ప్రాచీనమాతృభాషాస్వరూపము గుర్తింపఁబడుటకుఁగూడ నవకాశ మేర్పడఁగల దనుటకు సందేహము లేదు. సంధినిగూర్చిన యీ చారిత్రకపరిశీలనము ద్రావిడభాషాకుటుంబచరిత్రాన్వేషణమునకుఁ దోడ్పడఁ గల దని యూహించుచున్నాను.



# కోరాడ రామకృష్ణయ్య, ఎం. ఏ. గారిచే

రచింపఁబడిన ఇతర గ్రంథములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ఆంధ్ర భారత కవితావిమర్శనము | ... | 3 | 0 | 0 |
| 2. | కాళిదాసుని కళాప్రతిభలు | ... | 0 | 8 | 0 |
| 3. | భాషోత్పత్తిక్రమము — భాషాచరిత్రము | ... | 1 | 8 | 0 |
| 4. | దక్షిణదేశ భాషాసారస్వతములు—దేశి | ... | 2 | 8 | 0 |
| 5. | సంధి — చారిత్రక పరిశీలన | ... | 3 | 0 | 0 |
| 6. | సారస్వత వ్యాసములు | ... | 1 | 8 | 0 |
| 7. | భాషాచారిత్రక వ్యాసములు | ... | 2 | 8 | 0 |

# కోరాడ రామచంద్ర కవి గ్రంథములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | బాలచంద్రోదయః—సంస్కృత గద్య | ... | 0 | 8 | 0 |
| 2. | ఘనవృత్తము — సంస్కృత కావ్యము కాళిదాస మేఘసందేశోత్తర కథాభాగ రూపము — టీకాతాత్పర్య సహితము | | 1 | 0 | 0 |
| 3. | మంజరీ మాధుకరీయము — తెలుగునాటిక | | 1 | 0 | 0 |
| 4 | నయప్రదీపము — తెలుగు గద్య | ... | 1 | 0 | 0 |
| 5. | పరశురా[illegible] విజయము | ... | 0 | 8 | 0 |
| 6. | రథాం[illegible]తము | ... | 0 | 6 | 0 |



ప్రతులకు

కోరాడ రామకృష్ణయ్య, ఎమ్. ఎ.,
33, సింగరాచారి వీధి,
ట్రిప్లికేన్, మదరాసు - 5.